# దక్షిణ భారత చరిత్ర

(ప్రథమ భాగము)

మూలము:

డా॥ కె. కె. పిళ్ళై ఎం.ఎ; యల్.టి; డి.లిట్; డి.ఫిల్; (ఆక్సన్)
మదరాసు విశ్వవిద్యాలయ ప్రధాన అధ్యాపకులు.

అనువాదము:

దేవరకొండ చిన్నికృష్ణశర్మ

ప్రకాశకులు:
ది మోడరన్ పబ్లిషర్సు (Regd) తెనాలి

# *Telugu Translation of South Indian His*
(Vol. I)

*By*
Dr. K. K. PILLAI

*Translator:*
D. CHINI KRISHNA SARMA



**First edition: Nov. '59.** **5000 Copies**

**Price : Rs. 2-50 n. p.**

**Published under the auspices of the
Southern Languages Book Trust, Madras.**

TELUGU 42

*Printed at:*
Sri Ajanta Art Printers, Kollur.

# పరిచయం

—x—

దక్షిణ భాషా పుస్తక సంస్థవారు ప్రోత్సహించిన ఉత్తమ గ్రంథ సంచయములోని తొలి ప్రచురణలివి. తమిళం, తెలుగు, మళయాళం, కన్నడం—నాలుగు దక్షిణాది భాషలలో విద్యాసాంస్కృతిక వికాసాలకు దోహదమిచ్చే ఉత్తమగ్రంథాలను చౌకగా ప్రచురింప చేయాలనే సత్సంకల్పంతో, సముదార దూర దృష్టితో ఫోర్డు ధర్మనిధి వారు ఈ సంస్థ నిర్మాణాన్ని తలపెట్టారు. ఇందుకోసం వారు దక్షిణ దేశంలో ఉన్న ఏడు విశ్వ విద్యాలయాల ఉపాధ్యాయులతోను సంప్రదించి ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలకు, మంచి మంచి పుస్తకాలను, ప్రచురణ కర్తలచే అందంగా అచ్చువేయించి అందరికి అందుబాటులో ఉండే సరసమైన ధరలకు అందచేయాలనే ఆదర్శంతో మూడేళ్ల కార్యక్రమాన్ని రూపొందించారు. వీరి కృషివలన మనకులభించిన ప్రథమఫలాలివి. దీన్ని కూర్చడంలో వీరు ప్రౌఢశైలిలో ఉండే విద్వత్కావ్యాల జోలికి పోకుండా కేవలం మాతృభాషలో మాత్రమే అక్షరాస్యులైన, ఆంగ్ల భాషావాసనలేని అసంఖ్యాకసామాన్య ప్రజానీకాన్ని అలరించి, ఆకర్షించి, వారికి విజ్ఞానాన్ని, వినోదాన్ని, వికాసాన్ని పూర్తిగా అందించగల సులభ సుందరశైలిలో ఉన్న ఉత్తమ గ్రంథాలను మాత్రమే ఎన్నుకున్నారు.

ఉన్నత సారస్వత శ్రేణికి చెందిన స్వతంత్ర రచనలనే కాకుండా వైజ్ఞానిక, సాంస్కృతిక గ్రంథాలనూ, ప్రపంచ సారస్వతంలోని ఉత్తమగ్రంథాల అనువాదాలనూ కూడా ప్రచురింప చేయడం వీరి ప్రధాన లక్ష్యం.

ఒక్కమాటలో చెప్పాలంటే "ఉత్తమగ్రంథాలను చౌకగా అందించడం అనేదే దక్షిణభాషా పుస్తక సంస్థవారి పరమాశయం. ఇందులో వీరెంతవరకు కృతకృత్యులైనదీ ఇప్పుడీ గ్రంథాలనుబట్టి ప్రజలే నిర్ణయించవలసి ఉంది. ఇప్పుడు ప్రారంభమైన ఈ కృషి ఫలితం బహుశా వచ్చే పది సంవత్సరాల వరకు అంతగా కనబడక పోవచ్చు. కాని ఈ ప్రణాళిక అద్భుతమైనదని, అత్యంత ప్రధానమైనదనిమాత్రం దూరదృష్టి గలవారందరూ ఒప్పుకోనక తప్పదు. ఇందుకుగల అవకాశాలనేకం. అందమైనఅచ్చుతో చౌకగా అందరికీ అందుబాటులో ఉండే ఈ ఉత్తమ గ్రంథాలు దేశంలో మారుమూల కుగ్రామాలలో నివసించే లక్షలాది స్త్రీ పురుషులందరి జీవితాలకు కొత్త వెలుగునీ, విజ్ఞానాన్ని అందించగలవు.

దక్షిణభాషా పుస్తకసంస్థవారి కార్యక్రమాలు ప్రస్తుతానికి తమిళం, తెలుగు; మళయాళం; కన్నడం—నాలుగు దక్షిణాది భాషలకే పరిమితమై ఉండడం వింతకాదు. ప్రాచీన కాలంలో వింధ్యకు దక్షిణానఉండే దేశమంతా దక్షిణాపథమనే పేరుతో వ్యవహారంలో ఉన్నప్పటికీ, సాంస్కృతికంగా ఇక్కడ నివసించే ప్రజలందరూ ఈనాలుగుభాషలనూ వాటిప్రాంతీయ వికృతులను మాత్రమే వాడుక చేసేవారు. నిజానికి ఈ నాలుగు భాషలున్నూ ఒకే కోవకు చెందినవి. వీటిని 'ద్రావిడ' భాషలనడం నా అభిమతంకాదు. ఈరోజుల్లో 'ద్రావిడ' పదం జాతి, భాషా పరమైనదిగా కాక ప్రత్యేకమైన రాజకీయ ప్రాధాన్యాన్ని సంతరించుకోవడమే నాయీసంకోచానికి కారణం. ఈ నాలుగు భాషలకు మధ్య సహజమైన సన్నిహిత సంబంధాలు చాలా ఉన్నవి. పైగా ఆర్యావర్తంలో వ్యాప్తిలో ఉన్న

సంస్కృతికంటె భిన్నమైన దక్షిణ భారతీయ సంస్కృతికి ఈ ప్రాంతం ఆటపట్టు. కర్ణాటక సంగీతసంప్రదాయం ఇక్కడిదే. అలాగే ఇక్కడి వాస్తు, శిల్ప సంపద ఉత్తరాది దానికంటె భిన్నమైనది. ఈ నాలుగు భాషలు మాట్లాడే ప్రజలు అనూచానంగా అనుసరించే సాంఘికాచార వ్యవహారలన్నీ కూడా ఒక్కటే.

దక్షిణభాషాపుస్తకసంస్థవారి ప్రోత్సాహం వల్ల ప్రచురితమయ్యే పుస్తకాలన్నీ దాక్షిణాత్య సంస్కృతిని ప్రతిబింబించేవిగా ఉండగలవని ఆశిస్తున్నాను. అయితే సంకుచితమైన స్వస్థాన భాషావేషానురతి శృతిమించిపోకుండా సమగ్ర భారత సంస్కృతిని ప్రతిబింబింప జేసే పుస్తకాలను, విశ్వమానవ సౌభ్రాత్వాన్ని, ప్రపంచ కల్యాణాన్ని కాంక్షించే ఉత్తమ గ్రంథాల అనువాదాలను ప్రచురించడం చాలా అవసరం.

పా. వేం. రాజమన్నారు.

# తొలిపలుకు

—x—

నేను మదరాసులో ఉన్నప్పుడు దక్షిణభాషా పుస్తక సంస్థ వారి పనిమీద నా చిరకాల మిత్రుడు జి. వి. కృపానిధి అనేక పర్యాయాలు నన్ను కలుసుకొని మాట్లాడే వాడు. మదరాసు విశ్వవిద్యాలయములో చరిత్రాధ్యాపకులుగా ఉన్న డాక్టరు. కె. కె. పిళ్ళేగారు "దక్షిణభారత సంక్షిప్త చరిత్ర" అనే గ్రంథం రచిస్తున్నారనీ, ఆ గ్రంథాన్ని పై సంస్థవారు ప్రకటన చేయిస్తారనీ అతను చెప్పగా విని చాలా సంతోషించాను. ఇప్పుడు ఆ గ్రంథం అచ్చుకి సిద్ధంగా ఉండటం నాకు ఎంతో ఆనందం కలిగించింది. మన చరిత్ర చక్కగా తెలుసుకొనడానికి ఈ గ్రంథం ఎంతో ఉపయోగిస్తుందనడంలో సందేహంలేదు.

చరిత్ర అనేది వాస్తవాన్ని చిత్రించేది కావాలి. ఆయా సంఘటనలు యథాతథంగా మనకు బోధపడాలి. అయినప్పటికీ చరిత్ర రచనలో నిర్దుష్టత, నిష్పక్షపాతవృత్తీ అనేవి మనకు అలవడలేదు. ఏ సంఘటన కయినా కారణాలు, ఫలితాలు పేర్కొనేటప్పుడు సత్యాన్ని కప్పిపుచ్చటం సర్వసాధారణముగా కనబడుతున్నది. సుదీర్ఘమైన మనదేశ చరిత్రలో అనేక విప్లవాలు తటస్థించడంవల్ల చరిత్రకారుల దృక్పథాల్లో వైవిధ్యం గోచరిస్తున్నది. తమ మతాన్నిగాని, కులాన్నిగాని, సమర్థించే తలంపుతో సత్యం ప్రకటించవలసిన పవిత్ర బాధ్యతకు స్వస్తి చెప్పి, చరిత్రను తారుమారుచేసి ప్రజలకు నిజం తెలియకుండా

చేస్తున్నారు. దానివల్ల మనం మన సంస్కృతిని అలక్ష్యం చెయ్యడమే కాకుండా, చరిత్రను ఆవిధంగా మఱుగుపఱచిన వ్యక్తుల అభిమతాన్ని పాటించి మనపూర్వులను గురించి యేమీ తెలిసికోలేక పోతున్నాము.

స్వాతంత్ర్యం రాగానే దేశంలో ఒకనూతనోత్సాహం బయలుదేఱింది. పూర్వచరిత్రా, పూర్వపుఘనతా, తెలుసుకోవాలని ఒక ఆకాంక్ష ఉదయించింది. దేశం అనేకప్రాంతాలుగా వేర్వేఱుగా కనబడుతున్నా దేశంమొత్తంలో ఉన్నవారము అందఱమూ ఒకటే అనేభావం దృఢంగా మనహృదయాల్లో నాటుకొన్నది. ఔత్తరాహులమైన మాకు దక్షిణదేశాన్ని గుఱించి యేమీ తెలియదు. చరిత్రను గుఱించి మాట్లాడవలసివస్తే అది కేవలం ఉత్తర హిందూస్థానానికి సంబంధించిందే అనుకొంటాము. దాక్షిణాత్యుల ఘనతను పూర్తిగా నిర్లక్ష్యం చేశాము. మద్రాసులో దాదాపు అయిదేళ్లు ఉండడం చేతనూ, దక్షిణదేశములోని అనేకప్రాంతాల్లో పర్యటిస్తూ ఉండడంవల్లనూ దాక్షిణాత్యుల వైశిష్ట్యము సంస్కృతి విశేషాలూ నాకు బాగా బోధపడ్డాయి. కొన్ని శతాబ్దాలపాటు బహుముఖాలుగా విజృంభించిన వారి చైతన్యవిశేషం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. నాకు మనప్రాచీన చరిత్ర ఇంకా తెలుసుకోవాలనే కుతూహలం అత్యధికం. దేశచరిత్రలో ప్రముఖస్థానంఆక్రమించిన మహావ్యక్తుల్ని గురించి, సంఘాన్ని గురించీ, పూర్వులు మనకు ప్రసాదించిన చిత్రలేఖనం

శిల్పం, వేదాంతం, సారస్వతం, సంగీతం మొదలైనవాటిని గురించీ, భౌతికవిజ్ఞానం, వైద్యం, గణితం, వాస్తు మొదలైన శాస్త్రాలను గురించీ తెలుసుకోవాలనే ఉత్సాహం నాలో చాలా ఎక్కువ.

ప్రొఫెసర్ కె. కె. పిళ్ళైగారి ఈ గ్రంథం పండితుల్నీ పామరుల్నీకూడా నిస్సందేహంగా రంజింపజేస్తుంది. దక్షిణ భారతచరిత్ర తెలియని మనవారికి దీనివల్ల దేశచరిత్రా స్వరూపమూ, పురాతన సంప్రదాయాలూ, ఆశయాలూ, పూర్వుల శక్తి సామర్థ్యాలూ సమస్తము బోధపడగలవు. ఉత్తరదక్షిణ భారతాల అన్యోన్యత వృద్ధికాబిస్తూవచ్చిన అనేక శతాబ్దాల నాటి పరస్పర బాంధవ్యం వారు అర్థం చేసుకోగలరు, అందువల్ల సమస్త భారతీయులూ, మన ఐకమత్యాన్ని ఆచరణద్వారా ఋజువు పరుస్తూ, బహుకాలానికి సంపాదించుకొన్న స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోగలరని నేను విశ్వసిస్తున్నాను.

రాజభవనం,
బొంబాయి - 6
28—3—56

(సం) శ్రీప్రకాశ
బొంబాయి గవర్నరు.

# వి ష య సూ చి క



# చిత్ర సూచిక

# దక్షిణ భారత చరిత్ర

## ప్రథమాధ్యాయం

### చరిత్రపై భౌగోళిక పరిస్థితుల ప్రభావము

"ప్రాచీన హిందూదేశచరిత్రకారులు చాలామంది ఈనాటివఱకు కూడా దక్షిణ హిందూదేశం అనేది ఒకటి ఉన్నదనే విషయాన్ని గమనించకుండానే చరిత్రరచన చేస్తూ వచ్చారు." అని వి. ఎ. స్మిత్ ఎంతో పరిశీలనమీద అన్నాడు. శాస్త్రీయ పద్ధతిలో క్రమబద్ధంగా హిందూదేశ చరిత్ర రచించిన వారిలో ఈయన మొదటివాడు. హిందూదేశచరిత్ర దక్షిణభాగంలోనే ఆరంభ మయినదన్న సత్యం గుర్తిస్తే స్మిత్ వాక్యంలో వింత లేదు. దక్షిణహిందూదేశంలోని భూమిచాలా పురాతన మయినదనీ, హిమాలయాలుకానీ, ఉత్తరహిందూదేశంకానీ సముద్ర గర్భంనుంచి బయటపడటానికి పూర్వమే ఈ దక్షిణ భాగంలో మనుష్యులు నివసించేవారనీ భూగర్భ శాస్త్రజ్ఞులు చెప్తు తున్నారు. "శాస్త్రీయంగా హిందూదేశ చరిత్ర రచింపదలచిన వాడు ఈనాటివఱకూ చరిత్రకారులందరికీ వాడుకగా లక్ష్యంగా ఉన్న గంగాప్రాంతం వైపునుంచి తన దృష్టి మరల్చి మొట్ట మొదట కృష్ణా కావేరీ వైగై నదీ ప్రాంతాల వైపు ప్రసరింప జెయ్యాలి," అని ఒక భారతీయ విద్వాంసు డన్నాడంటే మనం ఆశ్చర్య పడనక్కరలేదు.

దక్షిణహిందూదేశచరిత్రను ఉత్తరదేశచరిత్రతోబాటు ఆదినుంచీ పరిశీలించకపోవటానికి చెప్పే కారణం ఏమంటే

అందుకు కావలసిన సాధనసంపత్తి కనబడటం లేదనే. అదీ కాక ఉన్న కొంచమైనా చరిత్రకారులు వినియోగించుకోక పోయారు. హిందూదేశపు ప్రాచీనస్థితిని చిత్రించాలంటే దక్షిణ హిందూ దేశ ప్రాచీనత స్పష్టీకరించే ఆధారాలను వినియోగించి తీరాలి. ఎందుచేతనంటే దక్షిణహిందూదేశభౌగోళికస్థితినిబట్టి అందులో చాలాభాగం ఉత్తరదేశంతో సంబంధం లేకుండానే ఎంతో పూర్వకాలంనుంచీ స్వతంత్రచరిత్రతో ఉన్నట్లు కనబడుతుంది.

వింధ్య సాత్పురా పర్వతాలూ వాటి పరిసరాల ఉన్న మహారణ్యాలూ దక్షిణ దేశాన్ని ఉత్తర దేశంనుంచి వేఱు చేస్తున్నవి. అయితే ఈ వేఱుపడడంవల్ల ఉత్తరానికీ దక్షిణానికీ సంబంధ బాంధవ్యాలుపూర్తిగా కట్టువడలేదు. ఈపర్వతపు కనుమల వల్లనూ సముద్రంవల్లనూ రెండు దేశాల మధ్యా రాకపోకలకు అవకాశాలు ఉన్నాయి. కానిఉత్తరాన పుడుతూ వచ్చిన రాచరికపు తుపానన్నిటికీ దక్షిణ హిందూదేశం తల వగ్గవలసిన అవసరం లేకుండా పోయింది. ఉత్తర హిందూ స్థానం మీాదదండెత్తిన విదేశీయులు గంగా తీరందాటి దక్షిణానికి రాలేదు. ఉత్తరంనుంచి దక్షిణ హిందూదేశం గుండా ప్రవహించే నది ఒక్కటికూడా లేకపోవడంవల్ల ఉత్తరదేశంతో దక్షిణదేశానికి రాకపోకలు జరిగే అవకాశంలేకపోయింది.

ఉత్తరాన పర్వత శ్రేణులూ నర్మదా తపతీ నదులూ, అరేబియా సముద్రానికీ బంగాళాఖాతానికీ సమాంతరాలుగా సాగిన పడమటికనుమలూ తూర్పుకనుమలూ, దక్షిణహిందూ దేశానికి ఒక విశిష్టతను తెచ్చాయి. వాస్తవానికి ఈద్వీపకల్పం దక్షిణాభిముఖమైన ఒక త్రిభుజంలాగా ఉన్నది. దీని శీర్షం కన్యా

కుమారి. ఈ రెండు పర్వత పంక్తులూ నీలగిరివద్ద ఐక్యమైనాయి. ఇవి కొంచెం దక్షిణంగా సాగి అక్కడితో అంతమౌతున్నాయి. ఆతర్వాత సముద్రమే.

పడమటి కనుమలకూ అరేబియా సముద్రానికీ నడుమ ఉన్న సన్నని భూభాగం చాలా సారవంతమైనది. ఇది కొంకణం, మలబారు అని రెండు చిన్న దేశాలుగా ఉన్నది. పడమటి కనుమలు తెంపు లేనివి. ఇవి సాధారణంగా 2500 అడుగుల ఎత్తుకు తక్కువ గాకుండా ఉన్నవి. నీలగిరి వద్ద వీటి ఔన్నత్యం 7000 అడుగులు. పాలఘాట్ వల్ల మలబారుకు తూర్పు దేశంతో కొంత సంబంధభాంధవ్యాలకి అవకాశం కలిగినా మలబారు ఒక ప్రత్యేక భూభాగంగానే ఎన్నబడుతున్నది. మిగతా ద్వీపకల్పంతో దీనికి ఎక్కువ సంబంధం లేదు. తూర్పుకనుమలు అంత ఎత్తైనవికావు; తెంపు లేనివీకావు.సరిగా ఒకేవరుసలోనూ లేవు. అందువల్ల ఈపర్వతశ్రేణులు సముద్రతీరప్రాంతానికీ మధ్యపీఠభూమికీ రాక పోకలకు ఆటంకాలు కలిగించేవి కావు. ఈపీఠభూమి సముద్రపు మట్టంకంటె రెండు వేలఅడుగుల ఎత్తువఉకూఉన్నది మైసూరువద్ద ఇది తక్కిన చోట్ల కంటె ఎత్తుగా ఉన్నది. ఇందులోనదీప్రాంతాలు సారవంతాలైనా డెల్టాకానిప్రాంతాలు ఫలవంతాలు కావు. మహారాష్ట్రంతో కలిపి బొంబాయిరాష్ట్రంలోని పర్వత ప్రాంతాలు సారవంతాలు కానందువల్ల అక్కడి ప్రజలు సమీప ప్రాంతాల్లోని భూస్వాముల వద్ద కాయకష్టం చేసి జీవించాలి. ఇటువంటి పరిస్థితివల్ల వారు దృఢకాయులూ తమశక్తి మీద నే తాముజీవించవలసినవారూఐనారు. తిరునల్వేలి, దిండిగల్, సేలం జిల్లాలలోనూ, రాయలసీమ. హైద్రాబాదు, ప్రాంతాల్లోనూ ఇదేవిధంగా ఎంతో భూమి వ్యవసాయానికి పనికి

రానిదైంది. ఇక్కడిభూమి సారవంతమూకాదు; వర్షపాతమూ తక్కువ.

దక్షిణహిందూదేశంలో చాలా భాగం అక్టోబరు నెల నడిమినుండి సాగే ఈశాన్య ఋతుపవనం మీద ఆధారపడి ఉన్నది. మేనెల చివర నుంచీ ప్రారంభమయ్యే నైరృతీ ఋతుపవనం వల్ల దక్కను పీఠభూమిలో అప్పుడప్పుడు వర్షాలు కురుస్తూ ఉంటాయి కాని, ఈ పవనంవల్ల కొంకణం మలబారు తీరాలలో విశేషవర్షపాతం ఉంటుంది. పడమటితీరాన సరాసరి వర్షపాతం ఎనభై అంగుళాల పైగా ఉంటుంది. అయితే పడమటికనుమలకు తూర్పునఉన్న పీఠభూమిలో సరాసరి వర్షపాతం నలభై అంగుళాలకు కూడా తక్కువే. వ్యవసాయం చాలావఱకు ఋతుపవనం మీదే ఆధారపడి ఉంటుంది. అప్పుడప్పుడు వీచే గాలులవల్లకొంత, వఱదలూ తుపానులూ గాలివానలవల్ల మఱికొంతా కఱవులు తఱచూ కలుగుతూఉంటాయి. వీటివల్ల ప్రజలు జీవితంలోని కష్టసుఖాలన్నింటికీ అదృష్టమే ప్రధానమని భావించేవారౌతారు.

వేర్వేఱు ప్రాంతాల్లో వర్షపాతం వేర్వేఱుగా ఉన్నా దక్షిణహిందూదేశం అంతా ఉష్ణమండలములోఉన్నది. ఉత్తరదేశంలో లాగా ఎండలు దుర్భరం కాకపోయినా సహజంగా దక్షిణహిందూదేశం ఉత్తరదేశం కంటె అధికోష్ణ మండలమే. వాతావరణం చెమ్మగా ఉన్నకొద్దీ వేసవి చలికాలాల మధ్య ఉష్ణోగ్రతల భేదంకూడా తగ్గితీరాలి. దక్షిణహిందూదేశంలో పశ్చిమతీరం చాల చెమ్మగా ఉంటుంది. కాని తూర్పుతీరానా మధ్యదేశంలోనూ నేల పొడిగాఉంటుంది. బళ్లారి పరిసరాలూ

మైసూరులోని ఉత్తర ప్రాంతమూ, పడమటి కనుమలకూ హైదరాబాదురాష్ట్రానికీ మధ్యఉన్న బొంబాయిరాష్ట్రభాగము మొత్తం దక్షిణహిందూదేశంలో ఏమాత్రమూ చెమ్మలేని ప్రాంతాలు.

శీతోష్ణస్థితిగతుల ప్రభావాన్ని కొందఱు లెక్క చెయ్యరు. మానవుని బుద్ధిసూక్ష్మతమీదనూ శీతోష్ణస్థితిగతుల వల్లకలిగే అవరోధాలను అతిక్రమించడానికి తోడ్పడే భౌతికవిజ్ఞానశాస్త్రం మీదనూ వారికి ఎక్కువ విశ్వాసం ఉంటుంది. అయితే ప్రస్తుత పరిస్థితుల్ని బట్టి విచారిస్తే ఇది పూర్తిగా సత్యంకాదు. గతచరిత్రనుబట్టి ఆలోచిస్తే భౌతిక విజ్ఞానం ఎక్కువగా అభివృద్ధి చెందని కాలంలో శీతోష్ణస్థితుల వల్లనూ, ఇతర భౌగోళిక పరిస్థితులవల్లనూ కలిగిన అసౌకర్యాలు ప్రజలజీవితాలమీద చాల వఱకు తమ ప్రభావం ప్రదర్శించాయి.

వర్షపాతమూ, పర్వతాలఉనికీ, నదీగమనాన్ని ఉపయోగాల్ని నిర్దేశిస్తాయి. పడమటి కనుమలవద్ద కురిసే విశేష వర్షం వల్లనే దక్షిణహిందూదేశాని కంతటికీ సౌందర్యం తెచ్చిన నదులు వృద్ధిపొందుతున్నాయి. భూమి పశ్చిమమునుండి తూర్పు వైపు వాలుగా ఉండడంచేత తపతీ నర్మదానదులుతప్ప తక్కిన నదులన్నీ పడమట పుట్టి తూర్పుముఖంగా మైదానాల్లో ప్రవహిస్తూబంగాళాఖాతంలో కలుస్తున్నాయి. దక్షిణహిందూదేశ చరిత్రలో ఈ నదులకు చాలా ప్రాముఖ్యం ఉన్నది. పురాతన కాలం నుంచీ జనసంఖ్య యింతగాలేనిరోజుల్లో ప్రజలు సాధారణంగా నదీసరిసరాలలోనే నివసిస్తూవచ్చారు' పట్టణాలు రాజధానీ నగరాలూ నదీతీరాల మీదనే వెలసినాయి. పుహార్

వాంచీ, మధురా, విజయనగరం, కంపిలీ, నదీతీరాల వెలసిన రాజధానీనగరాలు. ఇంతేకాక, నర్మదా, కృష్ణా, తుంగభద్రా మొదలయిన కొన్ని నదులు రాజ్యాలకూ సారవంతాలైన భూభాగాలకూ సహజాలైన ఎల్లలుగా పరిగణించ బడుతూ వచ్చాయి. కృష్ణా తుంగభద్రానదులచేత పరివేష్టితమైన రాయచూర్ దుర్గం వెనకటి కాలంలో దక్కనులో అన్యోన్య జిగీష కల ప్రభుత్వాలకు కలహకారణంగా ఉంటూ ఉండడమే ఇందుకు దృష్టాంతం.

దక్షిణహిందూదేశాన్ని తుంగభద్రానది రెండు ముఖ్య భాగములుగా విభజించిందని చెప్పవచ్చు. ఈనదికి ఉత్తరాన ఉన్న భూభాగం దక్కను అనీ, దక్షిణాన ఉన్నది దక్షిణ హిందూదేశం అనీ ఒక పరిమితార్థంలో వ్యవహరించబడుతు న్నాయి. అయితే నదులేకాక అసంఖ్యాకాలుగావున్న కొండలూ లోయలూకూడా ఈద్వీపకల్పం వివిధరాష్ట్రాలుగా ఏర్పడడా నికి కారణమైనా యనీ మనం గమనించాలి. ఆకొండలూ లోయలవల్లనే చాలా రాష్ట్రాలు ఒకదాని సరిహద్దునే మఱొకటి ఏర్పడ్డాయి. "తూర్పున ఉన్న రాష్ట్రాలూ, మధ్యపీఠ భూమిలోని పశ్చిమరాష్ట్రాలూ ఒక్క సామ్రాజ్యప్రవాహంలో మునిగినప్పుడు తప్ప సాధారణంగా వేఱువేఱుగానే ఉంటూ వచ్చాయని ఇటీవలి చరిత్రకారు డొకడు గుర్తించాడు.

నదులవల్ల సహజంగా సస్యసంపద వర్ధిల్లుతుంది. డెల్టా భూములలోను వర్షపాతంకల ప్రదేశాలలోను ముఖ్యమైనపంట వరి. గోదావరి, కృష్ణ, కావేరి డెల్టాలు సారవంతాలైన భూము లలో చెప్పదగినవి. నదులనుంచి త్రవ్వీన పంటకాలువలు నలు

వైపులా వ్యాపించి దక్షిణహిందూదేశం అన్ని ప్రాంతాలకూ సంబంధం కలిగిస్తున్నాయి. డెల్టాకాని ప్రాంతాలలో వ్యవసాయం చాలా కష్టం. ఇటువంటి చోట్ల జొన్నలు కాయధాన్యాలు చెఱకు ప్రత్తి మొదలయినవి విశేషంగా పైరవుతాయి. మంచి నీటివసతి ఉన్నచోట ఎక్కడైనా సరే వరి తప్పకుండా ఉంటుంది. మఱీ పేదలైన ప్రజలు జొన్నలూ మొదలైన చౌకధాన్యాల్నే ఉపయోగిస్తారు. వారు దృఢకాయులై ఉండడానికి బహుశా ఈ ఆహారమే కారణమై ఉంటుంది.

కొంకణం మలబారులలో వరి మాత్రమే కాకుండా కాఫీ, టీ, కొబ్బరి, మిరియాలూ, సుగంధ ద్రవ్యాలూ కూడా ఫలిస్తాయి. మలబారు, మైసూరు అడవులలో శ్రేష్ఠమైనట్టి రకరకాల కలప దొరుకుతుంది. మైసూరు అరణ్యాలు ముఖ్యంగా గంధపు చెట్లకు ప్రసిద్ధాలు. ఆంధ్రదేశం వరిపంటకు సుప్రసిద్ధం. అంతేకాక ఇనుమూ సీసము మైకా మాంగనీసు మొదలైన ఖనిజాలు ఇక్కడ విరివిగా లభిస్తాయి. మైసూరులో బంగారు గనులూ, హైదరాబాదులో బొగ్గుగనులూ, బుందేల్‌ఖండు ఛోటానాగపూరు కడపలలో అక్కడక్కడ రత్నాల గనులూ ఉన్నాయి. కోయంబత్తూరు తిరునల్వేలి జిల్లాలోని కాయల్ ముత్యాలు ప్రపంచం అంతటా అమ్మకమౌతూ ఉండేవి.

విదేశవర్తకులు ఈ వస్తువులకోసం ఎగబడే వారంటే అతిశయోక్తి కాదు. ఈ ద్వీపకల్పానికి ఇరువైపులా ఉన్న సముద్రతీరం యావత్తు వాణిజ్యానికి ఎంతో ఉపయుక్తంగా ఉండేది. సముద్రతీరం అంతా తిన్నగా సాగిఉందికాబట్టి సహజ నౌకాశ్రయాలు చాలాతక్కువ. రెండు తీరాలలోను రేవులు

చాలా ఉన్నప్పటికీ పెద్దనౌకలు ఆగదగినవిఎన్నో లేవు. ప్రస్తుతం బొంబాయి గోవా కొచ్చినులూ తూర్పుతీరాన మద్రాసు విశాఖపట్టణాలూ మంచి నౌకాశ్రయాలు. ఏది యేమైనా హిందూదేశవర్తకంలో నూటికి ఎనభయి అయిదువంతులు పైగా సముద్రం మీదనే జరుగుచున్నది. పూర్వకాలంలో శాతవాహనులకీ పల్లవులకీ చోళులకీ నౌకలుండేవి. దూరప్రాచ్యంలో ఆంధ్రులూ తమిళులూ వలసప్రాంతాలు ఏర్పరచుకోవడంలో ప్రదర్శించిన చాకచక్యమూ, సింహళం మలయా ద్వీపాలమీద చోళుల విజయాలూ సముద్రంమీద ఆధిపత్యం వహించటానికిని తగ్గ ధైర్యసాహసాలూ సామర్థ్యమూ వారికి కలవని చాటి చెప్పుతున్నాయి. ఒక్క బెంగాలు దేశస్థులు తప్పితే తక్కిన ఉత్తర హిందూస్థాన వాసులు ఎవరూకూడా దాక్షిణాత్యుల సముద్రాధిపత్య వైశిష్ట్యాన్ని అందుకోలేక పోయారు. ద్వీపకల్పంగా ఉన్న దక్షిణహిందూదేశం యొక్క చరిత్రకు ఆ దేశానికి మూడువైపులా ఉన్న మూడు సముద్రాలతో గాఢ సంబంధం ఉన్నది. అయినప్పటికీ మధ్యయుగం తర్వాత దక్షిణ హిందూదేశ నౌకాదళంలో కాలాను గుణమైన మార్పులు జరుగలేదు. మహారాష్ట్ర సార్వభౌముడైన ఛత్రపతి శివాజీ నిర్వహించిన నౌకాదళం కూడా అంత సమర్థమైనదీ ఆధునికమైనదీ కాదు. నవయుగంలో సుప్రసిద్ధ దేశభక్తుడైన వి. డి. చిదంబరం పిళ్లై దక్షిణ హిందూదేశపు నౌకా స్వరూపాన్ని సంస్కరించడానికి చేసిన ప్రయత్నం నాటి పాలకులైన బ్రిటిషు వారి సానుభూతి లేక విఫలమైంది.

విమాన యుద్ధాలు తల యెత్తక పూర్వం ఇండియా మీద సార్వభౌమత్వం వహించడానికి ప్రయత్నించిన యూరపియన్ ప్రభుత్వాలకు నౌకాదళం చాలా ప్రాముఖ్యం వహించింది. 18 వ శతాబ్దంలో ఇంగ్లీషువారికీ ఫ్రెంచివారికీ ఇండియాలో సంభవించిన పోరాటాలలో సముద్రాధిపత్యం ముఖ్యం అనే విషయం గుర్తించబడ్డది. బంగాళాఖాతం మీద బ్రిటిషు వారికి కల ప్రాబల్యం వల్ల వారు బెంగాలు నుంచి దక్షిణహిందూ దేశానికి అతివేగంగా మనుష్యులను ఆహారపదార్థములను చేరవేసుకోగలిగారు. అందుచేత ఫ్రెంచివారిని నిర్జించ గలిగారు.

అయితే దక్షిణ హిందూ దేశంలోని పురాతన నౌకాశ్రయాలు సముద్రం విస్తరించడంవల్లగాని విధ్వంసం చెయ్యడం వల్లగాని శిథిలమై పోయాయి. తూర్పు తీరాన కావేరీపట్టణం కాయల్ రేవులమాదిరిగానే, పశ్చిమతీరాన ముజిరిస్, బకారాలు ఒకప్పుడు మంచిస్థితిలో ఉన్న రేవు పట్టణాలు. కాని సముద్ర విజృంభణానికి గురిఅయి పోయాయి. అవి ఏకాలంలో శిథిలమైందీ నిశ్చితంగా చెప్పటానికి వీలు లేదు. కాని కనబడుతున్న ఆధారాలను బట్టి క్రీస్తుశకం ప్రారంభంలో ఒకటి రెండు శతాబ్దాలలోనే అవి పాడుపడినట్లు ఊహించవలసి వస్తుంది. కన్యాకుమారికి దక్షిణాన ఉన్న భూభాగం సముద్రగ్రస్తమైనట్లుశిలప్పదికారంలో కనబడుచున్నది. ప్రాచీనతమిళపురాణాలు కాలగర్భంలో లీనమయిన ఆదితమిళగ్రంథాలూ, కట్టడాలూ, పై విశ్వాసానికి ప్రోద్బలం కలిగిస్తున్నాయి. కాని ఆవిధంగా నశించిన దేశాల స్వరూపస్వభావాలు ఎలాంటివో చెప్పలేము. కొంతమంది రచయితలు అతిప్రాచీన కాలంలో సింహళం, మలయా, ఇండోనేషియా, ఆస్ట్రేలియా, ఆఫ్రికాలతో దక్షిణ

'హిందూ దేశాన్ని కలిపే ఒకానొక 'లెమూరియా' భూభాగం ఉన్నదనిసూచించారు. దక్షిణ హిందూ దేశంలోని ఆదిమవాసులకూ, ఆస్ట్రేలియా ఆఫ్రికాలలోని అనాది జాతులకూ, శరీర లక్షణాలలో గల పోలికలూ మలయాలోని జకూన్లకు ప్రాచీన దక్షిణహిందూ దేశవాసులకూ, కాదర్లూ మలలేదన్లకూ ఆచార వ్యవహారాలలో కల సామ్యాలూ పై సిద్ధాంతాన్ని బలపరుస్తున్నాయి. అయితే ఇంతమాత్రంచేత అంగీకరించటం సమంజసం కాదు. ప్రస్తుతం మనకు లభ్యమయిన సామగ్రిని బట్టి కన్యాకుమారికి దక్షిణాన కొంత భూభాగం ఉన్నదని చెప్పటం తప్ప, ఆ భూభాగం విస్తీర్ణత మొదలయిన అంశాలేవీ నిర్ణయంచెయ్యలేము. ఇంకా పరిశోధనలు జరిగినమీాదట వివరాలు తెలియవచ్చును.



నటరాజమూర్తి

తిరువాలంగాడులోని కంచువిగ్రహము

మద్రాసు మ్యూజియంవారి అనుమతితో

# రెండవ అధ్యాయం

## చరిత్రకు పూర్వం దక్షిణ హిందూదేశం

ప్రపంచంలో మొట్టమొదటి మానవులు నివాసం ఆరంభించిన దేశాలలో దక్షిణభారతదేశం ఒకటి అని జంతుశాస్త్రజ్ఞులూ భూతత్వ పరిశోధకులూ చెప్పుతున్నారు. ప్రాణినివాసానికి ఆటపట్టయినపర్వతాలుదక్షిణహిందూ దేశంలోకనిపిస్తున్నాయి. అవన్నీ ఒరిస్సా, మైసూరు, ఆంధ్ర, మదరాసుప్రాంతాలలో ఉన్నాయి. ఈ ద్వీపకల్పంలో మానవ నివాసం కచ్చితంగా ఈకాలంనుంచి ఆరంభమైందని చెప్పటానికి అవకాశాలు లేకపోయినప్పటికీ ఆదిమ మానవ నివాస స్థలాలలో దక్కను పీఠభూమి ఒకటి అనటంలో సందేహం లేదు. జీవశాస్త్రసిద్ధాంతాలను బట్టీ, దక్కను శీతోష్ణస్థితి గతుల్ని బట్టీ, నర్మదా నదీ ప్రాంతాలలోలభించిన పురాతనపు అస్తిపంజరాలను బట్టీ, గోదావరి ప్రక్కలోయలలో దొరికిన ప్రాచీన మానవ కళేబరాలను బట్టీ ఈవిషయం విశ్వసనీయ మౌతున్నది. దక్కను పీఠభూమిలో ఉన్నత ప్రదేశాలలో ఉన్న కొండలలో ఆదిమ మనుష్యునికి కావలసిన పండ్లూ, కాయలూ లభించేవి. అయిదు లక్షల సంవత్సరాల క్రిందటనే ఇక్కడ మానవ నివాసం ఆరంభమైందని ఊహించవచ్చును.

ప్రాచీన చరిత్రకు అందనికాలంనాటి పురాణాలలో మానవులు ఉపయోగించే వస్తువుల వర్ణన ఉన్నది. ఆ వస్తువు

లను బట్టీ మానవ చరిత్ర ప్రప్రథమ శిలాయుగమనీ, ప్రాచీన శిలాయుగమనీ, నవీన శిలాయుగమనీ వేర్వేఱు దశలుగా విభక్తమైంది. ఆ విధంగా ప్రారంభ శిలాయుగం, పురాతన శిలాయుగం, నవీనశిలాయుగం అని మూడు యుగాలు ఏర్పడు తున్నాయి. ప్రారంభ శిలాయుగంనాటి కొన్ని పరికరాల నమూనాలు కనిపించినా, దక్షిణహిందూదేశంలో ఆయుగానికి సంబంధించిన చెకుముకి రాతి ఆయుధాలు వగైరా ఉండేవని ఋజువు చెయ్యటానికి అవకాశా లులేవు. కాని రాబర్టు బ్రూస్ ఫూట్ క్రీ. శ. 1663 వ సంవత్సరంలో పల్లవరందగ్గఱ పరిశోధన చేసిన పిమ్మట దక్షిణహిందూదేశంలోని చాలాప్రాంతాలలో ప్రాచీన శిలాయుగంనాటి శిధిలాలు త్రవ్వి చూడడం జరిగింది. ఇనుము వంటి రాతితో చేయబడ్డ చేతి గొడ్డళ్లూ గండ్రగొడ్డళ్లూ, కోరాలు, కత్తులూ, ప్రత్యేకంగా కర్నూలు పరిసరాలలోను గోదావరీ తీరపు పల్లపు ప్రాంతాలలోనూ లభించాయి. నాటి యుగానికి సంబంధించిన వస్తుసామగ్రిని బట్టి విచారిస్తే అప్పటి మనుష్యులకు ఆాలికి మెఱుగు పెట్టడంకానీ పదును పెట్టడం కానీ తెలియదని ఊహించవచ్చును. మోటు ఆయుధాలూ పరికరాలే కాకుండా వారు కొయ్య ఈటెలనూ, దుస్తుకట్టలను కూడా ఉపయోగించినట్లు కనబడుతుంది. గుంతకల్లులో దొరికిన కొయ్య దువ్వెన ఒకటి ఈ యుగంనాటిదిగా తోస్తుంది. ఏదిఏమైనా ప్రాచీన శిలాయుగంనాటి మానవజీవిత విధానాన్ని గురించి మనకు తెలిసింది చాలా స్వల్పం. దానికి కారణం మనకు లభించిన ఆనాటి పరికరాలస్వరూపం చెడకుండా ఉన్నవి లేనేలేవు.

6 1 శాతవాహనసామ్రాజ్యము




1 అజంటా
2 నానాఘాట్
3 కన్హేరి
4 నాసిక్
5 పైఠాన్
6 ధంతపురం
7 పాలిటింగ్
8 కార్లె (గుహాలు)
9 భాజా (గుహాలు)
10 తెరా
11 పిష్టపురం
12 వేంగి
13 అమరావతి
14 మసాలియా
15 నాగార్జునకొండ
16 భట్టిప్రోలు
17 ఏట్రగుడి
18 వనవాసి
19 చిత్రపురం
20 సిరవణ బెల్గొళ
21 వేంగడం (తిరుపతి)
22 కంచి
23 ఎయిదపట్టణము
24 తలకాడు
29 కావిరిపూంపట్టణము
25 తొండి
26 కరూర్
27 ముసిరి
28 ఉరయూర్
30 నాగపట్టణము
31 మంజి
32 తలయాలంకానం
33 నెల్ కిన్డా
34 వైక్కరై
35 మధుర
36 శాలియూరు
37 కొర్కై
38 కొటియురు
39 కన్యాకుమారి

ఇతిహాస పూర్వపు భారత దేశము

ఆకాలంలో మనుష్యుడికి స్థిరనివాసం అనేది లేదు. అతనికి పండ్లూ కాయలూ ముఖ్యాహారం. వ్యవసాయం అంటే ఏమిటో అతనికి తెలియదు. అటుతరువాత కొంతకాలానికి వేటాడటం జీవనోపాధుల్లో ఒకటి అయింది. మరణించిన వారిని దహించటంకాని పూడ్చిపెట్టడంకాని జరిగేది కాదు. ఏ జంతువులో పక్షులో ఆశవాన్ని తిని వెయ్యాలి. శిలాయుగపు చివరిదశ క్రీ॥ పూ॥ 3500 సం॥ నుంచి క్రీ॥ పూ॥ 10000 సం॥ వరకూ అని విజ్ఞుల అభిప్రాయము.

శిలాయుగానికీ లోహాయుగానికీ మధ్య మిశ్రమ యుగం అనేది ఒకటి ఉన్నది. ఈ యుగంలో మానవుల పరికరాల పరిమాణం తగ్గుతూవచ్చింది. సిలికాకు బదులుగా చెకుముకి, వజ్రము, ఛెర్టు, సూర్యకాంతమూ మొదలయిన ఖనిజాలతో ఆయుధాలుగానీ పరికరాలుగానీ తయారవుతూ వచ్చాయి. ఇలాంటి ఆయుధాలున్నూ వస్తువులున్నూ చాలా చోట్ల దొరికాయి. తిరునల్వేలి జిల్లాలో సాయర్‌పురం దగ్గర, కృష్ణ, గోదావరి దిగువప్రాంతాల భూగర్భాలనుంచి ఎన్నో ఇటువంటివి బయటపడ్డాయి. కర్నూలులోని గుండ్లదుర్గ్ వగైరా స్థలాలలో ఆ కాలంనాటి కుండలుకూడా కనిపించాయి. ఈరకం వస్తువులు దీనితరువాతయుగంలోకూడా ఉపయోగంలో ఉండేవి. మైసూరులోని బ్రహ్మగిరి దగ్గర దొరికినవి ఇటువంటివే. ఈ మధ్యయుగంనాటి మనుష్యులు ముఖ్యంగా వేటమీద ఆధారపడి ఉండేవారు. వీరు ముఖ్యంగా ఎలుకల్నీ గొఱ్ఱెల్నీ వేటాడేవారు. శవసంస్కారం అనేది ఈ యుగంలోనే ఆరంభమైంది.

ఈయుగంలోని మానవ సంస్కృతిని గుర్తించటానికి చూడవలసినవి మెఱుగుపెట్టబడిన ఱాతిగొడ్డళ్ళు.ఇలా మెరుగు పెట్టదగ్గ శిలాయుధాలకీ శిలావస్తువులకీ ఒకవిశిష్ట పాషాణాన్ని ఉపయోగించేవారు· తిరునల్వేలి, సేలం, ఉత్తరార్కాటు, చెంగల్పట్ జిల్లాలలో నవీనశిలాయుగానికి సంబంధించిన వస్తుసముదాయం లభించింది. వరంగల్లు, అనంతపురం, హైదరాబాదు, లలోను మైసూరులోనూకూడా నవీన శిలాయుగం నాటిమనుష్యులునివసించినట్లు గుర్తులు కనబడుతున్నాయి. ఈకాలానికి మనుజులుస్థిరనివాసానికి అలవాటుపడ్డారు.స్థిరనివాసంతోబాటు వ్యవసాయం చెయ్యటం, జంతువుల్ని పెంచటం, ఱాతిని ఱాతిని తాకించి నిప్పు పుట్టించటం, పడవలు నిర్మించటం కూడా నేర్చుకొన్నారు. చేతితోకానీ సారెవల్లకానీ కుండలుచెయ్యటం సర్వసామాన్యంగా ఉండేది. ఈ యుగంలో నివసించిన ప్రజలు తమగృహకుడ్యాలమీద వేటలకూ నాట్యాలకూ సంబంధించిన చిత్రాలు రచించేవారు. దువ్వెనలూ హారాలూ ఎముకలతో పెంకులతో రుద్రాక్షలతో చేసిన ఆభరణాలూ వీరు నివసించిన ప్రాంతాల్లోదొరికాయి. వాటినిబట్టి వీరి అభిరుచులు మనం తెలుసుకోవచ్చును. వీరి పూర్వులవలెనే వీరు కూడా విగ్రహారాధకులు.

లింగపూజ యీయుగంలోనే ఆరంభమైందేమోనని పిస్తుంది. బళ్ళారిజిల్లాలో కప్గల్ కొండలో శిలానిర్మితాలైన లింగమూ ఎద్దూ కనిపించాయి. ఇవి ఈయుగంలో నిర్మించబడ్డవి కావేమో! శవదహనంకానీ శవఖననంకానీ ఈకాలంలో సర్వసామాన్యమైంది.

హిందూదేశంలో రాతియుగంతరువాత ఇనుప యుగం ప్రారంభమైందని మొన్న మొన్నటి దాకా అనుకొన్నాము. ఇనుము వాడకానికి పూర్వం రాగికానీ కంచుకానీ వాడకం లోకి వచ్చినట్లు ఎవరమూ అనుకోలేదు. కానీ ఇటీవల నవీనాంధ్ర దేశంలోపలి రాయచూర్ జిల్లాలోనూ, మైసూరులోని బ్రహ్మగిరి వద్దనూ దొరికినవస్తుసామగ్రిని బట్టి ఇక్కడ ఇనుము వాడకానికిముందే రాగీ, కంచూ ఉపయోగంలోకి వచ్చినట్లు తెలుస్తున్నది.

తిరునల్వేలి, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలలో కర్ణాటకంలో, ఇనుప యుగంనాటి సంస్కృతి చిహ్నాలు లభించాయి. ఈయుగంలో నిర్మించబడ్డకొండగుహాలు, మలబారులో తలస్సేరివద్దనూ, మదరాసు దగ్గఱ పెరంబూరు వద్దనూ, కోయంబత్తూరు జిల్లాలోని కనియంపుండి సిరుముగేల వద్దనూ తిరునల్వేలి జిల్లాలోని ఆదిచనల్లూరు వద్దనూ ఉన్నాయి.దక్షిణ హిందూదేశంలో ఈనాటివఱకూ కనబడ్డ చరిత్రాత్మక స్థలాలలో అతి ప్రాచీనమైన ఆదిచనల్లూరులో ఆనాటిమనుష్యుల పుఱ్ఱెలుకల అస్థిపేటికలు, చిట్లు ఊక కల పాత్రలూ, మెఱుగు పెట్టిన కుండలూ, ఇనుప పనిముట్లూ, బంగారు కంచు నగలూ, ఇంకా ఎన్నో విచిత్రాస్థిపంజరాలూ కనిపించాయి.

ఇక్కడ భూగుప్తపాత్రలలో ప్రత్యేకంగా దివ్యాలంకారాలైన సువర్ణశిరోవేష్టనాలూ, బంగారు సన్నాయి గొట్టాలూ, చిన్నపారలు బల్లెములవంటి ఆయుధాలూ కనిపించాయి. పాలస్తైనా, సైప్రస్, క్రీట్ దేశాలలో ఇదేవిధంగా క్రీ. పూ. 2000–1200 సంవత్సరాలమధ్య వాడుకలో ఉండే ఇటువంటి విశిష్టా

లంకారాలూ పరికరాలూ కనిపించటం ఆశ్చర్యకరం. ఇటువంటి విచిత్రవస్తువులు హిందూ దేశంలో మరెక్కడా కనిపించలేదు. అందువల్ల ఆదిచనల్లూరులో దొరికిన ఈ చిత్రవస్తువులు, మధ్యధరాసముద్రానికి తూర్పుప్రాంతాలనుంచివచ్చి, ఈ ప్రాంతంలో స్థిరపడ్డ కొంతమంది వర్తకులకు సంబంధించినవని ఊహింపవలసి వస్తున్నది. అయితే ఈవిధంగా దొరికినవాటిలో బల్లెములాంటి ఆయుధాలేకాక ఇనుముతో చేసిన ధ్వజపీఠాలూ, కంచుతో చేసిన కోడిబొమ్మలూ ఉన్నాయి. ప్రాచీన తమిళులు "మురుగన్" అని నామాంతరంకల కుమారస్వామిని సేవించేవారనే విషయం అందరికీ తెలుసు. ఆయన ఆయుధం బల్లెంవంటిది. మయూరధ్వజం ఆయన చిహ్నం. కావడిలో కుమారస్వామి విగ్రహాన్నీ, ఆయన పరికరాల్నీ మోసుకువెళ్లే భక్తులు ఒక రకమైన వేణువునుగూడా కొనివస్తూ ఉంటారు. పాలస్తైనా, సైప్రస్, క్రీట్ దేశాలలో కోడి, నెమళ్ల విగ్రహాలు ఇంతవరకు దొరకకపోవడంవల్లనూ, కుమారస్వామివంటి రూపలక్షణములుకల ఏ దేవుణ్ణయినా పూజించేసంప్రదాయం ఆ దేశాల్లో లేనందువల్లనూ, అదిచనల్లూరులో దొరికిన ఈ ప్రాచీన వస్తుసముదాయం తమిళజాతికి చెందిందే అని చెప్పవచ్చును. 'పురనానూరు' అనే ప్రాచీన తమిళ పద్యసంచయంలోనూ, 'మణిమేఖల' అనే కావ్యంలోనూ, మట్టిపాత్రలలో శవాలను భూస్థాపితం చేయుటను గూర్చిన (Urn Burials) వర్ణనలవల్ల, పై ఊహ బలపడుచున్నది.

అయితే పాలస్తైనా, సిరియా, సైప్రస్‌లలో ఇటువంటి వస్తుసముదాయం ఉండడానికి కారణం ఏమిటి అనే ప్రశ్న

ఉన్నది. దాన్కి రెండుమూడు విధాల సమాధానాలు చెప్పుకో వచ్చును. దక్షిణ హిందూదేశంలో కొంతకాలం నివసించిన వైదేశికులు ఇక్కడి సంప్రదాయాల్ని తమమాతృదేశాలలో ప్రచారంచేసిఉండవచ్చును– లేక ఇక్కడి వస్తుసముదాయాన్ని తీసికొని వెళ్లిఉండవచ్చును. అంతకంటెనూ నమ్మదగిన ఊహ ఏమిటంటే మధ్యధరా ప్రాంతాలనుండి వచ్చిన ఒకజాతివారు బహుశః ద్రావిడులు ఈచోటికి ఇటువంటి సంప్రదాయాన్ని తెచ్చి ఉంటారు. అది ఈఅదిచనల్లూరుప్రాంతంలోమటికొంచెం వృద్ధిపొంది ఉంటుంది, పశ్చిమాసియలో లభించిన భూగుప్త వస్తువులలో ఇనుప వస్తువే లేదు. అందు చేత అవి దక్షిణ హిందూదేశంలో లభించిన వస్తువులకంటె ప్రాచీనకాలానికి చెందినవై ఉండాలి. కనుక అదిచనల్లూరుప్రాంతాలలోని 'పురాతన వస్తువులకు సంబంధించిన సంస్కృతి పశ్చిమాసియానుంచి యిటువైపు వ్యాపించిందే అయి ఉంటుంది.

దక్షిణభారత పురాతన(చరిత్రకుముందరి) సంస్కృతిని గమనించే టప్పుడు గుర్తించ వలసిన మఱొక విషయం ఉన్నది. దీనిలో మధ్యధరాప్రాంతపు క్రీ. పూ. 2500 – 1500 సంవత్సరాలనాటిసంస్కృతి కనిపిస్తున్నదని చరిత్రకారులంతాఅంగీకరించారు. ఆప్రాంతంలోని ఆనాటి వస్తునిర్మాణవిధానానికీ దక్షిణ భారతంలో ఇనుపవస్తువల నిర్మాణవిధానానికీ చాలా పోలికలున్నాయి. ఈ రెంటికాలాలకీ విశేషవ్యత్యాసం ఉన్నట్లు కనిపించదు. పురాతనప్రదేశాలను త్రవ్వి పూర్వకాలపు వస్తుసామగ్రిని సంపాదించే ప్రయత్నం దక్షిణహిందూదేశంలో పదేళ్ళకిందటినుంచిమాత్రమే ప్రారంభమయింది. చెంగల్పట్టు ఉత్తర దక్షిణ ఆర్కాటు జిల్లాలలో చాలాసామగ్రి దొరికింది, కుడ

కల్లులు (పాముపడగలాంటి శిలలు) టొపికల్లులు (ఛత్రాల వంటి శిలలు) మరికొన్ని మహాశిలలు నిట్టనిలువుగా వేర్వేరుగా పాతి పెట్టబడిఉన్నాయి. హైదరాబాదు మైసూరుల లోనూ ఇటువంటి సమాధిశిలలు లభించాయి. చెంగల్పట్టు జిల్లాలో సానూరు, అమృతమంగళం కున్నత్తూర్లలోనూ, దక్షిణ ఆర్కాటు జిల్లాలో సెంగమేడులోనూ త్రవ్వకాలు పూర్తి అయినాయి. ఈ త్రవ్వకాలు జరిగిన చోట్లలో లభించిన వస్తువులు క్రీ. పూ. 200 సం॥ క్రీ. వె. 200 సం॥ మధ్యకాలానికి చెందినట్లు కనబడుతున్నప్పటికీ ఈరకంవస్తువులు ఇంకా ప్రాచీన కాలం అనగా క్రీ.పూ. 1000 సంవత్సరాలనాడే వాడుకలో ఉన్నట్లు తోస్తుంది. ప్రాచీన తమిళ సారస్వతం అంటే పురనానూరు తోల్కాప్పియం, నాట్రినాయ్, పదిత్రుపత్తు, మణిమేఖల, లాంటి గ్రంథాలతో నిమిత్తం లేకుండానే పైప్రదేశాలలో కొన్ని శ్రీరామచంద్రుని సేవించిన వానరబృందానికి కర్మాగారాలుగా ఉన్నట్లు చెప్పే ఒక ప్రాచీనగాథ ప్రచారంలో ఉన్నది.

1945వ సంవత్సరంనుంచీ జరుగుతూవచ్చిన భూగర్భ పరిశోధనల వల్ల భారతంలోని యీకాలం నిర్ణయించటానికి కొంత ఆధారం లభించింది. 1945వ సం॥లో అరికమేడువద్దర మార్టిమరు హీలర్ పరిశోధనల్లో క్రీ. వె. 1, 2 శతాబ్దాల నాటికి చెందిన కుండలూ ఇతర వస్తువులు బయటపడ్డాయి. 1947 లో బ్రహ్మగిరి దగ్గఱ జరిగిన విస్తృత పరిశోధనలవల్ల చరిత్ర కందనికాలంనాటి దక్షిణ హిందూదేశ సంస్కృత వైభవాన్ని శిల్పాల ప్రాముర్భావ కాలాన్నిగుర్తించటానికి కొన్ని ఆధారాలు లభించాయి. బ్రహ్మగిరి దగ్గఱ లభించిన ప్రాచీన వస్తుసముదా

యం మూడు తరహాలుగా ఉన్నది. మొదటిది శిలాయుగంలో అంత్యభాగానికి చెందినది. అంత్యభాగం అనడానికి కారణం ఏమిటంటే వీటిల్లో యినుమూ, కంచుల్లో చేసిన వస్తువులు కూడాఉన్నాయి. రెండోది దక్షిణహిందూదేశంలో ఇతరస్థలా లలో లభించిన శిల్పాల వంటివి. మూడోది స్పష్టంగా క్రీ.వె.శివ శతాబ్దానికి చెందిన ఆంధ్ర సంస్కృతి నిదర్శన ప్రాయాలైన ఎఱ్ఱరంగు కుండలు. బ్రహ్మగిరివద్ద లభించిన పురాతనవస్తు సామ గ్రిని బట్టి యీశిల్పాలు క్రీ. పూ. 700-400 సంవత్సరాల మధ్య కాలానికి చెందిన వని హైమెండార్ఫ్ ఉద్దేశించవలసివచ్చినది. అయితే యింతకు ముందు అనుకొన్న విధంగా మధ్యధరా సముద్ర ప్రాంతపు శిల్పాలు క్రీ. పూ. 2500-1500 సంవత్సరాల నడిమికాలానికి చెందిన వైనప్పుడు, ఇనుము చేరిక మాత్రమే నూతనంగా కనిపిస్తూ అన్నివిధాలా ఆవస్తుసముదాయానికి ప్రతి బింబాలుగా కనిపించే ఇక్కడి శిల్పాలు క్రీ. పూ. వెయ్యి సంవత్సరాల నాటివి అయి ఉంటాయని చెప్పకతప్పదు.

ప్రాచీన శిలాయుగం నూతన శిలాయుగాల మధ్య కాల ములో దక్షిణ హిందూదేశంలో నివసించిన వారు ఏ జాతి వారు అనేది నిర్ణయించటం చాలా కష్టం. కొచ్చిన్ లోని కాదరులూ, పులయన్లూ, తిరువాన్కూరులోని మలపంద్రన్లూ వైనాడులోని పానియార్లూ, హైదరాబాదులోని చెంచులూ ప్రాచీన శిలాయుగంనాటి ప్రజల సంతతి వారే. ఆహార సంపా దనకోసం మిత వ్యయం చేసే ప్రాచీన సంప్రదాయం వీరిలో ఇంకా ఉన్నది. వీరిలో కదర్లూ పులయన్లూ వంటి జాతుల కుఱుచ శరీరాల్లో ముఖ్యంగా జుట్టూ, వ్రైగెరాల్లో నీగ్రోజాతి

లక్షణాలున్నాయి. చెన్నపట్టణం దగ్గఱ బయల్పడిన ప్రాచీన శిలాయుగపు పరికరాల వంటివి దక్షిణాఫ్రికాలో కూడ లభించడం ఇందుకొక నిదర్శనంగా కనబడుతున్నది. అయితే "ఈ నీగ్రోజాతి సంబంధం దక్షిణభారతానికి ఎల్లా కలిగింది?" అనే ప్రశ్నకు తృప్తికరమైన సమాధానం లేదు. దక్షిణభారతం ఆఫ్రికా ఆస్ట్రేలియా మలయా ఇంకా దూర ప్రాచ్యదేశాలతో కలిసే ఉండేది, అనే పురాతన విశ్వాసం అట్లాఉంచి ఆలోచిస్తే, ఈ దేశాలతో ఉండే వ్యాపార సంబంధాలవల్ల నౌకలు శిథిలితాలై, దక్షిణహిందూదేశంలోనే స్థిరపడ్డకొందఱు నీగ్రో ప్రజలవల్ల, వారి జాతి ఇక్కడ వృద్ధిపొంది ఉంటుంది అని ఊహించడం సమంజసంగా కనబడుతుంది.

ఇంతేకాక నవీనశిలాయుగంలో ఆస్ట్రేలియా ప్రాచీన వాసుల్లో, కోల్సు లేక కొలారియనులు అనే పేరుగల ఒకానొకజాతివారు దక్షిణభారతానికి వచ్చినట్టు తోస్తుంది. వీరిలో ఒకశాఖవారు ప్రస్తుతం అన్నామలై ప్రాంతాల్లోని కొండజాతులవారికీ, ఒరిస్సాలోని పర్వతప్రాంతాలలో కల పర్ణధారులకీ మూలపురుషులైన అనాగరికులై ఉంటారు. దక్కను ఈశాన్య ప్రాంతాలలోను మధ్యప్రదేశ వాయవ్య ప్రాంతాలలో ఉన్న జ్వాంగు, ఖరియా, గబద, సదర భాషలకూ కురుకూభాషకూ మూలం ఈకొలారియన్ల ముండాభాష. అయితే యీకోలులు దక్షిణభారతానికి ఎందుకు వచ్చారో ఎప్పుడు వచ్చారో స్పష్టంగా నిర్ణయం చెయ్యడం సాధ్యం కాదు. అస్సాములోని ఖాసీ జాతివారిలో కొంతవఱకు మలబారు ప్రజల లక్షణాలు కొంతవరకు కోలుల లక్షణాలూ కనిపిస్తున్నాయి. అస్సాము

లోని మహాశిల్పాలకూ మలబారులోని మహాశిల్పాలకుపోలిక లున్నాయి. అయితే పోలికలు కోలులు ఊహించుదూ దేశం ఈశాన్యభాగం నుంచి వాయవ్యం వైపు సముద్రతీరం వెంట వచ్చి స్థిరపడటం వల్లనే ఏర్పడ్డవో కేవలం పరస్పరసంస్కృతి సంబంధం వల్లనే ఏర్పడ్డవో నిశ్చితంగా చెప్పడం కష్టం.

శ్రీమతి ఇరావతీ కార్వే అనే నవీన రచయిత్రి ఆస్ట్రేలియా భాషలకూ దక్షిణహిందూ దేశ భాషలకూ కలసంబంధమూ దక్షిణభారతీయుల కొన్ని సంప్రదాయాలూ ప్రాచీన శిలాయుగానికి చెందిన ప్రజలు పసిఫిక్ మహాసముద్రం మీదుగా దక్షిణ భారతానికి వచ్చారనటానికి నిదర్శనం అని అంటున్నది. ఇక ముందు జరిగే పరిశోధనలే యీవింత ప్రశ్నకు సరైన సమాధానం చెప్పాలి. ఏది ఏమైనా ఈకోలుజాతివారు రైతులు. నియమనిబంధనలు ఎఱుగని గ్రామవాసులు. గుంపులుగాపోయి వేటాడటం, విందులు జరుపుకోవటం వీరికి అలవాటు. వీరిమతం మూఢ విశ్వాసాలకు ఆలవాలం. దయ్యాలున్నాయనే నమ్మకమూ, పూర్వులు కొలుస్తూవచ్చిన దేవతల్ని ఆరాధించటం, దయ్యాలకూ భూతాలకూ జంతువుల్ని బలిఇవ్వటం ఈజాతిలో కనబడుతున్నాయి. ఈ ఆచారాలు కొన్ని ద్రావిడులకూ, ద్రావిడులవల్ల ఆర్యులకూ సంక్రమించాయి. ఏనుగు ముఖం కల దేవుడు(గణపతి)కోతిరూపు దేవుడు(హనుమంతుడు)ప్రాచీనఆస్ట్రేలియా ప్రజల దేవతలు. ఈప్రజల సంబంధంవల్లనే ఈ దేవతలు ద్రావిడులకూ తర్వాత ఆర్యులకూ పూజ్యులైనారని చెప్పవలసి

(1) చూడండి. డబ్లు. టి. ఎల్మోర్ రచన నవీన హిందూజాతిలో ద్రావిడ దేవతలు అనే గ్రంథం (ప్రచురణ 1925వ సం॥) 2వ పుట

వస్తున్నది. ఇంతేకాక దయ్యాలూ, రకరకాల క్షుద్ర దేవతలూ, ఈప్రాచీనమతంనుంచి హిందువులలో అన్ని శాఖలవారికీ ఆరాధ్య దేవతలుగా వచ్చారు. (2)శివారాధనా అంతకంటె ముఖ్యంగా పార్వతీ లేక దుర్గారూపాలలో కాళీపూజా ఈప్రాచీనమతపు దేవతల్ని కొలిచే సంప్రదాయంబట్టి వచ్చినవే.

(3) నవీన శిలాయుగం ప్రారంభమైనప్పటినుంచీ దక్షిణ భారంతలో ప్రసిద్ధమైనజాతి ద్రావిడజాతి. వారి గృహనిర్మాణ పద్ధతీ, విడాకుల సిద్ధాంతాలూ మధ్యధరా ప్రదేశ ప్రాచీన ప్రజల ఆచారవ్యవహారాలకు సంబంధించినవిగా కనబడుతున్నాయి. ప్రాచీన ద్రావిడులు మధ్యధరా ప్రాంతంనుంచి హిమాలయ పర్వతాలవాయవ్యపు కనుమలద్వారా ఉత్తర హిందూదేశానికి వచ్చి అక్కడనుంచి క్రమక్రమంగా దక్షిణానికి చేరుకొన్నట్టు తెలుస్తున్నది. ద్రావిడభాషకూ బెలూచిస్థానంలోని బ్రహుయీ భాషకూ కల పోలిక ద్రావిడులు వచ్చినటువంటి మార్గాన్ని నిర్ణయించటానికి ఒకసాధనంగా ఉన్నది.

ఆసియామైనరు వాసులైన కొందరు మధ్యధరా ప్రజాసంతతివారు శాసనాదులలో "త్రమిలీ" అని తమజాతిని పేర్కొ-

---

*(2) 1891వ సం॥ నాటి హిందూదేశపు జనాభా – 96వ పుట.

*(3) మానవజాతి వివరణ శాస్త్రజ్ఞ సంఘం పత్రిక – 96వ పుట.
సర్ మానీర్ విలియమ్సు వ్రాసిన బ్రాహ్మణమతమూ హిందూమతమూ అనే గ్రంథం (ప్రచురణ 1891) 84వ పుట.
సర్. ఎ. సి. లియాల్ వ్రాసిన "ఆసియా పరిశోధనము" అనే గ్రంథం (ప్రచురణ 1907) 49వ పుట.

నడమూ, ఆ "త్రమిలీ" అనే పదం "తమిళ" పదానికి సన్నిహితంగా ఉండడమూ గమనిస్తే పై ఊహకు మఱికొంత బలం చిక్కుతున్నది. దేవతారాధనలోనూ, దేవాలయ నిర్మాణ పద్ధతులలోనూ, సుమేరియన్లకూ, తమిళులకూ కల పోలికల వల్లనూ, మధ్యధరా ప్రాంతంనుంచి ద్రావిడులు ఇక్కడికివచ్చారని, ఊహించటానికి ఎక్కువ ఆధారం ఏర్పడుతున్నది. మిటానీ ఎలామైట్, కసీట్ మొదలయిన మధ్యధరాప్రాంత భాషలకీ తమిళానికీ కల కొన్ని సంబంధాల వల్లనూ, ఇరాక్ ప్రాచీన వాసులైన కాస్పియన్లకూ, ద్రావిడులకూ రూపలక్షణాలలో కన్పించే సామ్యాలవల్లనూకూడా, కొంతమంది మధ్యధరా ప్రాంతీయులు ఇరాను చేరి, అక్కడనుంచి బెలూచిస్థానం, ఉత్తరహిందూదేశం చేరుకొని క్రమంగా దక్షిణభారతంలో స్థిరపడ్డారని ఊహించడంలో పొరపాటు లేదని చెప్ప వచ్చును. అయితే దీనికి విరుద్ధంగా ద్రావిడులు మంగోలియానుంచి ఈశాన్యదిక్కున హిందూదేశం చేరి ఉంటారని ఒకప్పుడు కొందఱన్నారు. అస్సాములోని ఖాసీలకూ, కేరళప్రాంతంలోని కొన్ని జాతులవారికీ రూపలక్షణాలలో స్పష్టంగా కనిపించే కొన్ని పోలికలుకూడా, ఈసిద్ధాంతానికి బలం చేకూరుస్తున్నవి. అయితే ఇప్పుడు ఈపోలికలనేవి అంత పట్టించుకోవలసినవి కాదనీ, అవి యేవో తాత్కాలికంగా ఎప్పుడైనా, ఎక్కడైనా కనిపించ వచ్చుననీ, వాటిని బట్టే గట్టిగా సిద్ధాంతం చెయ్యడానికి వీలు లేదనిచాలామందిఅభిప్రాయపడుతున్నారు. దక్షిణభారతంలోని ప్రాచీన కాలపు శిల్పాలకీ ఖాసీజాతివారి ఈ శిల్పాలకీ ఎంతో భేదం వున్నది. ఈశాన్య హిందూదేశపు శిల్పాలు నవీన శిలా

యుగంనాటివిగా కనబడుతుండగా దక్షిణభారతంలోనిశిల్పాలు ఇనుపయుగం నాటివిగా కనబడుతున్నాయి. ఇంతేకాక వాటి నిర్మాణవిధానాలలోనూ, శిల్పరచనలోనూకూడా చాలా భేదం ఉన్నది. పై పెచ్చు మధ్యధరా సముద్రప్రాంతపు శిల్పరచనకూ దక్షిణహిందూదేశపు శిల్పరచనకూ సామ్యం వున్నది. ఈ ఉభయ శిల్పరచనలలోనూ గవాక్షనిర్మాణంలో కల సామ్యం ఊరికే త్రోసివేయ దగినదికాదు.-అందువల్ల ద్రావిడులు మంగోలియానుంచి వచ్చారనే సిద్ధాంతం నిలవడానికి అవకాశంలేదు. అయితే ద్రావిడులు విదేశంనుంచి ఇక్కడికి వచ్చారనే సిద్ధాంతాలన్నిటికీ వ్యతిరేకంగా, హిందూదేశంలో తమకు స్థిరనివాసానికి అనుకూలతలు కనిపించని కొందఱు ద్రావిడులు బెలూచిస్థానంనుంచి ఇరానూ, సుమేరియా, అక్కడనుంచి సుమేరియా మెసపొటేమియాలకూ, మధ్యధరా తీరానకల ఇతర ప్రాంతాలకూ వెళ్లారనే వాదం ఒకటి వున్నది. అయితే దక్షిణహిందూదేశంలోని మధ్యశిలాయుగంనాటి నిర్మాణాలలో ఇనుము ఉపయోగించటం కనిపిస్తున్నది. అదే కాలానికి చెందిన నిర్మాణాలు కనబడ్డ మధ్యధరా ప్రాంతంలో ఆనిర్మాణాల్లలోఇనుము ఉపయోగించక పోవటంకూడా కనిపించుతున్నది. అందువల్ల మధ్యధరాసముద్ర ప్రాంతంలోని శిల్పరచనకు తర్వాతదే దక్షిణ హిందూదేశంలోని శిల్పరచన అని ఋజువౌతూ ఉన్నందువల్ల పై సిద్ధాంతం నిరాధారమని చెప్పవలసివస్తున్నది. రెండుజాతుల ప్రజలు ఒకరితోఒకరు పూర్తిగా కలిసి పోకపోతే పరస్పర సంస్కృతుల్ని సమన్వయ పరచుకోవటం జరుగదు గనుక కూడా, ఈసిద్ధాంతం నమ్మరానిదనవచ్చును. వాణిజ్యసంబంధ

మైనాడుంటే, భిన్నజాతుల సంస్కృతులకు కొంతవఱకు సమ్మే ళనం జరుగవచ్చును. కాని రాకపోకలకు అవకాశాలు చాల తక్కువగావున్న ఆ ప్రాచీన కాలంలో ఒకదేశంలోని ప్రజా సముదాయంయొక్క ఆచార వ్యవహారాలని మార్చగలిగి నంతగా గాఢ వాణిజ్య సంబంధం వుండేదని ఊహించటం చరిత్రకారుల మతానికే విభిన్నమైనది. చిరకాలంనాటివిషయా లను గురించి ఇప్పుడు ఏర్పఱచుకొనే అభిప్రాయాల్నే ధృఢంగా విశ్వసించడంఅంటే చాలాకష్టం. మొత్తంమీద మనకు తెలియ వచ్చిన విశేషాలను బట్టి, మధ్యధరా సముద్రప్రాంతంనుంచి బయల్దేరి, వాయవ్యకనుమలనుండి ఇక్కడికివచ్చిన ఒకజాతివారు ద్రావిడు లనేపేర ప్రసిద్ధులైనారనటం కంటె, ఇంకేమీ చెప్ప టానికి ఆధారాల్లేవు.

అల్లాఅయితే, ఆవిధంగా ద్రావిడులు ఇక్కడికి వలస రావటం ఎప్పుడుజరిగింది? లేక ద్రావిడులకు ఒకవిశిష్ట నాగరకత ఏకాలంలో విస్తృతమైంది? దీనికి అంతగా చారిత్రకాధారాలు లభించక పోయినా, ముందుగానే ఒక అభిప్రాయాన్ని ఏర్పఱచు కోకుండా, మనముందున్న సామగ్రిని బట్టి ద్రావిడుల పురాతన భూమి, వారి ఆచార వ్యవహారాలు మొదలయినవి సత్య జిజ్ఞాస తో పరిశీలించాలి. అరికమేడు త్రవ్వకాల్లో లభించిన పురాతన వస్తుసామగ్రి మొదలైన తెలిసిన విషయాలనుబట్టీ, విదేశయా త్రికులు భూగోళశాస్త్రజ్ఞులు వ్రాసిన విషయాలనుబట్టీ, ప్రాచీన తమిళ సారస్వతంలో ప్రసక్తమైన అంశాలను బట్టీ, విచారిస్తే క్రీస్తుశక ప్రారంభ శతాబ్దాల్లోనే మంచి నాగరకత నెలకొన్నట్టు

స్పష్టమౌతుంది. దీన్నిబట్టి చూడగా, బ్రహ్మగిరి దగ్గర లభించిన పురాతన శిథిలాల్లో కానవచ్చే సంస్కృతి ఇంతవఱకూ అను కొంటున్నట్టు క్రీ. పూ. 7వ శతాబ్దం నాటిది కాదనీ దానికి ఇంకా పూర్వం సుమారు క్రీ.పూ. 10వ శతాబ్దం నాటిదనీ తోస్తుంది. పశ్చిమాసియాలో క్రీ.పూ. 2500 సం॥ 1500 సం॥ల మధ్యకాలంనాటిదని అనుకొనే సమాధిశిల్పకళను అక్కడనుంచి మనదేశానికి వలస వచ్చిన ప్రాచీన ద్రావిడులు ఇక్కడ పరివ్యాప్తం చేసి ఉంటారు. రాగి, కంచూ, ఇనుమూ లభించటం కానీ వాటిని వినియోగించటంకానీ భారతభూమి యందే తటస్థించి ఉండటం చేతనూ, ఈవిధంగా తామ్రయుగం లోహ యుగంగా పరివర్తన పొందటానికి మధ్య దీర్ఘకాలం వ్యవధి ఉండి ఉండాలి గనుకనూ, ద్రావిడులు ఇక్కడికి వలస రావటం క్రీ. పూ 1500 సం॥ ప్రాంతాల గాక, అంతకు చాలాముందే (సుమారు క్రీశ 2500 సంవత్సరాలనాడే) సంభవించి ఉంటుంది. పాలస్తీనా సైప్రస్‌లలోని ప్రాచీన వస్తువులకు అనుకృతులుగా అదిచనల్లూరు త్రవ్వకాల్లో బయటబడ్డ సువర్ణనాణాలూ, ఇనుప పాఱలూ క్రీ. పూ .2000 – 1200 సంవత్సరాల మధ్యకాలానికి చెంది ఉంటాయని నిర్ణయించిన పరిశోధకుల మాటలు పై ఊహను బలపరిచేవిగా ఉన్నాయి.

అయితే "మొహంజోదారో హారప్ప శిథిలాల్లోనూ, ఇంకా ఈశాన్యభారతంలోనూ, బయటపడ్డ సింధులోయ నాగ రకతకు కారకులు ద్రావిడులే అని వక్కాణించటానికి ఏమైనా

ఆధారం ఉన్నదా?" అనే ప్రశ్న వస్తుంది. క్రీ. పూ. 2500సం॥ తర్వాతనే ద్రావిడులు హిందూదేశానికి వచ్చిఉంటే, క్రీ.పూ. 3000 సంవత్సరాలనాటి నాగరకతకు వారే కారకులు; అనటానికి అవకాశం లేనేలేదు. అయితే సింధునాగరకతపైన మధ్యధరాప్రాంతీయ సంస్కృతిప్రభావం ఉన్నదనే మాటనిర్వివాదం. వాస్తవానికి మొహంజోదారో హరప్పా శిథిలాల్ని పరీక్షించిన నిపుణులు ఈనగరాలలో నివసించినవారు కులవిభేదాలు పాటించనివారనీ, ఆస్ట్రేలియా ఎలెప్పైన్ మధ్యధరాప్రాంతం మంగోలియా భూభాగాల్లో నివసించిన ప్రాచీనజాతుల సంప్రదాయాలు వీరిలో ఉన్నవనీ నిశ్చయించారు. (4) ఇటువంటి పరిస్థితులలో సింధునాగరకతను ద్రావిడనాగరకతతో సరిపోల్చటం చరిత్రకారుల మతానికి విరుద్ధం. అట్లా అని ఆర్యనాగరతకూ దీనికీ ముడిపెట్టటం అంతకంటెవిరుద్ధం. హరప్పశిథిలాల్లో కాన్పించే సంస్కృతి అనార్యజాతులకు చెందిందని స్పష్టంగా కనిపిస్తున్నవి. ఋగ్వేద ప్రతిబింబిత సంస్కృతి కేవలం గ్రామ జీవితానికి సంబంధించినది. సింధునాగరకత నగర జీవితానికి సంబంధించింది. సింధు దేశీయులకు ఎద్దూ పులీ ఏనుగూ పరిచిత జంతువులైతే వేదకాలపు ఆర్యులకు ఆవూ గుఱ్ఱమూ తప్ప పులీ, ఏనుగులను గురించి తెలియనే తెలియదు. సింధు ప్రజల పాండ్య చిహ్నమైన మత్స్యాన్ని పోలిన మత్స్యానికి విశేష ప్రాముఖ్యం ఇచ్చారు. ఇది ఆర్యసాంప్రదాయంకాదు.

---

(4) ప్రాచీన హిందూదేశం, సం. 9. (1953) 85వ పుట.

సింధువాసుల మతం ఆర్యమతం కానేకాదు. (5) అమ్మవార్లూ పానువట్టమూ లింగమూ శివమూర్తి అనార్య మతంలో మాత్రమే కానవచ్చే దేవతా మూర్తులు. (6) తరువాత కాలపు ద్రావిడ లక్షణాలుతో కొన్ని పోలికలు కనిపించి నప్పటికీ సింధు నాగరకతమీదనూ మధ్యధరా ప్రాంతీయ సంస్కృతిముద్ర ఉండనే ఉన్నది. మొహంజోదారో శిథిలాల్లో లభించిన కాంస్యనిర్మిత నర్తకీ విగ్రహంల్లో ఆస్ట్రేలియా ప్రాచీన వాసుల లక్షణాలు ఉన్నాయి. ఆయావస్తు పేటికల మీద చెక్కినలిపి గుర్తింప గలిగేవఱకూ సింధునాగరకత ఏజాతికి చెందిందో నిర్ణయించటం సాధ్యం కాదు. ఇప్పటికి చెప్పుకోదగ్గ సమాధానం ఏమిటీ అంటే ద్రావిడులు హిందూదేశానికి వలస రావటానికి పూర్వమే మధ్యధరా తీరవాసులు కొంతమంది హిందూ దేశానికి వచ్చి అప్పటికి అక్కడ స్థిరపడి ఉన్న ఆస్ట్రేలియా ప్రాచీన జాతివారితోనూ మంగోలియాజాతివారితోనూ కలసిపోయి ఉంటారని మాత్రమే.

తర్వాత వచ్చిన ద్రావిడులు కొంతకాలం ఈశాన్య భారతంలో నివసించి ఆర్యుల ఒత్తిడివల్ల క్రమంగా దక్షిణానికి పాఱిపోయి అక్కడనే స్థిరపడినట్లు తోస్తుంది. ద్రావిడులందఱు ఒకేమాఱు వలస వచ్చారనటానికి ఆధారంలేదు- కొందఱు మధ్యధరాప్రాంతీయులు సముద్రంమీదుగా వచ్చి హిందూదేశ

---

(5) స్టూవర్టు పిగ్గాట్ చరిత్రకు పూర్వం హిందూదేశము (1950)

(6) అదితీ పృథ్వీదేవతలను ఋగ్వేద కాలంనాడు ఆర్యులుపూజించే వారనే వాదం ఉన్నా ఆవాదం అంగీకరించ దగింది కాదు. ఆర్యులకు విగ్రహములులేవు. వాస్తవానికి వైదికమతం నిర్గుణబ్రహ్మనుమాత్రమే ఆరాధించేది.

పశ్చిమతీరాన నివాసం ప్రారంభించి ఉంటారు. అభ్యుదయోన్ముఖమైన నౌకాశ్రయం పేరుగానూ, బలవంతమైన జాతి నామంగానూ కేరళదేశంలో సుప్రసిద్ధాలైన ముస్రీ, మైరీ నామాలుఅస్సీరియాలోని ప్రాచీనజాతుల పేర్లైనట్టు తెలుస్తున్నది. ఏమార్గాన వచ్చినప్పటికీ ద్రావిడులుకూడా అప్పటికిభారతంలో నివసిస్తున్నవారితో ముఖ్యంగా ఆస్ట్రేలియా ప్రాచీన జాతివారితో సంబంధ బాంధవ్యాలు ఏర్పఱుచుకొని వారితో కలసిపోయి ఉంటారు.

ఈనాడు భారతభూమిలో నీగ్రోజాతి చిహ్నం మృగ్యం. వారితర్వాతవచ్చిన ఇతర జాతులవారు ముఖ్యంగాఆస్ట్రేలియా ప్రాచీన జాతివారు వారిని తమలో లీనం చేసుకొని ఉంటారు. మొట్టమొదటనే గుర్తించిన ప్రకారం దక్షిణకేరళంలోని కాదర్లూ కొండజాతులవారిలోనూ వైనాడులోని ఇరులాలలోనూ ఉత్తర హిందూస్థానంలోని కొన్ని కొండజాతులలోనూ నీగ్రోజాతి స్వరూప స్వభావాలు కొంతవఱకు కనబడుతున్నవి. ఆస్ట్రేలియా ప్రాచీనజాతి రూపలక్షణాలు ఆచార వ్యవహారాలు ద్రావిడ జాతిలో మిళితమైనాయి. ద్రావిడ జాతికీ ఆర్యజాతికీ ఇటువంటి సమ్మేళనమే తటస్థించినా దక్షిణ భారతంలో అది చాలా అల్పంగానే కనిపిస్తుంది. కాబట్టి దక్షిణభారతీయుల స్వరూప స్వభావాది కాలైన జాతిలక్షణాలు సంశ్లిష్టాలైనవి. సాధారణంగా అందరూ ఉద్దేశిస్తున్నట్లు దక్షిణ భారతంలో ఒక విశిష్ట జాతిమాత్రమే నివసిస్తూవచ్చినట్లు చెప్పటానికి వీలులేదు. ఇంతేకాక దక్షిణ భారతం ప్రాచీన చరిత్ర ఇప్పటికీన్నీ విస్పష్టం కాలేదని జ్ఞాపకం ఉంచుకోవటం మంచిది.

# మూడవ అధ్యాయం

## బాహ్యాప్రపంచంతో మొట్టమొదటి సంబంధం

ప్రాచీనకాలంనుంచీ దక్షిణభారతానికిఈజిప్టు, మెసపొటేమియా,సుమేరియా. పాలస్తీనా దేశాలతో వాణిజ్య సంబంధం ఉన్నది. ఈజిప్టు ప్రభువులు హిందూదేశంనుంచి అందులోనూ ముఖ్యంగా దక్షిణ దేశంనుంచి రవసెల్లాలు, చంద్రకట్టెలను సన్న బట్టలుదిగుమతిచేసుకొంటూఉండేవారు. మలబారులో ఉత్పత్తి అవుతూ ఉండే లవంగ పట్ట కూడా అక్కడ ఎగుమతిఅవుతూ ఉన్నట్లు క్రీ. పూ. 1500 సం॥ ప్రాంతాల నాటి ఈజిప్టుదేశ స్థల శాసనాల్లో కనిపిస్తున్నది. క్రీ.పూ. 800సం॥ నాటికి దక్షిణ భారతానికీ పశ్చిమాసియాకీ సముద్రయానంజరుగుతూఉన్నట్లు స్పష్టమైన ఆధారాలుఉన్నాయి. ఆసముద్రయానమున్నూ పర్షియన్ జలసంధీ, ఎఱ్ఱసముద్రాలగుండా జరిగేది. సాలమన్ ప్రభువుకు మూడేండ్లకొకమారు బంగారమూ, వెండీ, దంతపు సామానులూ, కోతులూ, నెమళ్ళూ, మంచి గంధపుచెట్లూ అమూల్యరత్నాలూ చేరుతూ ఉండేవని యూదు గ్రంథాల్లో కనబడుతున్నది. నెమళ్ళూ "(తమిళ పరిభాషలో తుక్కిన్)" మంచి గంధపు కట్టెలూ (తమిళ ప్రాంతాన పర్వతాలపై పెరిగేచెట్టు) దక్షిణభారతంనుంచే ఎగుమతి అయేవి. క్రీ.పూ. 6వ శతాబ్దంలో నిర్మితమైన చంద్ర దేవాలయం (సుమేరియా రాజధానిలో కట్టినగుడి) లోనూ, నెబూచదనజార్ లోని రాజభవనంలోనూ

మలబారులోని రేవులను వాడారు. ఈ శిథిలావశేషాలు క్రీ.పూ. 6వ శతాబ్దానికి ఇంకాముందే దక్షిణానికీ పశ్చిమ భారతానికీ వాణిజ్యం జరుగుతూఉన్నట్లు తెలియజేస్తున్నవి. సన్నబట్ట అనే అర్థం ఇచ్చే సింధు అనే పదం బాబిలోనియన్ భాషలో ఒకవిధమైన దుస్తులపేరు కావడంచేత దక్షిణభారతానికీ బాబిలోనియాకీ వర్తకసంబంధం ఉండేదని చాటుతున్నది. గ్రీకులు పశ్చిమాసియా దక్షిణభారతాల మధ్య వ్యాపార నిర్వహణకు పూనుకోవటంవల్ల దక్షిణభారతం యూరపులకు క్రీ.పూ. 500 సం॥ ప్రాంతాలలోనే వాణిజ్య సంబంధం ఏర్పడ్డది. ఈసంబంధాన్నిబట్టి దక్షిణభారతపు సరుకుల పేర్లు కొన్ని తమిళపదాలు గ్రీకులు పరిగ్రహించినట్లు సోఫోక్లీస్, అరిస్టాఫేనీస్‌ల వ్రాతలనుబట్టి తెలుస్తున్నది. అరవంలోని అరిసి అనే తమిళ పదంనుంచి పుట్టింది ఒరైజా అనే గ్రీకుపదం. ఇల్లాగే "కార్పియస్" అనేది కరువా (సున్నపురాయి) అనేపదంనుంచీ, "జిగ్గిబేరస్" అనేది "ఇంజివేర్" అనేపదంనుంచీ, "పెప్పరీ" అనేది "పిప్పలీ" (పొడుగుమిరియం) అనేపదంనుంచీ పుట్టిన వికృతులు.

క్రీస్తుశక ప్రారంభ శతాబ్దాలలో ఐరోపాతో దక్షిణభారతానికి కల వాణిజ్య సంబంధం ఎలాఉండేదో తెలిసికొనటానికి అనేకులయిన ఐరోపావాసులు వ్రాసి ఉంచిన అంశాలు మనకు చాలా ఉపయోగిస్తాయి. రోముచక్రవర్తి అగస్టస్‌కు సమకాలికుడైన స్ట్రాబో వ్రాసిన భూగోళశాస్త్రమూ, క్రీ.శ. 60సం॥ ప్రాంతంలో ఒక అజ్ఞాత రచయిత వ్రాసిన "పెరిప్లస్" అనే గ్రంథమూ, ప్లినీ వ్రాసిన "వాస్తవచరిత్ర" (క్రీ.శ. 77వ సం॥) టాలెమీ వ్రాసిన భూగోళశాస్త్రమూ (క్రీ.శ. 150సం॥)

ఎన్నో విశేషాలు తెలియజేస్తున్నాయి. ఈనై దేశిక రచయితలు పేర్కొన్న అంశాలు సంగంకాలంనాటి తమిళ గ్రంథాలలో కనబడే అంశాలకు సరిపోతున్నాయి. ఇటీవల పుదుచ్చేరి దగ్గరి ఆరిక మేడులో బయటబడ్డ వస్తువులూ ఇంకా దక్షిణ భారతం లోని అనేక స్థలాలలో త్రవ్వితీసిన అసంఖ్యాకమైన రోమను నాణెములును ఐరోపాకూ దక్షిణభారతానికీకల చురుకైన వాణిజ్య సంబంధాన్ని నిరూపిస్తున్నవి. మలబారు సముద్ర తీరానఉన్న రేవుపట్టణాలలో టిండిస్ (నేటి'పొన్నాని')ముజిరిస్ (క్రాంగనూర్) నెల్సిండా (కోట్టయం) బాకేర్ (పోర్కాడ్) కుమరిలు ఆనాడు ప్రాముఖ్యం కల రేవు స్థలాలు.

తూర్పుసముద్ర తీరాన కొలొర్కాయ్ (కార్కాయ్) నికామా (నాగపట్నం) కమారా (కావేరీపట్టణం) పొదుకీ (పుదుచ్చేరి) సొపాట్నా (మార్కాణం) మసాలియా (మచిలీ పట్టణం) ఒరిస్సాలోని దోసరేన్ ప్రసిద్ధాలైన రేవుపట్టణాలు. తమిళకావ్యాలలో తొండీము స్త్రీలను గురించి మాత్రమే కాకుండా పశ్చిమతీరాన బందరు తూర్పుతీరాన కావేరీపట్టణం సాలియూర్లను గురించిన ప్రశస్తి కనిపిస్తున్నది.

దక్షిణభారంతంనుంచి రకరకాల వస్తువులు భారీగా ఎగుమతి అయేవి. వాటిలో ముత్యాలు, వజ్రాలూ, కెంపులూ, మిరియాలూ, చంద్రకట్టెలూ, టేకూ, రోజ్‌వుడ్డు, మంచిగంధపు చెక్కలూ, రవసెల్లాలూ, బియ్యమూ, సున్నపురాళ్లూ, లవం గాలూ, దాచినచెక్క అల్లమూకూడా ఉండేవి. సింహాలూ, చిఱుతపులులూ, కోతులూ, నెమళ్ళూ, చిలుకలూ, కూడా

ఎగుమతి అయేవి. గాజూ, సీసమూ, ఇత్తడి, సీనారేకూ, కొన్నిరకాలపాత్రలూ, ద్రాక్షపండ్లు, ఇండియాకు ముఖ్యంగా దిగుమతి అవుతూ ఉండేవి. బానిసల్నీ, పాడనేర్చిన గ్రీకు కన్యల్నీ ఐరోపావారు దక్షిణభారతానికి పంపేవారు.

రోమను చక్రవర్తుల కాలంలో రోమునగరంలో వ్యాపారం చాలా ఉచ్చస్థితిలోఉండేది. పాండ్యరాజు ఆస్థానం నుంచి అగస్టస్‌చక్రవర్తి దగ్గఱకు ఇద్దఱు రాయబారులు వెళ్ళారు. క్రీ. వె. 45 సంవత్సరం ప్రాంతంలో హిప్పాలస్ అనే అతను హిందూదేశానికి క్రొత్తసముద్ర మార్గం కనిపెట్టాడు. అందువల్ల పెద్దపెద్దఓడలు వ్యాపారపవనాల సాయంతో ఐరోపానుంచి మలబారు తీరానికి త్వరలో చేరుకోవచ్చునని స్పష్టమైంది. అంతకు పూర్వం ఇటువంటి ప్రయాణాలకు చిన్న చిన్న ఓడల్నే ఉపయోగించేవారు. అవి కేవలంతీరానికి చేరువగానే ప్రయాణిస్తూ ఉండటంవల్ల చాలా ఆలస్యమయ్యేది. హిప్పాలస్ కృషిఫలితంగా ఇండియాకూ రోమునగరానికీ క్రీ. వె 1,2 శతాబ్దాలలో వ్యాపారం విరివిగా జరిగింది. దక్షిణభారతంలోని కొన్ని వ్యాపారకేంద్రాలలో రోమనులు ప్రత్యేకంగా నివసిస్తూ వచ్చిన పేటలు కనిపించాయి. ఈకాలంలో రోమను వస్తు విక్రయశాల ఒకటి ఉండేది. అరికమేడు త్రవ్వకాలలో ఇట్టి విక్రయశాల మాత్రమేకాక మధ్యధరా ప్రాంతీయపు వస్తువులనేకం బయటపడ్డాయి. ఇండియానుంచి భారీగా దిగుమతి అయ్యే సరకులకుగాను రోమనులు చెల్లించవలసివచ్చే అపరిమితమైన కనక రజతరాసులు చూస్తూఉన్న రోమను ప్రజలనేకులు, భోగాలకోసం ఇంత ద్రవ్యం వెచ్చించటం కేవలం అను

చితం' అని గంపలుగోళం చేసేటంతవరకూ వచ్చింది. హిందూ దేశంతో సాగుతున్న వ్యాపారం కోసం రోమునగరం నుంచి ఏటేటా 55 మిలియన్ల సెసస్టు (అంటే సుమారు 600,000 పౌనులు) ఖర్చు అయ్యేదని ప్లైనీ చెప్పాతున్నాడు.

క్రీస్తు తర్వాత రెండవశతాబ్దం చివరకు గ్రీకుల పరిస్థితులు తారుమారు కావటంవల్ల అరబ్బులే ఈవాణిజ్యం అంతా గుత్తకు తీసికొన్నట్లైంది. క్రీస్తుశకం ప్రారంభ శతాబ్దాలలో దక్షిణహిందూదేశంలోనూ, సింహళంలోనూ అరబ్బులు స్థిరనివాసాలు ఏర్పరుచుకొని ఉండేవారు. తిరునెల్వేలి జిల్లాలో తూర్పుతీరాన నేటికిన్నీ లబ్బేలు అనే తమిళ ముస్లిములు అత్యధింగా నివసిస్తున్న కాయల్పట్టణంలో అరబ్బులు ఆనాడు స్థిరవాసం చేస్తూ ఉండేవారు. కాయల్పట్టణంవద్ద క్రీ.శ. 7వశతాబ్దం నుంచి 10వ శతాబ్దంవరకూ ముద్రితాలవుతూవచ్చిన ముస్లిము నాణెములనేకం కాల్వెల్ కు లభించాయి. క్రీ.శ. 78వ సంవత్సరంలో నీరోచక్రవర్తి మరణించిన తర్వాత దక్కను ఉత్తర ప్రాంతంలో పశ్చిమ సముద్రతీరం వెంట జరిగినంత వర్తకం తమిళ దేశానికీ రోమునగరానికీ జరుగలేదు. దక్కనుతీరం లోని సామాన్యపు రేవుపట్టణాలట్లా ఉండగా టేర్ (లుగారా) సొపారా, పైఠాన్, కల్యాణ్ రేవు పట్టణాలనుంచి విశేషంగా ఎగుమతి జరిగేదని రేవుపట్టణాల పూర్వచరిత్ర పరిశోధనవల్ల తెలుస్తున్నది. క్రీ.శ. నాలుగవశతాబ్దం అంతాకూడ దక్షిణ హిందూదేశం రోమునగరాల వాణిజ్యసంబంధం వెనుకటివలెనే జరిగింది, కాని తర్వాత అది త్వరలోనే అంతరించింది.

అయితే ఈమొత్తంకాలం అంతటిలోనూ దూరదేశాలతో ఈవర్తకాన్న దక్షిణహిందూదేశీయులే ఆధ్వర్యం

వహించి జరుపలేదని గుర్తించటం అవసరం. అలెగ్జాండరు రాకకు పూర్వం భారతీయవర్తకులు, బాబిలోనియా ఎఱ్ఱసముద్రాలనుదాటి అవతలికి వెళ్ళనేలేదు. ఈవాణిజ్య ప్రథమ దశలో గ్రీకులూ, ఈజిప్టు దేశస్థులున్నూ, తర్వాత క్రీ.శ. 1, 2 శతాబ్దాలలో అరబ్బులూ రోమనులున్నూ బాబిలోనియా ఎఱ్ఱసముద్రాల దగ్గఱనుంచి హిందూదేశపు సరుకులను ఇంకా పై దేశాలకు తీసికొనిపోయి అమ్ముతూ ఉండేవారు. అయితే వారుకూడా ఈసరుకులను అలెగ్జాండ్రియాలోనే కొంటూ ఉండే వారు. భారతీయవర్తకులు సాధారణంగా అలెగ్జాండ్రియాలోనే వస్తువులు విక్రయించుకొని వెనుకకు వచ్చేవారు. భారతీయ నావికులు ఎఱ్ఱసముద్రందాటి పశ్చిమానికి వెళ్ళకపోయినా వారు సముద్రయానంలో అందె వేసినవారు. ప్రాచీన నౌకాస్వరూపా లను గూర్చి పరిశోధిస్తే పూర్వం తూర్పుతీరాన మూడురకాల నావలు ఉపయోగంలో ఉండేవని తెలుస్తున్నది. కొన్ని సామాన్యపు నావలు. ఇవి తీరం వెంటనే పయనించేవి. కొన్ని పెద్దపెద్ద చెక్కలతో అమర్చిన పెద్దనౌకలు. కేవలం సుదీర్ఘ ప్రయాణాలకు ఉపయోగపడే మఱీ పెద్దనావలు.

ఇటు ఇండియాకు పశ్చిమదేశాలతో వర్తకం సాగు తున్నప్పుడే అటు తూర్పుదేశాలతోకూడా విరివిరిగా వ్యాపా రం జరుగుతూ ఉండేది. దక్షిణహిందూదేశం తూర్పున మొట్ట మొదట చీనాదేశంతో వర్తకం జరుపుతూ ఉండేది. క్రీ.పూ. 7వ శతాబ్దానికే హిందూదేశపు సరుకు తమ దేశానికివస్తూ ఉండేవని చీనాచరిత్రకారులు చెప్పతున్నారు. తమిళ దేశంలో సిల్కుకు "సీనమ్" అనీ పంచదారకు "చీనీ" అనీ వ్యవహారం ఏర్పడటం చైనా ప్రజల సాహచర్యం వల్లనే. ఇంతేకాక ఫిలి

ఫిలిప్పైన్సులో ఇటీవల భూగర్భంనుంచి బయటపడ్డ శిలాయుగం నాటి కత్తులూ, గొడ్డళ్ళూ, ఈటెలూ క్రీ.పూ. వెయ్యి సంవత్సరాలనాడు దక్షిణహిందూదేశంలో వాడుకలోవున్న పరికరాల మాదిరిగానేవున్నాయి. మలయా, జావా, ఉత్తర బోర్నియోలలో కూడా ఇటువంటివస్తువులు దొరికాయి. వీటి అన్నింటినీ బట్టి విచారిస్తే క్రీ. పూ. వెయ్యి సంవత్సరాల నుంచీ దక్షిణ హిందూ దేశానికీ ఫిలిప్పైను దీవులకూ వాణిజ్య సంబంధం ఉండేదని స్పష్టపడుతున్నది. అయితే పశ్చిమ దేశాలతో కల వ్యాపారం మాదిరిగా కాక తూర్పు దేశాలతో జరిగే వ్యాపారంలో భారతీయనాకలే సరుకుల్ని చేరవేస్తూ ఉండేవి.

క్రీస్తు యుగోదయం నాటికి ఇటు రోమునగరం నుంచి అటు సుమారు ప్రాచ్య దేశాల వరకూ జరుగుతూ ఉండే వాణిజ్యాని కంతటికీ దక్షిణ భారతమే కేంద్ర మయింది. భారతీయులే చైనా మలయాల నుంచీ యింకా చుట్టు పట్ల దేశాల నుంచీ సరుకులు కొని ఐరోపియను లకు అమ్మేవారు. దక్షిణ భారతం తూర్పు తీరాన జరిగే వర్తకంలో తమిళులు మాత్రమేకాక, ఆంధ్రులూ ఒరియాలూ కూడా పాల్గొనేవారు. మసలిపూ ప్రాంతం (ఆంధ్రదేశం)లో నుంచి సన్న బట్టలూ, దొసరేన్ అనే నామాంతరం గల ఒరిస్సా నుంచి దంతపు సామానులూ ఎగుమతి అవుతూ ఉండేవని ప్రాచీన నౌకా వాణిజ్య పరిశోధనవల్ల తెలుస్తున్నది. క్రీ. శ. 4 వ శతాబ్దానికి పూర్వం పశ్చిమ దేశాలతో దక్షిణ హిందూదేశపు వాణిజ్యం కొంతకాలం ఆగిపోయినట్టు కనబడుతున్నది కాని తూర్పు దేశాలతో గల వర్తక సంబంధం నిరాఘాటంగా సాగుతూనే వున్నదని గుర్తించటం అవసరం. ఇంతేకాక ఈవాణిజ్యం వల్ల

భారతీయులు ఆయా దేశాలలో నివసిస్తూ వుండటమూ భారతీయ సంస్కృతి అక్కడ పరివ్యాప్తం కావటమూ కూడా సంభవించాయి. దక్షిణ భారతం ప్రాక్పశ్చిమాల అతి దూరం వరకూ వాణిజ్యంజరుప గల్గిందంటే దేశమధ్యంలో వర్తకం ఎంత అభ్యున్నతిలో వుండేదో ఎంతకట్టు బెట్టంతో జరిగేదో ప్రత్యేకంగా చెప్ప వలసిన పనిలేదు. బండ్ల మీదను, జంతువుల మీదను సరుకు లెత్తించుకొని దేశం నలుమూలలకూ తిరిగి వర్తకం చేసే చనుప లను గుఱించి సంగం కావ్యాలలో విస్తృత వర్ణనలు కనిపిస్తాయి. వార వారమూ సెలవు రోజుల్లోనే కాకుండా పండుగ పండుగకూ సంతలు జరిగేవి. ఈసంతలలో వస్తు వినిమయం ద్వారానే విశేష వ్యాపారం జరుగు తున్నట్లు కనబడుతుంది. కొన్ని కొన్ని వస్తువుల వినిమయానికి కొన్ని కొన్ని నగరాలు ప్రసిద్ధాలుగా వుండేవి. నూలు వర్తకానికి ఉరయూరు ప్రధాన కేంద్రం. ఉత్తర దక్షిణ భారతాలకు ప్రాచీన కాలం నుంచీ వాణిజ్య సంబంధం వుండి వుండాలి. కాని క్రీ. పూ. ౪వ శతాబ్దం దగ్గఱ నుంచీ మాత్రమే చెప్పుకో దగినంత వర్తకం జరుగుతూ వచ్చిందేమో అని అనుమానించవలసి వస్తున్నది. దక్షిణ భారతాన్ని గూర్చిన ప్రసక్తిలో మెగస్తనీసు ఇతర విశేషాలతో బాటు పాండ్య దేశంలో విరివిగా జరుగుతూఉండే ముత్యాలసేకరణను కూడా పేర్కొన్నాడు. కౌటిల్యుని అర్థశాస్త్రంలో దక్షిణ భారతంతోడి వాణిజ్యసంబంధానికికూడా ప్రాముఖ్యం ఇవ్వటం జరిగింది. అందులోనూ ముఖ్యంగా తామ్రపర్ణీమౌక్తికాలనూ మధుర నేతబట్టలనూ గురించి ప్రశంస ఉన్నది. ఈదక్షిణోత్తర దేశాలకు రెంటికీ తూర్పుతీరం వెంటగానీ, బంగాళాఖాతం

మీదుగాగానీ మొత్తంమీద సముద్రం ద్వారానే వ్యాపారం జరుగుతూ ఉండేది.

అయితే ఉత్తర దక్షిణభారతాలకు గల సంబంధం వాణిజ్యమూలమనే నిర్ణయించటానికి వీలులేదు. చాలాపూర్వ కాలంనుంచీకూడా ఉత్తరంనుంచి దక్షిణానికి ఆర్యులు వలస వస్తూవుండేవారు. ఇల్లా వలసవచ్చినవారు క్రమంగా ప్రభువుల ఆదరాభిమానాలు సంపాదించి, దానివల్ల దేశంలో పలుకుబడి వృద్ధిచేసికొని తమ ఆచార సంప్రదాయాలను ప్రజానీకంలో ప్రవేశపెట్టటం ప్రారంభించారు. ఆర్యుల విశ్వాసాలూ, ఆచారాలూ ఈవిధంగా ద్రావిడ సంప్రదాయాలలో సమ్మిళితాలై నాయి. అందువల్ల సంస్కృతి సమన్వయానికి ఎక్కువ అవకాశం కలిగింది. కాని దక్షిణభారతంలో ఆర్యమత ప్రభావం నిదానంగా ప్రారంభమై క్రమక్రమంగా అభివృద్ధి చెందిందని ఎవ్వరూ గ్రహించినట్లులేదు. "దక్షిణభారతంలో ఆర్యమత ప్రభావం" అనే గ్రంథములోచేసిన అవిచారిత సిద్ధాంతాలు వాస్తవానికి దూరంగా వున్నాయి. దానిలో పేర్కొన్నట్లు "గాల్ దేశంమీద రోమను ప్రభావం"తో దక్షిణభారతం మీద ఆర్యప్రభావాన్ని పోల్చటానికి వీలులేదు. అంతేకాక ఆర్యులఆచారవ్యవహారాలుకొన్ని ద్రావిడులుఅవలంబిస్తూవచ్చి నప్పటికీ, ఆఅవలంబనం యావత్తూ ద్రావిడాచారాలకు కొద్ది పాటి మార్పుగానే వున్నదికాని, మూలచ్ఛేదం చెయ్యలేదు. నిజం చెప్పవలసివస్తే "ఉభయ సంస్కృతులకూ ఇక్కడ చక్కని సమన్వయం జరిగింది" అనే అనాలి. ఆర్యమత సంప్రదాయాలను చాలావాటిని ద్రావిడులుఅలవరచుకోగా, అనేక ద్రావిడ సంప్రదాయాలను ఇక్కడ స్థిరపడ్డ ఆర్యులుకూడా

అలవఱచుకొన్నట్లు ఎన్నో నిదర్శనాలు వున్నాయి. మేనత్త మేనమామబిడ్డలను వివాహమాడటం, మంగళసూత్రంకట్టడం, పసుపు కుంకుమలు వివాహమాహాత్మ్యవాల్లో ముఖ్యంగా వుపయోగించటం, శుభకార్యాలలోనూ వేడుకలలోనూ కొబ్బరి బొండానికీ తమలపాకులకీ ప్రాధాన్యం ఇవ్వటం, సతీసహగమనమూ, వితంతువులకు కేశఖండనమూ, ద్రావిడ సంప్రదాయాలనుంచి ఆర్యులు పరిగ్రహించిన వాటిలో ముఖ్యంగా పేర్కొనవచ్చును. ఆకాలంలో ద్రావిడ ప్రజలకు ఆరాధ్యులుగా వుండే ఎందరో దేవతలను గూర్చిన పురాణ కథలూ, ఇతిహాసాలూ ఆర్యవాఙ్మయంలో సుప్రతిష్ఠితాలైనాయి. ఆయా దేవతల పేర్లూ, స్వరూప స్వభావాదులూ, ఆర్యులుసమాదరించి, సముచితంగా, తమ మతగ్రంథాల్లో ప్రవేశపెట్టుకొన్నారు. రావిచెట్టు పెండ్లికొడుకుగా, వేపచెట్టు పెండ్లికూతురుగా భావించి రెంటికీ వివాహంచేసే సంప్రదాయం ద్రావిడులు ఆర్యులూ పరస్పర సంప్రదాయాల్ని సమన్వయించుకొన్నారనటానికి చక్కని ఉదాహరణం. రావిచెట్టు ఆర్యులకు పరమ పవిత్రమైతే, వేపచెట్టు ద్రావిడులకు పరమ పవిత్రం. ఆర్య ద్రావిడ ప్రాచీన గాథల సమైక్యం పురాణవాఙ్మయంలో ప్రతిబింబిస్తున్నది. కాబట్టి చిట్టచివరకు చెప్పదగిందేమంటే ఆర్య ద్రావిడ సంస్కృతి సమన్వయాన్ని రోమను-గాలు సంస్కృతి సమన్వయంతో కాక, గ్రీసు దేశంలో ప్రాచీన ఏజియన్ సంస్కృతికీ తరువాతి హెల్లెనిక్ సంస్కృతికీ కలిగిన సమన్వయంతో పోల్చటం సముచితం.

ఇదీకాక ఆర్యులు హఠాత్తుగా అసంఖ్యాకులుగావచ్చి, దక్షిణభారతాన్ని ఆక్రమించుకోనూలేదు. ఒక్కమాటుగా

ఇక్కడి ప్రాచీన ప్రజల ఆచారవ్యవహారాలను మార్చివేయనూ లేదు. అయితే విదర్భమహారాష్ట్రాలు ఆర్యావర్తానికి చేరువగా ఉండటంవల్ల ఆర్యసేనలు అక్కడికి దండెత్తివచ్చి, తమ ప్రభుత్వాన్ని ప్రతిష్ఠించుకోవటంతోబాటు, తమ సంస్కృతిని కూడా సమగ్రంగా అక్కడి ప్రజలమీద ఆకస్మికంగానే ప్రసరింప జేశారని ఊహించవచ్చును. ఈ రెండురాష్ట్రాలకూ దక్షిణాన ఉన్న భూభాగానికి ఆర్యులు స్వల్ప సంఖ్యలో క్రమక్రమంగా చేరుకొన్నట్లు నాటి దేశ పరిస్థితులనుబట్టి ఆలోచిస్తే స్పష్టమౌతుంది. రామాయణం చదివి, అది దక్షిణ భారతంమీద ఆర్యవిజయం చాటుతున్నదని భావిస్తే పురాణాలకూ, చరిత్రకూ కల భేదాన్ని గమనించకపోవటమే అవుతుంది. దక్షిణభారతానికి వలసవచ్చిన ఆర్యజాతినాయకుడైన అగస్త్య మహర్షి అద్భుతకృత్యాలు అన్నీ పరమ సత్యాలని భావించటానికి వీలులేదు. అగస్త్యమహర్షి కథలు ఋగ్వేదంలోనూ, ఇతిహాసాల్లోనూ, పురాణాల్లోనూ, వీటి అన్నింటి తర్వాత తలయెత్తిన తమిళ గ్రంథాలలోనూకూడా కనబడుతున్నాయి. ప్రాచీన కథలలో పేర్కొనబడిన అగస్త్యుడు సర్వత్ర ఒక్కడు కాడనీ, ఆ పేరు కలవారు అనేకులు వుండేవారనీ, అనటం నిర్వివాదమైన విషయం. అనేక ఘట్టాలలో, అనేక పర్యాయాలు ప్రోక్తమైనంత మాత్రాన పురాణస్థ విషయంకానీ, అంతకంటె ప్రాచీనమైన విచిత్ర కథలలో ప్రచారమౌతూ ఉన్న విషయం కానీ, చరిత్రాత్మకమైన సత్యం కానేరదు. విశ్వామిత్రుని 50 మంది కుమారుల సంతతివారే ఆంధ్రులు, పుండ్రులు, శబరులు పుళిందులు, మూతిబులు అని వేర్వేరు జాతులుగా వర్ధిల్లారనీ, వీరికందరికీ దస్యులనే వ్యవహారం ఉండేదనీ ఐతరేయ

బ్రాహ్మణాం చెప్పుతున్నది. ఆర్యులు ఆక్రమించుకొన్న ప్రాంతాలలో స్థిరనివాసం ఏర్పరచుకొన్నారని దీనినిబట్టి నిర్ణయించటం కష్టం. ఉత్తరభారత భౌగోళిక విజ్ఞానం జీర్ణించుకొన్న పాణిని క్రీ.పూ. 600 సంవత్సరాల ప్రాంతాన జీవించినవాడు. ఈయన నర్మదానదికి దక్షిణంగా ఉన్న కళింగదేశం వరకూ మాత్రమే దక్షిణభారతంలో ఆర్యులు వ్యాపించినట్లు పేర్కొనటంవల్ల అతని తరువాతనే ఆర్యజాతి యింకా దక్షిణానికి వచ్చినట్లు ధ్రువపడు తున్నది. ఇది ఇలా ఉండగా క్రీ. పూ 4 వ శతాబ్దంలోని కాత్యాయను డనే వైయాకరణి మఱికొన్ని దక్షిణ రాష్ట్రాలను పేర్కొన్నాడు. కనుక బహుశః క్రీ. పూ. 6వ శతాబ్దానికి ఇవతల నుంచీ ఆర్యులు దక్షిణానికి వచ్చి ఉండవచ్చును.

దక్షిణానికి ఆర్యులనుఆకర్షించిన పరిస్థితులు ఎటువంటివై ఉంటాయి? గంగా తీరపు మైదాన వంటి సారవత్ప్రాంతాలకు ఆర్యులు నిరంతరంగా చేరున్నట్లుగా ఆకాలం నాటికి వారు దక్షిణ భారతానికి రాదగిన అవకాశాలు కానీ సారవద్భూములు గానీ కనబడవు. అసలు వారు అప్పటికి దక్షిణ భారతాన్ని గుఱించి ఆలోచించేవుండరు. తర్వాత ఎన్నో శతాబ్దాలకుగాని దక్షిణాన మనుష్యులు స్థిరవాసం ఏర్పఱుచుకోదగిన పరిస్థితులు కలుగలేదు. అదీకాక ఆర్యావర్తం వారికి చాలనంతగా జనసంఖ్య పెఱుగనూలేదు. లేదా మఱికొంత భూభాగం ఆక్రమించుకొందామన్న ఆలోచనకూడా వారికి కలుగలేదు. ఆర్యావర్తానికి దక్షిణపు సరిహద్దు వింధ్యపర్వతమే అని మనువు అప్పటికి నిర్దేశించేవున్నాడు. అందువల్ల క్రొత్తప్రాంతాలు ఆక్రమించుకోవాలనే ఆశయంతో ఆర్యులు దక్షిణానికి రాలేదు. మతం వ్యాప్తిచేయాలనే ఉత్సాహమే

వారిని దక్షిణ భారతానికి ఆకర్షించి ఉంటుందని చెప్పాలి.

బౌద్ధులూ జైనులూ దక్షిణ భారతంలో పర్యటనం ప్రారంభించిన తర్వాత ఆర్యులకు కూడా తమ మతం దూర దేశాలలో వ్యాపింప జెయ్యాలని సంకల్పం కలిగి ఉంటుంది. ఈమునులు మొదట నిర్జన ప్రదేశాలలో ఆశ్రమాలు నిర్మించు కోవాలనే కుతూహలంతో దక్షిణానికి వచ్చి అటు తర్వాత ఇక్కడి ప్రజలకు తమ సిద్ధాంతాలు బోధించటం ప్రారంభించి ఉంటారు. క్రీ. పూ. 2, 3 శతాబ్దాల నాటి బ్రాహ్మివిగ్రహాలు అత్యంత దక్షిణ ప్రాంతాన ఉన్న గుహాలలో లభించాయి. ఇక్కడి ఈపర్వతానికి "పంచపాండవమల" అని పేరు. ఇది బుద్ధ దేవుని పేరుతో సంబధమున్న "పాండవపబ్బ" అనే శబ్దానికి రూపాంతరంగా కనబడుతుంది. ఇతరుల్ని కూడా తమ మతంలో కలుపు కోవాలనే కోరికతోనే బుద్ధుని అనంతరం అర్యమత ప్రచారకులు ఇక్కడికి వచ్చారు. అశోకుని పదుమూడవ శిలా శాసనం వల్ల ఆంధ్రదేశం అంతటా అప్పటికి బౌద్ధమతం వ్యాపించి నట్లు తెలుస్తున్నది. గుంటూరు జిల్లాలోని భట్టిప్రోలులో దొరికిన క్రీ. పూ 3 వ శతాబ్దం నాటి విగ్రహాలు ఈప్రాంతంలో ఆనాడు బౌద్ధమతం వేళ్లు పాదుకొన్న దనటానికి నిదర్శనాలు. అశోక చక్రవర్తి పరిపాలన జరుగుతున్న అతిప్రాచీన కాలం లోనే కాంచీ నగరం బౌద్ధ మతానికి ఆచార్య పీఠంగా ఉండేది.

ఇదేవిధంగా క్రీ. పూ. 3 వ శతాబ్దంలో జైనులు కూడా ఇక్కడికి వచ్చినట్లు కనబడు తున్నది. మధుర, తిరునెల్వేలి జిల్లాలలోని గుహాలలో కనబడుతున్న క్రీ. పూ. 3, 2 శతాబ్దాలనాటి విగ్రహాలలోకొన్ని జైన శిల్పాలు, జైనగ్రంధాలను బట్టి ఉత్తరభారతంలో తటస్థించిన విపత్తులనుంచి బయటబడ

టానికి భద్రబాహువు అనే ఆచార్యుడు తన శిష్యులతో మైసూరు రాజ్యానికి వలసవచ్చినట్లు తెలుస్తున్నది. భద్రబాహువు తర్వాత విశాఖాచార్యుడనే దిగంబరస్వామి సశిష్యుడై, చోళ పాండ్య రాష్ట్రాలలో పర్యటించాడు. ప్రాచీనయతులు కేవలం మతవ్యాప్తికోసమే. దక్షిణభారతానికి రాకపోయినా వారిలో ఈఅభిప్రాయంకూడా ఉండేది. క్రీస్తుయుగప్రారంభంలో సుప్రసిద్ధుడైన కుందకుందాచార్యుడు తమిళదేశంలో జైనమతం వ్యాపింపజెయ్యటానికి చాలా కష్టపడ్డారు. మణిమేఖల, శిలప్పదికారం వంటి ప్రాచీన తమిళ పురాణాలలో జైనసన్యాసులను గురించీ, జైన సన్యాసినులను గురించీ విశేష ప్రశంస కనబడుతున్నది. అనేక జైనమతప్రచారకులు కర్ణాటకరాష్ట్రంలోపర్యటించారు. క్రీ.శ. 2వశతాబ్దంలో గాంగులు అధికారంలోనికి వచ్చేటప్పటికి జైనమతం ఇక్కడ స్థిర పడ్డది. రాజులుకూడా దీన్ని అభిమానించారు. బౌద్ధులూ జైనులూకూడా పశ్చిమతీరానఉన్న రాష్ట్రాలలో నివసించారు. తిరువాన్కూరులో ప్రాచీనకాలంనాటి బౌద్ధజైనగుహాలు కనబడుతున్నాయి.

జైనులూ బౌద్ధులూ దక్షిణభారతంలో చేస్తున్న తీవ్ర మత ప్రచారం గమనించిన బ్రాహ్మణులు తమ అనుచరులను కూడా మత ప్రచారం చెయ్యటానికి అక్కడికే పంపించారు. ఇందువల్ల సర్వసన్నాహాలతోనూ ఆర్యులు దక్షిణభారతానికి వలసరావటం క్రీ.పూ. 3వశతాబ్దానికి ఇటీవలనే ప్రారంభమై ఉంటుంది. ఆనాడు ఈ దేశంలో బలవంతులుగా ఉన్న రాజుల ప్రాపకంతో బ్రాహ్మణులు తమ ఉద్యమం విజయవంతం చేసికొన్నారు. వారు రాజ గురువులూ, రాజనీతి నిర్ణేతలూ,

మంత్రులూ అయినారు. అందువల్ల సహజంగానే వారి ప్రతిష్ఠ వృద్ధిపొందింది. ఆర్య ద్రావిడ విశ్వాసాలుగానీ, పురాణాలుగానీ, సాంఘిక కార్యకలాపాలుగానీ, మతాచారాలుగానీ సమన్వితాలు కావటం క్రీ.పూ. 6వ శతాబ్దం తరువాతనుంచే విశేషంగా జరిగింది. ద్రావిడులలోని కొంతమంది పండితులు బ్రాహ్మణుల ఉపదేశాలకు లొంగి వుంటారు. ఇందువల్లనే తమిళులలోని అరివేలర్లూ, తెలుగులలోని ద్రావిడ బ్రాహ్మణులూ ఆర్యమతంలో కలసిపోవటం జరిగి వుంటుంది. దీని ఫలితంగానే ఆర్య ద్రావిడ సంస్కృతులు రెండూ మత విశ్వాసాలలో ఏమి, ఆచారాలలో ఏమి, సంఘనియమాలలో ఏమి, సంప్రదాయాలలో ఏమి, భాషాసారస్వతాలలో ఏమి, అన్ని రంగాలలోను సమన్వయం సాధించుకొన్నాయి.

# చతుర్థ ప్రకరణం

## ప్రాచీన సామ్రాజ్య నిర్మాతలు

దక్షిణభారతంలో మొదట సార్వభౌమత్వం నెలయిం చినవారు మౌర్యులు. చంద్రగుప్తుడు కానీ బిందుసారుడు కానీ మైసూరు వఱకూ దక్షిణాన సామ్రాజ్యం వ్యాపింప జేసినట్లు నిశ్చయంగా చెప్పటానికి ఆధారాలులేవు. మైసూరు రాష్ట్రం లోని బ్రహ్మగిరి, సిద్ధపురాలవద్దనూ, గుత్తి సమీపాన వున్న యెఱ్ఱగుడివద్దనూ లభించిన అశోకుని శిలాశాసనాలనుబట్టి అశోకుని పరిపాలనాకాలంలో అతని సామ్రాజ్యం ఇంతవఱకూ వ్యాపించినట్లు కనబడుతున్నది. సంగం వాఙ్మయంలో మౌర్యుల దక్షిణదేశ దండయాత్రను గూర్చిన కొన్ని వివరాలున్నాయి. అందుచేత ఈవిషయంలో అనుమానించవలసిన పనిలేదు. ఈ దండయాత్ర చేసినది బిందుసారుడే కావచ్చును. బిందుసారుడు 16 రాజ్యాలను జయించినట్లు తారానాథుడు పేర్కొన్నాడు. ఇవి అన్నీ ఉత్తర భారతంలోనివే అయి వుండవు. ఇంతేకాక గ్రీకులు అతన్ని "అమిత్రఘాతకుడు" (శత్రువులను సంహారించే వాడు) అని కీర్తించటంచేత అతను గొప్ప సేనానీ, వీరుడూ, అని ఋజువవుతున్నది. ఏమైనప్పటికీ దక్షిణభారతంలో బిందు సారునికి బలమైన ప్రతిఘటన ఉండినట్లే తోస్తుంది. బహుశా, ఆకారణంచేతనే కళింగదేశంలో ఏవిధమైన మార్పులేక పోయింది. హాతిగుంఫలోని ఖారవేలుని శిలాశాసనాన్నిబట్టి ఆలోచిస్తే బిందుసారుని కాలంనుంచీ తమిళరాజ్యాలు ఒక సమాఖ్యగా ఏర్పడి ఉన్నట్లు తెలుస్తుంది. ఈతమిళరాజ్య సమాఖ్య మౌర్యులను ఎదిరించి ఉండవచ్చును. పర్యవసానంగా

చెప్పవలసిన దేమంటే అశోక శాసనాలు లభించినస్థలాలనుంచి గుత్తివరకూ, దాదాపు మదరాసువరకూకూడా మౌర్య సామ్రాజ్యం వ్యాపించి ఉంటుంది. మౌర్యులు పొదిలి కొండల వరకూ కూడా ఆక్రమించు కొన్నారేమో! అది నిశ్చయంగా చెప్పలేము.

అశోకుని సామ్రాజ్యం క్షీణించిన తర్వాత దక్కనుపై భాగంలో ఆంధ్రజాతి వారైన శాతవాహనులు బలవంతు లయినారు. శాతవాహనులను గూర్చి మనం తెలిసికొనటానికి ముఖ్యాధారాలైన పురాణాలూ, శాసనాలూ పరిశీలిస్తే ఆంధ్రులతో ఈరాజులకు దగ్గతి సంబంధం ఉన్నట్లు స్పష్టపడు తుంది. శాతవాహనులు అని శాసనాలలో పేర్కొనబడిన రాజులు ఆంధ్రులని పురాణాలు చెప్పుతున్నాయి. శాతవాహన పదం ఆవంశానికి పూర్వుడైన ఒకరాజుపేరు. ఆంధ్రులు అనేది జాతిపేరు అని ఊహించవచ్చును. శాతవాహన వంశంలో మొట్టమొదటిరాజు ఆంధ్రజాతీయుడని పురాణాలుపేర్కొనటం దీనికి నిదర్శనం.

ప్రప్రథమంగా ఆంధ్రులను గురించి చెప్పిన ఐతరేయ బ్రాహ్మణం వారు దస్యులని చెప్పుతున్నది. దీనిలోనే వీరు విశ్వామిత్ర సంతతి వారనికూడా వివరణం వున్నది. గౌతమీ పుత్రశాతకర్ణి మొదలయిన శాతవాహన రాజుల పేర్లను పరిశీలిస్తే ఆరాజులు తమ పేరునకు ముందు తల్లి పేరుకూడా ఉంచుకునే వాడుక, తెలుస్తున్నది. ఈఅలవాటుబట్టి చూడగా ఆర్యులకూ ద్రావిడాంధ్రులకూ వివాహ బాంధవ్యాలు వుండేవని తోస్తుంది.

మొదట శాతవాహనరాజ్యం దక్కనులోని ఈశాన్య భాగాన మహారాష్ట్రమునకూ పరిసర ప్రాంతమునకుపరిమితమై ఉండేదని జ్ఞాపకం పెట్టుకోవాలి. ప్రాచీన శాతవాహనుల శాసనాలన్నీ ఈనాటి నాసిక్‌లోనూ పూనా జిల్లాలోని నానఘాట్‌లోనూ కనిపించాయి. హైందవ కావ్యాలుగానీ, పురాణాలుగానీ, టాలెమీ భూగోళశాస్త్రంగానీ శాతవాహనులరాజధాని "ప్రతిష్ఠానపుర" మనే చెప్తున్నాయి. దీనినే ఈనాడు "పైఠాన్" అంటున్నాము. కృష్ణానదిపైవఱకూ తూర్పువైపున ఈనాటి ఆంధ్రదేశంలో శాతవాహనుల అధికారం ఆపిమ్మటనే ఏర్పడ్డది. ఇది బహుశః ప్లినీ కాలంనాడు జరిగి వుండవచ్చును. అతను ఆంధ్రరాజ్యం దక్కనులో తూర్పువైపున వున్నదని నిర్దేశించాడు.

మత్స్యపురాణములో వర్ణితమైన శాతవాహనవంశంలో కొంతమంది చక్రవర్తులపేర్లు చరిత్రలోని పేర్లకు సరిపోక గజిబిజి పడవలసి వచ్చినప్పటికీ, మొత్తంమీద ముప్ఫైమంది రాజులు 460 సంవత్సరాలపాటు రాజ్యం చేశారన్నమాటను నమ్మవలసే వస్తున్నది. ఈవంశానికి మూలపురుషుడైన శ్రీముఖుడు క్రీ.పూ. 230 సంవత్సరాలనాటివాడు. ఇతనుసంగవంశపు ప్రభువును తుదముట్టించి, కణ్వవంశపు రాజును సమూలధ్వంసం చేసినట్లు కనిపిస్తున్నది. అతని తరువాత వారు మహారాష్ట్రాన్ని మాళవాన్నికూడ జయించారు. ఈవంశములో మూడవవాడైన ఒకటవ శాతకర్ణి కాలంలో శాతవాహన ప్రభుత్వం ఉత్తరదక్కనులో చాలవఱకూ విస్తరించి మధ్యభారతంలోనూ పశ్చిమ భారతంలోనూకూడా వ్యాపించింది. అతను ఒకరాజసూయయాగమూ, రెండు అశ్వమేధయాగాలూ

చేసినట్లు మత్స్యపురాణం చెప్పుతున్నది. క్రీ. పూ. 172-116 సంవత్సరాలనడుమ రాజ్యంచేసిన ఈవంశపుఏడవరాజైన రెండవ శాతకర్ణి మాళవదేశాన్ని జయించి మధ్య ప్రదేశాన్నికూడా తన బావుటా క్రిందకు తెచ్చాడు. అయితే యితని కాలంలోనే సుప్రసిద్ధ కళింగరాజైన ఖారవేలుడు పరాక్రమించి శాతవాహనులకు సామంతులైన మహారాష్ట్రింలోని రాధికులనూ, బీరారులోని భోజులనూ ఓడించి చాలామందిని చెఱపట్టినట్లు ఊహించవలసి వస్తున్నది. కాని ఖారవేలుడు ఈరెండువైపులా ఈరెండు దేశాలనూ దాటి మాత్రం పైకి వెళ్ళలేదు. ఆరెండు దేశాలే అతని రాజధానికి చాలాదూరాన వున్నాయి. ఇంకా దూరానికి దండెత్తి పోవటానికి అతను సాహసించలేదు.

ఈసమయంలో పల్లవశాఖకు చెందిన శకులతోనూ పశ్చిమ క్షాత్రపులతోనూ శాతవాహనులు యుద్ధాలు చెయ్యవలసి వచ్చింది. పశ్చిమ క్షాత్రపులలో మహాపరాక్రమవంతుడు, గొప్పవిజేతా అయిన నాహపాణుడు గుజరాతు కథియవార్లను పాలిస్తూ, కొంకణమహారాష్ట్ర దేశాలను తనకు సామంత రాజ్యాలుగా చేసికొన్నాడు. ఇందువలన శాతవాహనుల అధికారం కొంతదెబ్బతిన్నది. గౌతమీపుత్ర శాతకర్ణి(క్రీ.పూ. 106-30 సం॥) అనేక శత్రు దండయాత్రలను ఎదుర్కొనినిలిచిన మహావీరుడు. "ఇండోస్కిథియన్లనూ. ఇండోగ్రీకులనూ పార్థియనులనూ నిర్మూలించిన వాఁడు" అని ప్రసిద్ధి పొందాడు. ఇతని సామ్రాజ్యం ఉత్తరాన కథియవార్‌నుంచి దక్షిణాన కృష్ణానది వఱకూ పశ్చిమాన కొంకణంనుంచి తూర్పున బీరారు వఱకూ విస్తృతమైనది. కాని యింత బలవంతుడైన చక్రవర్తి కాలంలోకూడా శాతవాహన ప్రభుత్వం ఈనాటి

సరిహద్దులలోని ఆంధ్రదేశాన్నంతటినీ శాసించలేదనే విషయం గమనార్హం. ఇతని కుమారుడు రెండవ పులుమావి (క్రీ.శ. 130–159 సం॥) కాలంలోనే ఆలోటు తీఱింది. ఈపులుమావి దక్షిణాన కడలూరువరకూకూడా తనసామ్రాజ్యాన్ని వ్యాపింప జేశాడు. ఇంతలో శాతవాహనులకు ప్రక్కలో బల్లెములుగా ఉండిన శకులు పశ్చిమ రాజపుత్ర స్థానంలోనూ, మాళవం లోనూ కొన్ని ప్రాంతాలను తిరిగి తమ స్వాధీనంలోనికి తెచ్చు కొన్నారు. అక్కడి నుంచి ఈరెండు ప్రభుత్వాలకూ ఆ దేశాలు ముఖ్య యుద్ధరంగాలుగా మాఱిపోయాయి.

శాతవాహన రాజులలో చివఱి గొప్ప చక్రవర్తి శ్రీ యజ్ఞశాతకర్ణి (క్రీ.శ. 174 203 సం॥) ఇతనుపశ్చిమభారతంలో శకులను నిశ్శేషంగా ఓడించాడు. శ్రీయజ్ఞ శాతకర్ణి గతించిన తరువాత రాజకుటుంబంలో కలిగిన చీలికలవల్ల సామ్రాజ్యం చిన్నచిన్న రాజ్యాలుగా విచ్ఛిన్నమై పోయింది. మూడవ శతాబ్ది సగం గడచే సరికి అనేక రాజ వంశాలు తలయెత్తి శాతవాహన సామ్రాజ్యంలోని భిన్నభిన్న ప్రాంతాలను స్వతంత్రంగా పాలించుకొనటం ప్రారంభమైంది. అక్కడనుంచి నాలుగువందల సంవత్సరాలపాటు దక్కనులో ఆంధ్రశాతవాహ నులే ప్రాబల్యం వహించారు. దక్షిణ దేశంలో అతి ప్రాచీనమైన సామ్రాజ్యం నిర్మించి, విజయవంతంగా పాలించిన ఘనత వీరికి దక్కింది. వీరు ఉచ్ఛదశలో ఉన్నప్పుడు సామ్రాజ్యం తూర్పు సముద్రంనుంచి పశ్చిమసముద్రం వఱకూ విస్తరించింది.

**ప్రభుత్వము:-** శాతవాహనుల ప్రభుత్వ విధానం మౌర్య పరిపాలనా విధానాన్నే అనుసరించినట్లుకనబడుతున్నది

ఉభయుల కాలంలోనూ చక్రవర్తికీ మంత్రులకు కల పదవీ గౌరవాలు యథాతథంగా ఉండటం మాత్రమేకాక రాజోద్యోగుల హోదాలుకూడా రెంటిలోనూ ఒకేవిధంగా పేర్కొనటం జరిగింది. వైదేశిక దండయాత్రలనుంచి దేశాన్ని రక్షించ వలసిన వారు మహా సేనాపతులు. వీరిక్రింది అధికారులకు సేనాపతులు అనిపేరు. దేశంలో శాంతి భద్రతలను కాపాడ వలసిన ముఖ్యోద్యోగులు మహా తలవరులు వీరి క్రింది ఉద్యోగులను తలవరులు అనేవారు. పరి పాలన మహామాత్రులది. రాజ ప్రతినిధులు, న్యాయాధికారులు. మహామాత్రులే. వీరే రాయబారులుగాను కోశాధికారులుగానూ, మహాసాధ్యక్షులుగానూ ప్రభుత్వ కార్యాలయ నిర్వాహకులుగానూ, ముద్రాస్రష్టలు గానూ అనేక బాధ్యతాయుత పదవులు నిర్వహించే వారు. సామ్రాజ్యం అనేక మండలాలు (అహారాలు) లేక రాష్ట్రాలుగా విభక్తమై ఉండేది. ప్రతి రాష్ట్రానికీ ఒక్కొక్క అమాత్యు డుండేవాడు. మహా సేనాపతులు, రాజధానికి దూరాన ఉన్న రాష్ట్రాలలో నివసిస్తూ ఉండేవారు. వీరు కూడా అమాత్య పదవులు నిర్వ హించేవారు అయితే మహా సేనాపతులు రాష్ట్ర పాలకులుగా ఉండటం శాత వాహన చరిత్ర ఉత్తర ఖండం లోనే వీరు కేంద్రంలో కూడా పరిపాలనా శాఖలో కొన్ని కొన్ని పదవులు నిర్వహిస్తూ ఉండేవారు. కేంద్ర ప్రభుత్వం గ్రామ పరిపాలన విషయంలో ఎక్కువ జోక్యం కలిగించు కొనేది కాదు. సైనికోద్యోగులే రాజోద్యోగుల పర్యవేక్షణలో స్థానిక పరిపాలన జరుపు కొనేవారు. ఈ గ్రామ పరిపాలకులతో

కొన్ని అంతస్తు లుండేవి. వీరిలో అత్యున్నత పదవిలో ఉండేవారిని రాజా లనేవారు. వీరికి రాజగౌరవం ఉండేది. కొంతమంది తమ పేర నాణెములు కూడా ముద్రించారు. వీరి క్రింది ఉద్యోగులను మహా భోజులు, మహారథులూ అనేవారు. ఈ మహాభోజులూ, మహారధులూ వీరవంశ సంజాతులై ఉండేవారు: వీరిలో చాలామంది పడమటి దక్కను వారు. మహా సేనాపతులు వీరి తర్వాత పేర్కొన దగినవారు. ఈమహా సేనాపతులు అనేక బాధ్యతలు నిర్వ హిస్తూ ఉండేవారు. కొందఱు కొన్ని కొన్ని మండ లాలకు ప్రధానాధి కారులుగానూ, మఱి కొందఱు కేంద్రంలో ఉన్న తోద్యోగులు గానూ ఉండేవారు. ఈ రకరకాల ఉద్యోగులు తమ తమ విధులను నిర్వహిస్తూ ఉంటే ప్రభుత్వానికి దేశంలో శాంతి భద్రతలకు భంగం వాటిల్ల కుండా చూడటం తప్ప వేరే పని ఉండేది కాదు దానికి కారణం ఏమంటే ఈనాడు ప్రభుత్వం అమలు జరిపే దేశోద్ధరణ కార్య కలాపాలను ఆకాలంలో స్థానిక ప్రజలే నిర్వహించే వారు.

సంఘం:- నాటి సంఘ వ్యవస్థను గుఱించి ఆలోచించే ముందు వైదేశికులు అనేకులు మన దేశాచారాలను అవలం బించి ఇక్కడి సంఘంలో విలీనులైనారని జ్ఞాపకం పెట్టు కోవాలి. శకులు, గ్రీకులు మొదలయినవారు వ్యాపారం కోసం ఇక్కడ స్థిర నివాసం ఏర్పఱుచు కొన్నారు. కాలక్రమాన వీరు భారతీయ సంప్రదాయాల్ని అలవఱ్చు కొన్నారు. ధేనుకోటలో నివసించిన కొందరు గ్రీకులు భారతీయ పేర్లే పెట్టు కొన్నారు. వీరు కార్లీ గుహా నిర్మాణానికి చాలా సాయం చేశారు.

కొందఱు భారతీయ వనితలను పెండ్లాడి కేవలం హిందూ మతస్థులే అయినారు. రాజకీయంగా ప్రాబల్యంకల శకులు క్షత్రియజాతి వారుగా పరిగణన లోనికి వచ్చారు.

బౌద్ధులూ, జైనులూ, బ్రాహ్మణులూ కూడా ఉత్తర భారతం నుంచి దక్షిణానికి వచ్చి శాతవాహన సామ్రాజ్యంలో ఎవరి మతం వారు ప్రచారం చేసి కొంటూ ఉండేవారు. అయితే ఈ మూడుమతాలవారూ కూడా చక్రవర్తుల ప్రాపకం సంపాదించు కొనటానికి తమలో తాము పోటీలు పడుతూ ఉండేవారు. బౌద్ధులకు కొంత వఱకు ప్రభుత్వపు ప్రాపకం కలిగింది కానీ, అంతకంటె బ్రాహ్మణులే ఎక్కువ పలుకుబడి సంపాదించారు. నూతనంగా హిందూమతం అవలం బించిన శకులు మొదలయిన వారు బ్రాహ్మణులనూ వారి సంస్థలనూ విశేషంగా ఆదరించే వారు. శక ఉషవదత్తుడు ఒక చోట బ్రాహ్మణులకు ఎంతో ధనమూ, 16 గ్రామాలూ, 300000 గోవులూ బహూకరించాడు. మఱొక చోట బ్రాహ్మణులకు ఎనిమిది కన్యాదానాలు చేసి సంవత్సరం పొడు గునా సంతర్పణలు చేశాడు. శాతవాహన చక్రవర్తులు అనేకులు బ్రాహ్మణులనూ, బ్రాహ్మణమతాన్నీ అభిమా నించారు. శాతవాహనులలో మూడవ చక్రవర్తి వేదోక్తా లైన అనేక యజ్ఞాలు చేశాడు. బ్రాహ్మణ భక్తుడుగా సుప్రసిద్ధుడైన గౌతమీపుత్ర శాతకర్ణి ఆర్యమత సంప్ర దాయాలను పోషించాడు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, అనే నాలుగు కులాలనూ వాటివాటి ధర్మాలనుంచి చ్యుతి పొందకుండా రక్షించాడు. ఇందువల్ల

ఇతని కాలంనాటికి బ్రాహ్మణుల పలుకబడిచాలాఉచ్ఛస్థాయిలో ఉండేదనీ, ఆర్యమతంలో వర్ణభేద సిద్ధాంతం తలయెత్తి బల పడుతూ వచ్చిందనీ ఊహించవచ్చును. పదిహేడవశాతవాహన చక్రవర్తి అయిన హాలుడు పరమ శివభక్తుడు. ఆకాలంనాటి శిలాశాసనాలవల్లనూ, శిల్పాలవల్లనూ, ముఖ్యంగా ఇంద్రుడు, విష్ణువు, శివుడు, స్కందుడు (కుమారస్వామి) అనే దేవతలను ప్రజలు ఆరాధించేవారని తెలుస్తున్నది. హాలుని "సప్తశతి"లో శివుడు స్కందుడు గణేశుడు (గణాధిపతి) కృష్ణుడు అనే దేవత లను గూర్చిన ప్రశంస కనిపిస్తుంది.

వైదేశికులు హిందూమతంలో చేరుతూ ఉండటంవల్ల, వృత్తిభేదాలనుబట్టి కులాలలో వేర్వేరుశాఖలు ఏర్పడుతూ వచ్చాయి. గొల్లలు(గోలికులు) కాపులు (హాలికులు) మూర్ధకులు (క్షత్రియులలోఒకశాఖ)అనేకులాలు ఈకాలంలోనేఏర్పడ్డాయి. అయితే వర్ణభేదం తీవ్రంగా పాటించటం మాత్రం ఉండేదికాదు. అప్పుడప్పుడు వర్ణాంతర వివాహాలు జరిగేవి. ఒక్కొక్క సమయంలో క్షత్రియులు వైశ్యకుల వృత్తిఅయిన వాణిజ్యాన్ని అవలంబిస్తూ వచ్చారు.

సంఘంలో స్త్రీలకు విశేష గౌరవం ఉండేది. దేవాల యాలకూ, గుహాలకూ, అనేకమైన మతసంస్థలకూ స్త్రీలు విరివిగా దానధర్మాలుచేస్తూఉండేవారు. అమరావతీశాసనాలు చూస్తే ఈవిషయం మరింత స్పష్టపడుతుంది. ఎందరో స్త్రీలు ఎన్నో విరాళాలు ఇచ్చినట్లూ, ఎన్నో దేవమందిరాలు సత్రాలు కట్టించినట్లు వాటిలో కనబడుతున్నది. ఆకాలంలో స్త్రీలను భర్త బిరుదుతోనే వ్యవహరించటం ఒకవిశేషం. మహా

భోజిమహారథిని అనేవి ఇటువంటి పేర్లే. పురుషులతోబాటు స్త్రీలుకూడా మతసంబంధమైనఉత్సవాలలోగానంచేస్తూనృత్యం చేస్తూ దేవతారాధన చేస్తున్నట్లూ, పరిషత్తులలో పాల్గొంటు ఉన్నట్లూ కొన్ని అమరావతీశిల్పాలలో కనబడుతున్నది. ఇక్కడి స్తంభాలమీద కొన్నిచోట్ల మతప్రధానాలైన వేడుకలు పురాణశ్రవణాలు జరిగే విధానాలు చిత్రించబడ్డాయి. వీటిలో కనబడే శ్రోతృబృందంలో స్త్రీలే ఎక్కువమంది కన బడుతున్నారు.

శాతవాహనకాలంనాటి దుస్తులూ అలంకరణ ఎలా ఉండేవో ఈ శిల్పాలనుబట్టే గ్రహించవచ్చును. కేశాలంకరణలో స్త్రీలూ, పురుషులుకూడా విశేషశ్రద్ధ వహించేవారు. స్త్రీలు సాధారణంగా ముఖం పైభాగాన జుట్టు రెండుపాయలుగా పాపిడితీసి, వెనుకభాగాన కొప్పుగా అమర్చుకొనేవారు. కొందరు జుట్టుఅంతా తలకు ఒకప్రక్కగాగానీ, ముఖానికి పైభాగంలోగానీ చేర్చి మొగ్గఆకారంలో ముడుచుకొనేవారు. తలచుట్టూకానీ, ముడిచుట్టూకానీ పూసలదండలు అలంకరించుకొనేవారు. పురుషులు తల ముందుభాగంలోనే జుట్టు ముడివేసికొనేవారు. ముడికివెనుక తలపాగ ధరించేవారు. కన్హేరీగుహలో చిత్రించబడ్డ ఒక పురుషమూర్తికి తలకు ముందుభాగం కొంచెంవదలి తలపాగా ధరించినట్లే చిత్రించబడ్డది.

నాటి స్త్రీలూ పురుషులూ కూడా అలంకారాల విషయంలో అతిశ్రద్ధ తీసికొనేవారు. కర్ణాభరణాలూ, కంకణాలూ, ముఖగులూ, హారాలూ, పూసలదండలూ, స్త్రీ పురుషులకు సమానమైన అలంకారాలు. అయితే స్త్రీలు పురుషులకంటె

ఎక్కువ మురుగులను లేక గాజులను ధరించేవారు. అందెలు స్త్రీలకు విశిష్టభూషణాలుగా ఉండేవి. సాధారణంగా అన్ని అలంకారాలూ పూసలతో, ముత్యాలతో, బంగారంతో పొదుగబడిఉండేవని భట్టిప్రోలువద్ద బయటపడ్డ పురాతన శిథిల సామగ్రివల్ల బోధపడుచున్నవి.

ఆనాటి జనుల వేషధారణ ఎటువంటిదో శిల్పాలవల్ల కూడా తెలిసికోవలసి వున్నది. అమరావతీ నాగార్జునకొండ శిల్పాలలోని పురుషమూర్తులకు ధోవతులూ ఉత్తరీయాలూ ముఖ్యాలైన దుస్తులుగా చిత్రించబడ్డాయి. ఈపురుషమూర్తులు శకుల వేషాలనుబట్టి చిత్రించినవి అయి ఉంటాయి. హిందూ మతం స్వీకరించిన వైదేశికుల వేషధారణ విచిత్రమైనది. ఒక ధోవతి కట్టుకోవటం, బుజాలమీదుగా ఉత్తరీయపు అంచులు జాఱవిడవటం పురుషవేష చిహ్నంగా వుండేవి. కొన్నికొన్ని చోట్ల మాత్రం ఉత్తరీయంతో వక్షస్థలం ఆచ్ఛాదించటం ఉత్తరీయపు అడుగుఅంచులు మోకాళ్ళవఱకూ వ్యాపించి ఉండటం కనబడుతున్నది. ధోవతికిలోపల ఉపవస్త్రం కట్టుకొనటం సర్వసాధారణం. స్త్రీలు రెండుమూడు మడతలుగా ఉన్న పొడుగైన వస్త్రం వేసిశరీరోపరిభాగాన చుట్టుకొనేవారు. సాధారణంగా స్త్రీలు వక్షస్థలం ఆచ్ఛాదించుకొనటం ఎరుగరు అమరావతీ శిల్పాలలోని ఒక్క స్త్రీమూర్తికి మాత్రమేరొమ్ము కప్పివేసే పైటవున్నది.

వృత్తులనుబట్టి ఏర్పడుతూవచ్చిన కులాలవల్లనే సంఘ మర్యాదలు ఏర్పడుతూవచ్చాయి. రాష్ట్రపాలకులుగా ఉన్న రాజవంశజులకు ఎక్కువ గౌరవం ఉండేది. వర్తకులూ, నౌకా

వ్యాపారం చేసేవారూ పరిత్ర్యాత గౌరవించదగినవారు. వర్తకసంఘాలు ఉచ్ఛస్థాయిలో ఉండేవి. నగరాలలోని పుర పాలకసంఘాలలో ఈ వర్తకసంఘానికి చాలా పెద్ద పెద్ద అధి కారాలు ఉండేవి. రైతులు, వైద్యులు, కమసాలులు, వడ్రం గులు, ఇతరమైన చేతిపనులవారూ ఈ వర్తకులకన్న తక్కువ స్థాయిలో ఉండేవారు. సాలెవారూ, కర్షకులూ, తెలికలూ, కుమ్మరులూ మొదలయినవారు శ్రేణులనే పేర కార్మికసంఘాలు ఏర్పఱుచుకొనేవారు. ప్రతిసంఘానికి సేఠీ అనే అధ్యక్షుడు ఉండేవాడు. ఒకొక్కసంఘానికి ఒకొక్క కార్యాలయమూ, సమావేశమందిరమూ (నిగమసభ) ఉండేవి.

వాణిజ్యము:-వర్తకసంఘాలు, చేతిపనివారి సంఘాలూ ఉండటంవల్ల వ్యాపారమూ, పరిశ్రమలూ క్రమక్రమంగా అభి వృద్ధి అవుతూఉండినట్లు విస్పష్టంగా బోధపడగలదు. వాస్త వానికి అతిప్రాచీనకాలంనుంచీ ఆంధ్రులు స్వదేశంలోనూ, సముద్రందాటి వెళ్ళవలసిన ఇతరదేశాలలోనూ వాణిజ్యం చాలా చాకచక్యంతో చేస్తూఉండేవారు. పెరిప్లస్ గ్రంథ కారుడు ఆంధ్రుల వాణిజ్యకౌశలాన్ని చాలా ప్రశంసించాడు. పైఠాన్, టగారా, జున్నర్, కర్హాటకం, నాసిక్, వైజయంతీ నగరాలు నౌకావ్యాపారానికి ప్రసిద్ధకేంద్రస్థలాలు. బ్రోచి, సోపారా, కల్యాణ నగరాలు నౌకావాణిజ్యంలో ముఖ్యపాత్ర వహించిన రేవుపట్టణాలు. కృష్ణా గోదావరుల జిల్లాలలోని మసేలియా ప్రాంతంలో ఎన్నో రేవుపట్టణాలను టాలెమీ పేర్కొన్నాడు. ఈ రేవుపట్టణాలనుంచి మలయా, తూర్పు

ఇండియా దీవులతో నౌకావాణిజ్యం చాలా ముఖ్యంగా సాగేది. బహుశః తూర్పుదక్కనులో నౌకావాణిజ్యం క్రీ. శ. రెండవశతాబ్దానికి అత్యున్నతదశకు వచ్చిఉంటుంది. యజ్ఞశ్రీ శాతకర్ణి నాణెములకు ఒకవైపు నౌకాముద్రకూడా ఉండటం గమనార్హం. అతనికి వ్యాపారనౌకల నిరంతరప్రయాణాలకు రక్షకంగా ఒక పెద్ద నౌకాదళమున్నూ ఉండేదనటం నిస్సందేహం. పైనచెప్పిన ఈ సంఘాలు ప్రజల ఆర్థిక సాంఘిక పరిస్థితులను చక్కదిద్ది, ఉచ్చదశకు తీసికొనివచ్చాయి. నాసిక్‌లోని ఒక శిలాశాసనం ఒక వదాన్యుడు రెండు సాలెసంఘాల పక్షాన 3,000 కార్షాపణాలతో ఒక నిధిని స్థాపించి దానిమీద వచ్చే వడ్డీని బౌద్ధసన్యాసులకు దానంచెయ్యటానికి ఏర్పాటు చేసినట్లు చాటుతున్నది. ఇటువంటి మఱికొన్ని శాసనాలలో ఇంకా వేర్వేఱు సంఘాలు బౌద్ధసన్న్యాసులకు వైద్య సాహాయ్యంకోసం నిధులు ఏర్పఱచినట్లు కనబడుతున్నది. ఈవిధంగా ఆ కాలంనాటి సంఘాలు సంఘక్షేమానికి అనేక విధాల ధనసాహాయ్యంచేసి కృషిచెయ్యటమేకాకుండా ప్రజల నుండి ధనం వసూలుచేసి సత్కార్యాలకోసం నిధులు ఏర్పఱచి అచంచలంగా ఆ సదాశయాలు నెఱవేఱటానికి కృషి చేసేవి.

ఈకాలంలో ఐశ్వర్యసముపార్జనం బాగా జరుగుతూ వచ్చినప్పటికీ ప్రజలు మత ధర్మాలను ఎంతమాత్రంచిన్నచూపు చూడలేదు. దక్కను బౌద్ధమతచరిత్రలో క్రీస్తుశకం తొలి రెండుశతాబ్దాలు అత్యుజ్జ్వల కాలంగా ప్రసిద్ధికెక్కిందికూడాను.

శాతవాహనరాజులు పరమత సహనం కలవారు. వారి సామ్రాజ్యంలో హిందువులు, జైనులు, బౌద్ధులు సంపూర్ణ స్వేచ్ఛ అనుభవించారు. ఈరాజులలో కొందఱు బౌద్ధమతాన్ని అవలంబించారు. మఱికొందఱు హిందూమతాన్ని అవలంబించారు. అయినప్పటికీ వీరు ఇతరమతాలనుగౌరవిస్తూనే ఉండేవారు. ఒక్కరుకూడా పరమతపీడా కళంకితులు కాలేదు. బ్రాహ్మణ రక్షకుడని చాటుకొన్న గౌతమీపుత్రి శాతకర్ణి కూడా బౌద్ధులకు విశేష సత్కారాలు చేసినట్లు కనబడుతున్నది. ఆరాజులు బౌద్ధవిహారాలు స్తూపాలు, చైత్యాలు హిందూదేవాలయాలతో బాటే కట్టించారు. అయితే హిందూదేవాలయాలన్నీ కాలపురుషునిపదఘట్టనలకుశిధిలితాలూకాగా అదృష్టవశాత్తు బౌద్ధగుహాలూ స్తూపాలు, నేటికీ నిలిచేవున్నవి. అనేక గుహాలు చైత్యాలు (పూజామందిరాలు) గానూ, బౌద్ధభిక్షువులకు (లాయనాలు) వసతిగృహాలుగానూకూడా ఉపయోగపడటానికి వీలుగా తొలిచారు. కార్లీ, కన్హేరి, నాసిక్ లలోని బౌద్ధగుహాలకు చాలామంది విరాళాలిచ్చారు. అమరావతిలో ప్రతిష్ఠితమైన స్తూపాన్ని పెంచి సుందరశిల్పాలతో మనోజ్ఞంగా నిర్మించటంద్వారా దక్కను శిల్పాలలో బౌద్ధశిల్పరచనకు విశేషప్రాముఖ్యం లభిస్తూ వచ్చింది. ద్రావిడాంధ్రుల సంస్కృతి వర్ధిల్లటానికి అమరావతీ శిల్పకళ ఎంతో దోహదం చేసిందని ఇటీవలి గ్రంధకర్త ఒకరు వ్రాశారు. శాతవాహన సామ్రాజ్యంలో ఒక్కఅమరావతి యందే కాకుండా గుడివాడ, ఘంటసాల, గుమ్మదిదుర్రు అల్లూరు మొదలైన

చోట్లకూడా ఎన్నో నూతన స్తూపాలు నిర్మించటంకానీ పురాతనపువాటిని పునర్నిర్మించటంకానీజరుగుతూవచ్చింది. వీటిలో ఒక్కబుద్ధవిగ్రహాలేకాకుండ ఎందఱోప్రసిద్ధులైనబౌద్ధాచార్యుల విగ్రహాలుకూడా ప్రతిష్ఠించారు. బుద్ధదేవునికి సాష్టాంగనమస్కారాలు చేస్తున్నట్లుకాక, కానుక లర్పించటానికి వస్తున్నట్లుగా కొందరు భక్తుల రూపాలుకూడా చిత్రించారు. అతి సహజంగానూ, వాస్తవికంగానూ చిత్రించబడ్డ ఈశిల్పాలు సాంచీలోని పురాతన శిల్పాలకంటె ఎంతో ఉత్తమంగా ఉన్నాయి. బుద్ధ జన్మఘట్టం ప్రదర్శించే శిల్పం బర్హూత్ గాంధారాలలో ఈ సందర్భమే వివరించేశిల్పాలకంటే కళాదృష్ట్యా ఉన్నతస్థాయిలో ఉన్నాయి. బుద్ధజీవితంలోని ప్రధాన సంఘటనలు అనగా ఏనుగును వశపఱచుకోవటం, నందునితో సంభాషణ మొదలయినవి ఎన్నో ప్రదర్శించేశిల్పాలు ఉత్తమ కళాఖండాలు. శాతవాహనకాలంలో ఆంధ్రదేశంలో శిల్పకళకు ప్రసిద్ధికెక్కిన మఱొకప్రదేశం నాగార్జునకొండ. అమరావతీ శిల్పకళ తదనంతరాభివృద్ధి ఇక్కడ కనబడుతున్నది. బుద్ధదేవుని చరిత్రనూఅనేక జాతకకథలనూ వివరించేశిల్పాలు నాగార్జునకొండలో సృష్టించారు. ఇవి అమరావతీశిల్పాలంత మెఱుగైనవి కాకపోయినా, స్ఫుటంగానూ, ఆకర్షణీయంగానూ కనిపిస్తాయి. ఈశిల్పాలన్నిటిలోనూ నాగరాజుల్ని చిత్రించటం ఒకవిశేషంగా కనిపిస్తుంది. బుద్ధుడు నాగములమీదకూర్చుండగా అవిఆయనశిరస్సుకుపైన పడగలు విప్పినట్లుగా కొన్ని శిల్పాలున్నాయి. కొన్నిస్తూపాలు

సగ్ప్రాకారంలోఉన్నాయి. ఇక్కడి ప్రాచీనజాతులవారి సహవాసంచేత బౌద్ధులు ఈనాగశిల్పాలను నిర్మించి ఉండవచ్చును.

సారస్వతరంగంలోకూడా శాతవాహనుల సాహిత్యప్రియత్వమూ, విశాలదృష్టీ సర్వమతసామరస్యమూ ప్రతిఫలిస్తున్నాయి. దేశభాషలస్థానంలో సంస్కృతాన్ని ప్రవేశపెట్టటానికివారు ఎంతమాత్రమూ ప్రయత్నించలేదు. హాలచక్రవర్తి ప్రాచీన మహారాష్ట్రిభాషలో ఒకపద్యకావ్యం రచించారు. దానిలో 700 పద్యాలున్నాయి. అవి ప్రేమగీతాలు. ఆయన మంత్రిశర్వవర్మ సంస్కృత ప్రాకృతభాషల సంబంధం తెలపటానికి ఒకవ్యాకరణం వ్రాశాడు. మరియొక శాతవాహన చక్రవర్తి కొలువులోని గుణాఢ్యుడనే మంత్రి పైశాచిక ప్రాకృతంలో "బృహత్కథ" అనే పేరప్రసిద్ధకథలు అనేకం రచించినట్లు ప్రసిద్ధి. అయితే ఆయుగంమొత్తంమీాద సంస్కృతభాషకే ఎక్కువ గౌరవంఉన్నట్లు తోస్తుంది. ప్రాకృతభాషకు బదులుగా కావ్యరచనకు సంస్కృతాన్నే ఉపయోగించటం ప్రారంభమైంది. శాసనాలలోని ప్రాకృతభాషలో సంస్కృత శబ్దాల్ని యథేచ్ఛగా ఉపయోగించటం సాగింది.

**కళింగపతి ఖారవేలుడు:-** శాతవాహనుల తరువాత సామ్రాజ్యం నిర్మించుకొన్న వారిని గురించి తెలుసుకోటానికి ముందు శాతవాహనుల కాలంనాడే బలవంతులుగాఉన్నకళింగ రాజులయిన చేదివంశీయులను గురించి తెలుసుకోవాలి. క్రీస్తు పూర్వం ఒకటవ శతాబ్దంనుంచీ మహామేఘవాహన వంశంలోని చేదికుటుంబపు రాజులపరిపాలనలో కళింగంబలపడుతూవచ్చింది.

ఈచేదిరాజులు మగధరాజకుటుంబంలోనివారు. వీరు మగధ నుంచి నూతనంగా రాజ్యం సంపాదించాలనే తలంపుతో దక్షిణానికివచ్చి కళింగ దేశం ఆక్రమించుకొని ఉంటారు.

కళింగరాజులలో ఖారవేలుడు గొప్పవాడు. ఇతను క్రీ. పూ. 1వ శతాబ్దంలోనివాడై ఉంటాడు. ఈతని గురించి తెలుసుకోవటానికి హాతిగుంఫశాసనం ఎంతో ఉపకరిస్తున్నది. అయితే యితను రాజ్యానికివచ్చిన 13 సంవత్సరాల వఱకూ కలిగిన సంఘటనలు మాత్రమే దానిలో కనబడుతాయి. శాతవాహన సామంతులైన రాష్ట్రికులనూ, మహాభోజులనూ ఇతడు జయించినట్లు వెనుకనే తెలుసుకొన్నాము. అతను మగధ, అంగరాజులనూ, దక్షిణపుకొసలో పాండ్యులనుకూడా ఓడించాడు. ప్రజల బాగుకోసం వ్యవసాయానికి కాలువలు త్రవ్వించాడు. అనేక భవనాలు కట్టించాడు. ఇంకా ఎన్నో సౌకర్యాలుకూడా చేశాడు. లలితకళలంటే ఎక్కువ అభిమానం కలవాడూ, ప్రత్యేకించి గాయకుడూ కావటంవల్ల ప్రజలలో కళాభిరుచీ, తద్ద్వారా మనోవికాసమూ కలగటానికీ తఱచూ నృత్యప్రదర్శనాలూ, సంగీతపరిషత్తులూ మొదలయిన వేడుకలెన్నో జరిపించేవాడు. తాను జైనుడుకావటంవల్ల జైన భక్తులకోసం ఎన్నో గుహాలు తొలిపించాడు. పూజామందిరాలు కట్టించాడు. చేదిరాజ్య పతనం ఎలాజరిగిందో స్పష్టంగా తెలియదు. రాజుల బలహీనత కారణం కావచ్చును. ఖారవేలుని అనంతరం కొంతకాలానికి కళింగం చిన్న చిన్న సంస్థానాలుగా ఖండఖండాలైనది.

**శాతవాహనులతర్వాతివారు:-** శాతవాహనసామ్రాజ్యం క్షీణించటం మొదలుపెట్టగానే ఎక్కడి సామంతులక్కడే స్వతంత్రులైనారు. ఆవిధంగా మహారాష్ట్రంలో ఆభీరులూ, బీరారు ప్రాంతంలో వాకాటకులు, పశ్చిమ కర్ణాటకంలో చుతూలు, తలలెత్తారు. ఈచుతూలు తర్వాత కదంబులవల్ల పదచ్యుతులయారు. శాతవాహనరాజ సంతతివారు కృష్ణాముఖ ద్వారంచుట్టు పక్కల ఆంధ్రదేశాన్ని పాలించారు. వీరిని ఇక్ష్వాకులు ఒకప్పుడూ, బృహత్పలాయను లొకప్పుడూ, సాలంకాయనులు ఇంకొకప్పుడూ, విష్ణుకుండినులు మఱొకప్పుడూ ముట్టడించి, చిట్టచివఱకు పదభ్రష్టుల్ని చేశారు. ఇంతలో కంచిలో బలవత్తరులౌతున్న పల్లవులు విజృంభించి శాతవాహన సామ్రాజ్యంలోనిఆగ్నేయప్రాంతాన్ని కబళించివేశారు. దక్కనును యూవత్తు నాలుగువందల ఏళ్ళపాటు ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలిన శాతవాహన ప్రభుత్వం చివఱకు ఇల్లా అస్తమించింది. తర్వాత చాళుక్యులు సామ్రాజ్యం నెలకొల్పగలిగేవఱకూ దక్కను ఈవిధంగా చిన్న చిన్న రాజ్యాలుగా విభక్తమై ఉన్నది. శాతవాహనుల క్షీణదశలో తలయెత్తిన వివిధ రాజ వంశాలలో మధ్యప్రదేశప్రాంతంలో తలలెత్తిన వాకాటకులు క్రీ. శ. 3వ శతాబ్దం చివఱి పాతిక సంవత్సరాలనుంచి 6వ శతాబ్దం సగంవఱకూ బలవంతులై ప్రభుత్వం చేశారు. ఈ వాకాటకులు ఎక్కడివారో స్పష్టంగా చెప్పటానికి అవకాశాలు లేవు. వీరిలో కొందఱు బుందేల్ ఖండులోని బగత్ నుంచి వచ్చినవారు. మఱికొందఱు తూర్పుదక్కనులోని ఆంధ్ర

ప్రాంతంవారే. వాకాటకవంశానికి మూలపురుషుడైన వింధ్య శక్తి అనే బ్రాహ్మణ ప్రభువు అనేకయుద్ధాలలో జయం పొందిన మహావీరుడనీ అజంతాలోని ఒక శాసనంవల్ల తెలుస్తున్నది. అతని కుమారుడు ఒకటవ ప్రవరసేనుడు. (క్రీ. శ. 300-340 సం॥) రాజ్యాన్ని విస్తరింపజేసి సార్వభౌముడని పించుకొన్నాడు. తన విజయాలను చాటడానికి అనేక యాగాలు చేశాడు. ఇతను బుందేల్‌ఖండు మొదలుకొని హైదరాబాదు వరకూ వాకాటకసామ్రాజ్యాన్ని స్థాపించాడు. ప్రభావతీగుప్త అనే రాణి యుక్తవయస్సురాని తన కుమారుని తరఫున రాజ్యం చేసినట్లు కనబడుతుంది. ఆమె కుమారుని అనంతరం సింహాసనం ఎక్కినవారిలో రెండవ రుద్రసేనుడు (క్రీ॥ శ॥ 390-95 సం॥) గుప్తచక్రవర్తి అయిన రెండవ చంద్రగుప్తుని కూతురిని వివాహం చేసుకొన్నాడు. వాకాటకవంశంలో చిట్టచివరి గొప్ప చక్రవర్తి హరిసేనుడు (క్రీ॥ శ॥ 486-515 సం॥). ఇతను కుంతల, మాళవ, దక్షిణకోసల, కళింగ, త్రికూట (ఉత్తరకోంకణం), లాట (దక్షిణఘూర్జరం), ఆంధ్ర దేశాలను జయించాడు. అజంతా శిల్పాలలో వాకాటకులు నిర్మింపజేసిన ఉత్తమ కళా ఖండాలూ, మతప్రధానశిల్పాలూ కూడా ఉన్నవి. వీరు ప్రత్యేకంగా కొన్ని దేవాలయాలను గుహలలో వెలయింపజేశారు. 16, 17 వ అజంతాగుహాలు వరుసగా వాకాటరాజైన హరిసేనుని మంత్రీ, సామంతరాజూ కట్టించారు. ఇక్కడ చిత్రితాలయిన అద్భుతవర్ణాలవల్లనేకాక, ప్రత్యేకంగా అనేకరూపాలలో అతిసుందరంగా నిర్మించబడ్డ

స్తంభాలవల్లకూడా ఈ గుహలు తక్కినవాటికంటె విశిష్టంగా కనబడుతాయి. హరిసేనునికాలంనాడు వెలసిన అజంతాలోని ఒక శాసనం కొంతమేరకు వాకాటకరాజుల విజయాలను కీర్తిస్తున్నది. హరిసేనుని అనంతరం సింహాసనం ఎక్కినవారు ఎవరో ఏమీ తెలియదు. కాని కొంతకాలానికే అనగా క్రీ॥ శ॥ 6వ శతాబ్దం మొదటి పాతికసంవత్సరాలకే వాకాటక సామ్రాజ్యం శత్రువులవల్ల పతనమైపోయింది. కాదంబులు దక్షిణ మహారాష్ట్రాన్ని ఆక్రమించారు. కాలచుర్యులు ఉత్తర మహారాష్ట్రాన్ని వశపరచుకొన్నారు. ఇక క్రీ॥ శ॥ 550 సం॥ నాటికి వాతాపిలోని చాళుక్యులు వాకాటక సామ్రాజ్య శేషాన్ని కబళించివేశారు.

కదంబులు:- చాళుక్యుల అభ్యుదయాన్ని పరిశీలించే ముందు కదంబుల ఔన్నత్యం గమనించాలి. ఈకదంబ వంశానికి మూలపురుషుడు మయూరశర్మ అనే బ్రాహ్మణుడు. ఇతను కంచిలో ఉన్నతవిద్యాభ్యాసం చేస్తూఉండగా ఒక పల్లవాశ్వికుడు ఇతనిని పరాభవించటంవల్ల రోషంకలిగి ప్రతీకారేచ్ఛతో రణశూరుడై విజయంపొంది వీరలోకంలో సుప్రసిద్ధుడైనాడట. ఇతను పల్లవరాజ్యంలోని పశ్చిమభాగం కొంత జయించాడు. పల్లవులు ఇతనిని,సామర్థ్యాన్ని మెచ్చుకొని క్రీ.శ. 345 సంవత్సరాన పశ్చిమతీరాన వనవాసిచుట్టూఉన్నప్రాంతానికి ఇతనిని అధిపతిగాచేశారు. ఇతను ఉత్తరభారతం నుంచి కొంతమంది బ్రాహ్మణులను తనరాజ్యానికి రప్పించుకొని, వారికి స్థిరవసతులు కలిగించాడట. ఈవంశపు రాజులలో గొప్పవాడైన కాకుత్థ్సవర్మ గుప్త వాకాటక, గాంగరాజపుత్రులకు

తన కూతుంౘ్రడను ఇచ్చి వివాహాలు చేశాడు. కాదంబరాజు లకూ పల్లవులకూ తఱచూ యుద్ధాలు జఱుగుతూ ఉండేవి. క్రీ. శ. 475—90 సంవత్సరాలమధ్య రాజ్య మేలిన కదంబ రాజు మృగేశవర్మ పల్లవులనేగాక గాంగులనుకూడా ఓడించాడు. ఇతడు గొప్పజైనపండితుడూ, జైనమతాభిమానీ కావటంచేత పలాసికలో ఒక జైన దేవాలయం కట్టించాడు. క్రీ.శ. 537—47 సంవత్సరాలలో కదంబరాజ్యం పాలించిన కరివర్మను అతని సామంతుడైన ఒకటవపులకేశి అనే చాళుక్యరాజు ఓడించాడు. అంతటితో కదంబుల ప్రభుత్వం అంతరించింది. వాతాపి రాజధానిగా చాళుక్య సామ్రాజ్యం విస్తరించింది.

# పంచమ ప్రకరణం

## సంగమ కావ్య యుగం

శాతవాహనులు దక్కను పరిపాలిస్తున్న కాలంలో దక్షిణపు అంచలాల్లో చేర, చోళ, పాండ్య రాజ్యాలుండేవి. ఈ రాజులను గురించి మొట్టమొదటి ప్రశంస భారతంలో కనబడుతున్నది. వీరు భారతయుద్ధంలో పాల్గొన్నవారు. ద్రావిడ దేశాన్ని పాలించిన వీరు మొట్టమొదట ఉత్తర భారతంనుంచివచ్చిన వారే అయివుండవచ్చును. పాండ్య పాండుశబ్దాల సారూప్యాన్ని బట్టీ, పాండవకాంత ద్రౌపది అనేకభర్తృక అయినట్లే, ఇక్కడి కొన్ని జాతులలో గృహానికి స్త్రీయే పెత్తనదారుగా వుండటం మొదలయిన వాటినిబట్టి ఉత్తరభారతంనుంచి వచ్చిన పాండవ సంతతివారే యీ పాండ్యులనీ ఊహించవలసి వస్తున్నది. అశోకుని కాలంనాటి ప్రాచీన శాసనాలలో దక్షిణభారత ప్రసక్తి వచ్చినచోట మౌర్యుల కాలంలో కూడా వీరు స్వతంత్రులుగా వున్నట్లు కనబడుతున్నది. పాండ్యులకు పొరుగు రాజులుగా ప్రసిద్ధులైన సత్యపుతులే సంగంకావ్యాలు పేర్కొన్న కొంగరులు లేక కొసరులు కావచ్చును.

వెంగడం అనే నామాంతరం కల తిరుపతి (తమిళాహానికి) తమిళరాజ్యానికి ఉత్తరపు సరిహద్దుగా ఉండేది. తమిళ రాజ్యానికి తూర్పు పడమరలలో సముద్రము సరిహద్దుగా ఉండేది. ఈనాటి కేరళమూ, మైసూరులోని దక్షిణభాగమూ

తమిళరాజ్యంలోనే చేరిఉండేవి. తూర్పుతీరాన పులికాట్‌నుంచి మధురవఱకూ చోళులపాలనలో ఉంటే, మధుర, తిరునెల్వేలి, నంజినాడ్‌లో కొంతభాగమూ పాండ్యుల ఏలుబడిలో ఉండేవి. పశ్చిమతీరాన గోకర్ణంనుంచి కన్యాకుమారివఱకూ చేరరాష్ట్రం లోని భాగం. ఈ మూడు పెద్దరాజ్యాలకుతోడు, అయిన్, కోసర్‌లవంటి చిన్నరాజ్యాలుకూడా ఉండేవి.

ప్రాచీన తమిళులనుగూర్చి తెలుసుకోవటానికి సంగం వాఙ్మయమే ప్రధానమైన ఆధారం. కాని, సంగంయుగం ఎప్పటినుంచి ఎప్పటివఱకో నిర్ణయించటం అలావుండగా, కలగాపులగంగా కనిపిస్తున్న చారిత్రిక సామగ్రినిబట్టి క్రమ బద్ధంగా తమిళచరిత్రను వివరించటంకూడా అశక్యంగా ఉన్నది. సంగంవాఙ్మయంయొక్క ఉత్పత్తికానీ, విస్తృతికానీ సరిగా ఏయే కాలాలలోనిదో నిర్ణయించటానికి అవకాశాలు లేవు. ఇరాయినార్ అహోప్పొరల్ అనే తమిళచ్ఛందశ్శాస్త్రానికి విశదీకరించే గ్రంథం సంగంవాఙ్మయంలో అతిప్రాచీనమైనది. ఇది ఎంత వెనుకకునెట్టినా క్రీ. శ. 8 వ శతాబ్దాన్ని దాటిపోదు. ఇంతేకాక దీనిలో తేలికగా విశ్వసించరాని అద్భుతవిషయాలు కూడా కనిపిస్తాయి. మొత్తంమీద 9900 సంవత్సరాల కాలం పాటు మూడురకాల సంగంవాఙ్మయాలూ వర్ధిల్లాయనీ, దీనిని వెలయించిన కవుల సంఖ్య 8598 మంది అనీ, ఈ కవులలో కొందఱు దేవతలుకూడా ఉన్నారనీ ఇందులో పేర్కొనటం జరిగింది. ఇది ఎంతమాత్రమూ నమ్మటానికి వీలులేనిదిగా

కనబడుతుంది. కాని సంగంవాఙ్మయం అంతటిలోనూ పురాణా ద్యద్భుత విషయశ్లిష్టం కానిది లేనేలేదు. తరువాత వచ్చిన తమిళ కావ్యాలలో సంగంవాఙ్మయాన్ని గూర్చిన ప్రశంస అలావుండగా, ఇందులో కనబడే కొందఱు రాజుల పేర్లూ, కవుల పేర్లూ చూస్తే ఈ మొత్తం వాఙ్మయం అంతా అవిశ్వస నీయం కాదనీ, కొంత ఊహాతీతమైన అభూతకల్పన ఉన్నా, కొంత వాస్తవంకూడా ఉన్నదనీ స్పష్టపడుతుంది.

అసలు సంగంవాఙ్మయంలో మూడుదశలు ఉన్నాయో లేక అంతాఒక్కటేకొనో నిర్ణయించటానికికూడా వీలులేదు. మధురలో సుస్థిరులు కావటానికి పూర్వం పాండ్యులు రెండు చోట్ల రాజధానులు నిర్మించుకొనటం జరిగిందని సంగం వాఙ్మయంలో కనబడుతున్న అంశాన్ని మహాభారతమూ, ప్లైనీ రచించిన నైసర్గికచరిత్ర అనేగ్రంథమూ బలపరుస్తున్నాయి. మధురకు రావటానికి పూర్వం పాండ్యులు కపటపురం రాజధా నిగా రాజ్యమేలినట్లు వీటివల్ల ధ్రువపడుతున్నది. మూడురాజ ధానులలో ఒకదాని తరువాత ఒకటిగా పాండ్యులు రాజ్య పాలనంచేసి వుండటం అసంభవం కాకపోవచ్చును. మొదటి రెండు సంగంవారూ అనేక కావ్యాలు సృష్టించుకొన్నట్లు ఆవాఙ్మయం కంఠోక్తిగా చెప్పుతున్నది. అయితే ఈవాఙ్మ యంలో చాలాభాగం నశించింది. ఇప్పుడు కనిపించేవాటిలో సంగంవాఙ్మయం మూడవదశలో వెలసినగ్రంథజాలమేఎక్కువ.

మూడవ తమిళసంగం యుగం క్రీ.పూ. 500సం॥నుంచి వెయ్యిసంవత్సరాలు అంటే క్రీ.వె. 500సం॥ల మధ్యకాలం

లోనిదై ఉంటుంది. నిశ్చితంగా దీని ఆద్యంతాలు పేర్కొనటం అసాధ్యం. క్రీ.శ. 7వ శతాబ్దంనాటి గేయవాఙ్మయ కర్తలు పేర్కొన్న విషయాలనుబట్టిన్నీ, అనేక సంగం కావ్యాలలోను గేయాలలోనూ కనబడుతున్న చారిత్రక విషయాలనుబట్టిన్నీ ప్రాచీనపు గ్రీకు గ్రంథకర్తల వ్రాతలూ, సంగంవాఙ్మయంలో వాణిజ్యాన్ని గురించిన విశేషాలుపరస్పరసమన్వితాలు అవుతూ ఉండటంవల్లనూ, దక్షిణభారతంలో దొరకిన క్రీస్తుశకం ప్రారంభంనాటి రోమను నాణెముల వల్లనూ, సంగంవాఙ్మయంలోని పెద్దపెద్ద కావ్యాలన్నీ క్రీస్తుశకం మొదటిమూడు శతాబ్దాలలోపలనే పుట్టివుంటాయని రూఢి అవుతున్నది.

ప్రస్తుతం కనబడుతున్న సంగంకావ్యాలలో తొల్కాప్యం ద్వితీయ సంగంయుగంలోనిదనీ, ఎట్టుత్తొగై, పత్తుప్పాట్టు, పదినెంకిల్కణక్కు, సిలప్పదిగారం, మణిమేఖలై అనేవి తృతీయ సంగంయుగంలోనివనీ చెప్తారు. ఎట్టిత్తొగెలో నట్రిణై, కురుంతొగై, పదిట్రుప్పాటు, పరిపాడకా, కలిత్తొవె, ఐగనాగూరు అయింగురునూరు, పురెనానూరు, అహానానూరు అనే ఎనిమిది కావ్యాలు ఉన్నవి. పత్తుప్పాట్టు అనగా పది పద్యభాగాల సంకలనం. పదినెంకిల్కణక్కులో 18 నీతి ప్రధానాలైన చిన్నకావ్యాలున్నాయి. పారంపర్యవిశ్వాసం ఒకప్రక్కకు వుంచి విచారించితే, తృతీయసంగం యుగంలో విరచితాలనబడే కావ్యాలన్నీ నిజంగా ఆయుగంలోనే పుట్టాయా; అనే సందేహం కలుగుతుంది. ఎత్తుత్తొగై పత్తుప్పత్తులుమాత్రం

ఈయుగానివే అయినా, మొత్తం 18 చిన్నకావ్యాలలో చాలా వఱకున్నూ, మణిమేఖల, 'సిలప్పదికారాలున్నూ ఈయుగానికి కొంత ఇటీవలికాలంలోనే పుట్టినట్లు కనిపిస్తాయి. తిరుక్కురళ్ మాత్రం ఈపురాణాలకంటె ప్రాచీనం అని నిస్సందేహంగా చెప్పవచ్చును. అందులోని భావాలను పరిశీలించితే అవి సంగం కావ్యాలకు సమకాలపు భావాలుగా కనిపిస్తాయి. నాలదియార్ లోని ముత్తరయార్ అనేవిభాగం క్రీ.శ. 9వ శతాబ్దంలోని ముత్తరయార్ సేనాపతుల కాలంలో విరచితమైనట్లు కనబడు తున్నది. బహుశః ఈచిన్న కావ్యాలలోనూ అధికభాగం క్రీ.శ. 6, 9 శతాబ్దాలమధ్య పుట్టి ఉంటాయి.

సంగం వాఙ్మయంలో పురనానూరు, పదిట్రుప్పాట్టు పత్తుప్పాట్టు నాటి చరిత్ర తెలుసుకొనటానికి చాలా ఉపయో గపడతాయి . అయితే ఆయుగంలోని రాజవంశాలలో దేని తర్వాత ఏది ఎప్పుడు అధికారానికి వచ్చిందీ విస్పష్టంగా తెలి యడం లేదు. కొందఱు రాజుల చరిత్రలు ఇందులో కనిపిస్తాయి కాని ఏరాజు ఏకాలంలో వాడో అనిర్దిష్టంగా ఉన్నది. పదిట్రు ప్పాట్టులో చేరరాజులను గుఱించిన చాలా విశేషాలు ఉన్నాయి కానీ,అక్కడకూడాకాలనిర్ణయంమాత్రంచేయటానికి అవకాశాలు లేవు. పదిట్రుప్పాట్టు లోని మొదటి చివఱి ఆశ్వా సాలు ఈనాడు కనబడక పోవటం కూడా ఒక దురదృష్టమే. చేరరాజులను గుఱించి చెప్పేటప్పుడు వారి వంశ వృక్షమూ, ఎవరు ఎంతెంత కాలం ప్రభుత్వంచేసిందీ పదిట్రుప్పాట్టు వివరిస్తు

న్నది. అయితే చేరరాజులలో రెండు శాఖలున్నాయి. ఒక శాఖ వారు వాంచిలో ప్రభుత్వం చేస్తూ ఉంటే రెండో శాఖ వారు తొండిలోనుండి రాజ్యం చేశారు. (ఈ వాంచి ఎక్కడిది అనేది ఒక క్లిష్టమైన ప్రశ్నగా ఉన్నది. ఇది పశ్చిమ సముద్రతీరాన క్రాంగనూరు సమీపంలో ఉండేదని కొందఱి అభిప్రాయం. తిరుచునాపల్లి జిల్లాలోని కరుప్పూరే ఆనాటి వాంచి అని మఱి కొందఱి అభిప్రాయం.)

మనకు లభించిన చారిత్రిక సామగ్రిని బట్టి విచారిస్తే వాంచి పశ్చిమ తీరస్థమే అనటానికి అవకాశాలు ఉన్నాయి. అయితే చేరరాజులు కొందఱు కరవూరులో కూడా రాజధాని ఏర్పఱుచుకొని వుండవచ్చును. అయితే చాలా సందర్భాలలో ఈవుభయ శాఖలకూ కల బాంధవ్యం ఎటువంటిదో తెలుసుకొనటానికి అవకాశాలు లేవు. అంతేగాక ఏరాజుకు ఏది ముఖ్యనగరమో కూడా విశదంగా లేదు. ఇంతేగాక పురనానూరులో చాలా మంది చేర రాజుల ప్రశంస వున్నది. కానీ పదిట్రుప్పట్టులో పేర్కొన్న రాజులకూ వీరికీ కల బాంధవ్యం మెటువంటిదో అనూహ్యంగానే వున్నది. పదిట్రుప్పట్టులో కీర్తితు లయిన ఎనిమిది మంది రాజులలో చేరరాజైన సెంగుట్టువాన్ సుప్రసిద్ధుడైన మహారాజు. సిలప్పదికారం ఇతని విజయాలెన్నో ప్రశంసిస్తున్నది. పరనార్ మహాకవి ఈచక్రవర్తి చరిత్రకు అయిదవ ఆశ్వాసం అంతావినియోగించాడు. హిమాలయాల వఱకూ సాగిన అతని దండ

యాత్ర వేలిర్ సామంతరాజైన నన్నన్ పరాజయము, నెరివా యిల్‌లో తొమ్మిదిమంది చోళరాజులకూటమిని విచ్ఛిన్నం చేయటం, కొంగర్లను పరాజితులను గావించటం మొదలయిన వెన్నో సిలప్పదికారంలో వర్ణితాలైనాయి. అయితే చారిత్రి కంగా ఇవి ఎంతవఱకు నిజమో నిర్ణయించటం కష్టం. సెంగుట్టు వాన్ గొప్పకర్మిష్ఠి; అనేకయాగాలు చేసినవాడు; హరిహరుల నిద్దఱినీ సమదృష్టితో ఆరాధించిన పరమభక్తుడు. సిలప్పది కారం, పదిట్రుప్పట్టులు ఈమహారాజు కరికాలచోళునిదాహిత్రు లలో ప్రథమగణ్యుడని పేర్కొంటున్నాయి.

చోళులలో కరికాలుడు చాలాగొప్పచక్రవర్తి. అతను చేరులనూ, పాండ్యులనూ ఓడించటమేకాకుండా, వణ్ణిప్ప రండలై వద్ద కట్టకట్టుకొనివచ్చిన తొమ్మిదిమంది రాజులను నిర్జిం చాడు, అతని పరాక్రమగాథలు పురనానూరు,పోరునట్రుప్పడై ల లోనూ, మణిమేఖలా శిలప్పదికారాలలోనూకనబడుతున్నాయి. కరికాలుడు వ్యవసాయాభివృద్ధికోసం పంటకాల్వలుత్రవ్వించటం కావేరిపట్టణంలో వాణిజ్యాన్ని, పరిశ్రమల్ని, అభివృద్ధిచెయ్యటం పత్తినప్పాలై విశేషంగా వర్ణిస్తున్నది. సంగం వాఙ్మయంలో వర్ణితుడైన కరికాలుడు మంచి వ్యక్తిత్వంకలవాడు. కలింగట్టుప్పరణి విక్రమచోళన్ఉళా మొదలైన ఇటీవల గ్రంథా లలో అతని గురించి కొన్ని అద్భుతకల్పనలు వున్నప్పటికీ, కొంతసత్యంకూడా ఉన్నది.

సంగం పద్య కావ్యాలలో ఇరవైమందికి పైగా పాండ్య రాజుల పేర్లు కనిపిస్తాయి. నెడుంజలియన్ మదురైకాంచి

కావ్యానికి కథానాయకుడు. అతను తలయలంగనంలో తన్నెదిరించిన చేర చోళ రాజుల్ని, మఱి అయిదుగురు చిన్న సామంతరాజుల్నీ, జయించాడు. పురనానూరు, అహాననూరు, కురుంతొగై, నట్రినై లలో అనేక పద్యాలలో అతని ప్రశంస కనిపిస్తున్నది. రణప్రియుడుగానూ, కవిపోషకుడుగానూ, అనేకయాగాలు చేసిన హైందవ కర్మిష్టిగానూ, సంగం యుగంలోని పాండ్య చక్రవర్తులలో అతను అత్యంత ప్రసిద్ధుడైనాడు. నెడుంజెలియన్ తరువాత పాండ్య రాజ్యాన్ని ఏలినవారిలో ఉగ్ర పెరువలుతి మహా పరాక్రమ వంతుడు. కన్నప్పర్ సేనానిని లొంగదీసికొన్నాడు. ఆమహారాజు చక్కని కవి కూడాను. అహాననూరు కావ్యంలోని పద్య సంకలనాలలో అతను కూడా పాలుగొన్నట్లు ప్రసిద్ధి వున్నది. ఈయుగంలోని మరొక పాండ్యరాజు "ఒల్లయ్యూరును" స్వాధీనపరచుకొన్న "భూతప్పాండియన్" అనేరాజకవి. అతను గొప్పశూరుడు, ఉదారుడు. స్నేహపాత్రుడు. స్వస్త్రీ సమర్పిత హృదయుడుగా అన్నివిధాలా ఉత్తముడుగా కీర్తితుడైన చక్రవర్తి.

సంగంకావ్యాలలో ఈమూడు వంశాలరాజుల చరిత్రలు మాత్రమేకాక, తమిళదేశంలో వేలువేలు, చిన్నచిన్నరాష్ట్రాలను పాలించిన అనేక సామాన్యరాజుల చరిత్రలు కూడా వున్నాయి. వారందరిలోను, ఎయ్అందిరన్, పారి అనే వారు ధైర్య స్థైర్యాలకూ కవిపోషణకూ ప్రసిద్ధికెక్కారు. మరి ఐదుగురు ఇతరరాజులనుగురించికూడా, ఇదేవిధంగా ప్రశం

సించటం కనబడుతుంది. వీరికి వెల్లాలసత్తకంఅనిపేరు. అయితే వీరు ఏయేవంశాలకు చెందినవారో, చేరులు చోళులు పాండ్యులు అనే ముఖ్య రాజవంశాలకు వీరికి ఎటువంటి బాంధవ్యం వున్నదో, తెలుసుకోవడానికి అవకాశాలులేవు.

ఇటువంటి లోపాలు తప్పితే సంగం సారస్వతంలో ఎన్నో తెలిసికోదగిన విశేషాలు వున్నాయి. చక్రవర్తిత్వం యొక్క తత్వమూ, పరిపాలకుల ఆదర్శాలూ, మొదలయినవి దీనిలో తేట తెల్లంగా కనబడుతాయి. రాజులు సహజంగా యుద్ధప్రియులు మాటిమాటికీ యుద్ధాలు జరుగుతూ వుండేవి. యుద్ధంలో ధైర్య స్థైర్యాలను ప్రకటించటం వల్లనే, పురుషులు సంఘంలో మంచి గౌరవం సంపాదించేవారు. ఏడుగురు రాజులను ఓడించటం, అత్యద్భుత విషయంగా ఎన్నికకు వచ్చేది. ఆవిధంగా పరాజితమైన రాజసప్తకం కిరీటాలను ఒకమాలగా గ్రుచ్చి, విజేత ధరించేవాడు. అదే ఆతని విజయానికి ముఖ్య చిహ్నంగా వుండేది. రణరంగంలో మరణించటంగాని, కొన ఊపిరివరకు శత్రువులతో పోరాడుతూ వుండటంగాని, వుత్తమ చక్రవర్తి లక్షణమని భావించేవారు. రెండవ ఏధన్ అనేచేర రాజు రణరంగంలో వెన్నుమీద తీవ్రంగాగాయపడి ఆమరణ ప్రాయోపవేశం చేశాడు.

మహారాజుల కర్తవ్యాలను గురించిన సంపూర్ణ వివరణం ఈసంగంకావ్యాలలో కనబడుతున్నది. నిష్పక్షపాతంగా న్యాయపరిపాలన చెయ్యడం, అనదలకూ పేదలకూ

రక్షణకల్పించటం, ప్రజల ఆర్థికపరిస్థితులను, బాగుపరచటం ప్రజా క్షేమంకోసం మతప్రోక్తాలైన వివిధయజ్ఞాలనూ శాంతులనూ జరపటం, రాజులముఖ్యకర్తవ్యాలు. 'ప్రభుత్వానికి సంఘానికీ, ఆచారసంప్రదాయాలలో భేదాలు సంభవించినప్పుడు రాజ సంప్రదాయం ప్రజలకు ఆదర్శప్రాయంగా ఉండాలి,' అని భావించేవారు. రాజు భోగలాలసుడుకాక, తన శీలంచేత, మత ధర్మపరిపాలనచేత, విజ్ఞానంచేత, సంఘానికి ఉత్తమలక్ష్యంగా ఉండాలని అనేక పద్యాలలో కనబడుతున్నది. రాజనామం సార్థకంచేసుకోవాలనే ప్రభువుబాధ్యతలు ఎటువంటివో, కురళ్ అనేకావ్యం సువిదితంచేస్తున్నది.

సంగం యుగంలోని రాజులు సుప్రసిద్ధులనటంనిర్వివాదం. వీరు పండితపోషకులు మాత్రమేకాక స్వయంగా కవిత్వం చెప్ప గలవారు. కవులయందు వీరు విశేషాదరంచూపి, అమాత్యులు గానూ, ఇతర రాజ్యాలలో రాయబారులుగానూకూడా నియ మించారు. కళలకూ, ముఖ్యంగా కవిత్వానికీ, సంగీతానికి విశేషమైన ప్రోత్సాహం కల్గించారు.

ఎప్పుడైనా సింహాసనంకోసం పోరాటాలు జరుగుతూ వచ్చినా, సాధారణంగా రాచరికం వంశపారంపర్యంగానే ఉండేది. న్యాయశాస్త్ర సిద్ధాంతలనుబట్టి రాజే సర్వాధికారి అయినప్పటికీ, కవులు, అమాత్యులు, మతపీఠాధిపతులు మొదలయినవారి సమ్మతితోనే ప్రభుత్వం సాగేది. రాజు ప్రజలకు తండ్రివంటివాడుఅనేభావంఉండేది. "అయింప్పెరుంకులు"

"ఎస్పెరియం" అనేపేరులతో దేశపరిపాలనలో మహారాజుకు సలహా యివ్వటానికి కొంతమంది నియుక్తులై ఉండేవారు. మహారాజు వీరి సాయంతో పరిపాలన నిర్వహించేవాడు.

"మాన్రమ్" లేక "పాటియిల్" అనేది న్యాయస్థానం పేరు. లోకానుభవంకల పెద్దలు న్యాయమూర్తులుగా ఉండి తగవులు పరిష్కరించేవారు. ప్రభుత్వవిధానంలో ఏదైనా ముఖ్యమైనమార్పు చెయ్యటం అవసరంగా కనిపిస్తే మహారాజు ఈ న్యాయస్థానంతో సంప్రదించే వాడు. ఈ "మాన్రమ్" కు "అవై" అనే నామాంతరం కూడా ఉన్నది. నేటి మన శాసనసభకు ఎంత అధికారం ఉన్నదో ఆనాడు దీనికి అంత అధికారం ఉన్నదని "కురళ్"వల్ల విశదమౌతున్నది. ఈ "మాన్రమ్" సలహాలను రాజుతప్పకుండా పాటించేవాడు. అయినప్పటికీ మాన్రమ్ సభ్యులు ప్రస్తుత ప్రజాస్వామికంలో శాసనసభలకు ఎన్నిక అయిన సభ్యులమాదిరిగా ఎన్నికైన వారని మాత్రం గట్టిగా చెప్పలేము.

సంగంవాఙ్మయంలో నాటి ప్రజాజీవితం వర్ణితమైనట్లుగా రాజోద్యోగుల విధులు హోదాలు మొదలయినవి వివరంగా చెప్పటం కనబడదు. ప్రాచీన తమిళకవులు ప్రకృతిసముపాసకులు మానవజీవితంలో తటస్థించే ఘట్టాలను కన్నులగట్టినట్లు వర్ణిస్తారు" అని పి.టి. శ్రీనివాసఅయ్యంగార్ అన్నారు. వారు రచించిన కావ్యాలలో సందర్భానుసారంగా చేసిన వర్ణనలు మొదలయినవాటివల్ల ఆనాటి సాంఘికపుకట్టుబాట్లూ, మత

సంప్రదాయాలు, కళాభివృద్ధి, విద్యలు మొదలయినవి ఎల్లా ఉండేవో చక్కగా తెలుసుకోవచ్చును. కావ్యాలలో ప్రసక్తాలయిన ఆయావర్ణనలు ఏవో కొన్ని ప్రత్యేక ఘట్టాలలోనివే అయినా అతి వాస్తవికంగానూ సహజంగానూ చిత్రితాలయినాయి.

ప్రాచీన తమిళులు భూస్వభావాన్నిబట్టి తినాయిూలనే అయిదు తెగలుగా దేశాన్ని పేర్కొన్నారు. "పలై" అంటే ఎడారిభూమి; "కురింజీ" అంటే పర్వతసీమ; "ముల్లై" అంటే వనసీమ; "మరుదం" అంటే నదీప్రాంతపులోయ; "నైడాల్" అంటే సముద్రతీరపుభూమి. ప్రజల జీవితంకూడా వారునివసిస్తూ ఉండే ప్రాంతపు భూస్వభావాన్నిబట్టి మార్పు చెందుతూ ఉంటుంది. వృత్తులు, అలవాట్లు మారిపోతాయి. "పలై" తెగకు చెందిన ప్రాంతాలలోని ప్రజలు స్థిరంగా ఒకచోట నివసించేవారుకారు. "ముల్లై" అనే వనమయ సీమలలో నివసించేవారు గొల్లలవలె గొర్రెలు, మేకలు మొదలయిన జంతువుల్ని పెంచుతూ, వాటివల్లనే జీవిస్తూఉంటారు. "కురింజీ' భూవాసులకు వేట ప్రధానవృత్తి. "మరుదం" ప్రాంతీయులకు వ్యవసాయమూ, "నైడాల్" భూవాసులకు చేపలను పట్టటమూ ముఖ్యవృత్తులు. తమిళులు ఈ పంచవిధ భూభాగాలలోనూ నివసిస్తూ వచ్చారు. కాలక్రమాన ఒకప్రాంతంవారు మరొకప్రాంతానికి వెళ్ళటం జరిగినప్పటికీ జీవనపద్ధతులలో కొంత మార్పువచ్చినా ఆయాప్రాంతాల ప్రజల ప్రధానవృత్తు

లలో మాత్రం మార్పులు రాలేదు. అందువల్ల సంగంయుగం లోని తినాయిాలలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క ప్రత్యేకత ఉన్నప్పటికీ ఒక తినాయికీ మరొక తినాయికీ సర్వసాధారణ లక్షణాలుకూడా ఉండటమూ, అయిదు తినాయిాలు అఖండ భూభాగంగానే భావించటమూకూడా ఉండేది.

వారి ఇండ్లు కూడా ఆ నిరాడంబరతకు తగ్గట్టే ఉండేవి. కొండలలో గానీ అడవులలోగానీ, నివసించేవారు. మట్టిగోడ లుకల పూరిండ్లలో నివసించేవారు. పురనానూరులో వర్ణిత మైన ఇల్లు అతిసాధారణమైనది. దానిని ఇల్లు అనటంకంటె పందిరి అనటమే ఉచితమేమో! నదీప్రాంతప్రదేశాలయందు విశాలమైన ఆవరణలుకల పెద్ద పెద్ద యిండ్లు కట్టుకొనేవారు. ధనవంతులు వేసగిలో నివసించటానికి ఒక ఇల్లు, తక్కిన కాలాల్లో నివసించటానికి ఒకయిల్లునిర్మించుకొనేవారు. చాలా అంతస్తులుగల పెద్దమేడలుకూడా వుండేవి. మహారాజ ప్రాసాదాలు అత్యున్నతాలై అతి విశాలంగా ఉండేవి. వాటిలో ఎన్నో అంతర్భాగాలు, ఎంతో భోగసామగ్రి ఉండేవి. గృహ నిర్మాణకళ ఆ కాలంలో బాగా అభివృద్ధి చెందింది. వాస్తు శాస్త్రానుగుణంగా శిల్పులు, ఏవిధంగా మహాభవనాలు నిర్మించే వారో "నెపసల్వాదై" వల్ల తేటతెల్లమౌతుంది. రాజభవనాలనూ, కూడా ఇతరమైన పెద్ద పెద్ద ఇండ్లనూ, నిర్మించటానికి పంచుకుట్టలు ఉపయోగించేవారు. వీటిలో చాలా వాటికి మిద్దెలూ, మొగసాలలూ, ఉండేవి. పురాణయుగంలో రాజ

భవనాలకు పెద్ద సింహద్వారాలూ, బురుజులూ, ఉండేవి. కృత్రిమ దీపాలూ, మంచాలకు చక్రాలూ, జలఘటికా యంత్రాలూ ఉండేవి.

ఆ నాటి ప్రజల ఆహారం తర్వాత యుగాలలో మాదిరి గానే ఉండేది. ధనవంతులు వరి బియ్యమూ, పాలూ, నెయ్యీ, కూరగాయలూ, పండ్లూ ఉపయోగించేవారు. ఇక మిగిలిన సంబారపు వస్తువులూ, ఋతుభేదాలనుబట్టి పెట్టుకొనే ఊరుగాయలూ, సర్వ సాధారణాలే. బీదలు సామాన్యంగా గంజి, ఆకుకూరలతో కాలక్షేపం చేసేవారు. అన్ని జాతులవారూ మాంసాహారం తీసుకొనేవారు. జైన బౌద్ధుల సహవాస ఫలితంగా క్రమంగా మాంసాహారం విసర్జించటానికి ప్రయత్నాలు జరిగాయి. మద్యం ప్రసిద్ధ పానీయంగా ఉండేది. తాంబూలం వేసికోని వారు తక్కువ. అశక్తులనూ, అనదలనూ, ఆదరించటం ఉత్తమ ధర్మమని తమిళుల అభిప్రాయం. పేదలకు సంతర్పణ చెయ్యటం ఒక పవిత్ర కార్యం అని భావించేవారు. ఉత్సవ సందర్భంగాకానీ, దానప్రీతిచే గానీ, సంతర్పణలు తఱచూ జరుగుతూ ఉండేవి.

వస్త్రధారణం శీతోష్ణస్థితిగతుల కనుగుణంగా నిరాడంబరంగా ఉండేది. పురుషులు రెండు వస్త్రాలు ధరించేవారు. ఒకటి ధోవతి, రెండవది ఉత్తరీయం. బనియన్లు వాడటంకూడా ఉండేది. అవి బహుశః గ్రీకులను చూచి నీసు అలవాటు చేసికొని వుండవచ్చును. దుస్తులు చాలా శ్రేష్ఠంగా వుండేవి అ

టంలో సందేహం లేదు. ధనవంతులు మహారాజులు ఎటువంటి దుస్తులు ధరించేవారో ఆనాటి సారస్వతంలో వర్ణితమై ఉన్నది. అయితే బీదలు, యోగులు కొన్ని రకాల చెట్ల పట్టలను గానీ జంతు చర్మాలనుగానీ ధరించే వారు.

నాటి ప్రజలకు పాచికలు మొదలయిన పందెపు క్రీడల యందు విశేషమైన ఆసక్తి ఉండేది. ప్రజాసామాన్యపు వినోదం కోసం జరిగే పందెపు క్రీడలు సాధారణంగా "మాన్రమ్" ఎదుటనే జరిగేవి. యువకులందరూ ఆఆటలలో పాల్గొనేవారు. ధనవంతులూ, మహారాజులూ తమ భవనాల ఎదుట గొప్ప పరిషత్తులు ఏర్పాటుచేసి పురాణగోష్ఠులూ, కావ్యపఠనాలూ జరిపించేవారు. తఱచూ ఉత్సవాలు జరిగేవి. సంగంయుగం చివరిభాగాన వాటిసంఖ్యా నిర్వహణ విధానాలూ వృద్ధిపొం దాయి. ఉత్సవసందర్భాలలో మల్లయుద్ధాలూ, ధనుర్విద్యా ప్రదర్శనలూ, పాటకచ్చేరీలూ, నాట్యాలూ, నాటకాలూ ఏర్పాటుచేసేవారు. సైనిక శిక్షణనిమిత్తం ప్రతిగ్రామంలోనూ పోరవై, మురంకలారి అనే సంస్థలు పనిచేస్తూ ఉండేవి. రణ పాండిత్యం ఎవరికెంతవఱకు అబ్బిందీ పరీక్షించటం ఉత్సవాలలో ఒక ప్రత్యేక కార్యక్రమంగా ఉండేది. అందువల్ల ప్రతిసంవత్సరము ఇటువంటి కార్యక్రమాలతో ఉత్సవాలు జరుగుతూ ఉండేవి. ప్రజలకు సైనిక శిక్షణ ఇవ్వటం కోసం విశేష శ్రద్ధవహించి ఇటువంటి ఉత్సవాలు ఏర్పాటుచేసిన వారిలో అగ్రేసరుడు పెరునర్కిల్లి (పోరవైకో్క) ఈయుగంలో రణకౌశలంమీద

ప్రజలకు కలిగిన ఆసక్తి అనంతమై స్త్రీలుకూడా, అత్యంత శ్రద్ధతో యుద్ధవిద్యలను అభ్యసించటంవలుకూ వచ్చింది. రాజు కోసమూ, దేశంకోసంమూ ప్రాణత్యాగానికైనా, సంసిద్ధులు కావలసిందని, గృహలక్ష్ములు తమ భర్తలనూ, కుమారులను ప్రోత్సహించి, రణరంగాలకు పంపేవారు.

మనోవికాసంకోసం యువకులకు అవసరమైన శిక్షణ యివ్వటంకూడా జరుగుతూఉండేది. సారస్వతమూ, గణితమూ సమర్థులయిన అధ్యాపకులు యువకులకు బోధించేవారు. సంగీతమూ, నృత్యమూ, అభినయమూ, ఉన్నతస్థాయిలో నేర్పటం జరిగేది. నృత్యగాన ప్రదర్శనలు జరుపుతూ దేశపర్యటనంచేసే "పానార్" అనే సంస్థ లలిత కళాభివృద్ధికి ఎంతో తోడ్పడ్డది. ప్రత్యేకంగా సంగీతకళాభివృద్ధికి ఎక్కువ దోహదం జరిగింది. ఈ సంగంయుగంలో సంగీత సంబంధమైన లక్షణ గ్రంథాలుకూడా బయలుదేరాయిగాని దురదృష్టవశాన అవి నశించిపోయాయి.

లలితకళలన్నీ దేవతారాధనకు వినియుక్తాలయేవి. అయితే "తొల్కాప్పియం" అనే తమిళ వ్యాకరణంలో ఈ దేవతలపేర్లు కనబడకపోయినా మిగిలిన సంగంయుగంనాటి గ్రంథాలలో ఆయా దేవతల్ని పేర్కొనటం జరిగింది. త్రిమూర్తులయిన బ్రహ్మవిష్ణుమహేశ్వరులను విశ్వసించి ఆరాధించటం నాటి ముఖ్య సంప్రదాయంగా కనబడుతున్నది. ఇంతేగాక పురనానూరువంటి గ్రంథాలలో శివుడు, మురుగన్, కొఱ్ఱవై, అనే దేవతలను గూర్చిన ప్రశంస ఉన్నది. ఈ దేవతలకోసం కట్టిన

ఆలయాలు ఇప్పటికీ నిలిచి వున్నాయి. సిలప్పదికారం నాటికి శివుడు, మురుగన్, విష్ణువు, బలదేవుడు, ఇంద్రుడు, శని అనే దేవతలకు ఆలయాలు కట్టటం జరిగింది. ఆర్యమత విశ్వాసాల ప్రభావం ద్రావిడ ప్రజలయాద ప్రసరించటం పురనానూరు వంటి గ్రంథాలనుబట్టి గ్రహించవచ్చును. ఈ మురుగన్ అనే ద్రావిడ దేవుడే కుమారస్వామి ఆర్యదైవమైనాడు. ఈయనకు ఆరు ముఖాలు, పన్నెండు చేతులు. తమిళుల యుద్ధదేవత "కొఱ్ఱవై ఆర్యుల దేవత అయిన "దుర్గ" అయినది. విష్ణువు, లక్ష్మి, ఇంద్రుడు, బ్రహ్మ అనే దేవతలను ఆరాధించటం వుత్తర భారతంనుంచి దక్షిణభారతం నేర్చుకొన్నది.

అయితే ఈ మతపరివర్తనం సరిగా ఏ కాలంలో జరిగిందో నిశ్చయించటానికి ఆధారాలు కనబడవు. క్రీ.పూ. 3వశతాబ్ది దగ్గఱనుంచీ జైనబౌద్ధుల వుపదేశాలు దక్షిణభారతంలో విశేషాదరణ పొందటం జరిగింది. దీనికి ఎదురుదెబ్బతీయటం కోసం బ్రాహ్మణులు కృషిప్రారంభించారు. తర్వాత క్రమ క్రమంగా బ్రాహ్మణ ద్రావిడమతాలు అన్యోన్య పరివర్తనం పొందటం, దక్షిణభారతీయులు అందఱూ హిందువులు అనే భావం సుస్థిరంకావటం జరిగింది. అయితే సంగంయుగంలో జైనబౌద్ధహిందూమతాలుపరస్పరసామరస్యంతో వ్యవహరిస్తూ వుండేవి. క్రీ.శ. 6వశతాబ్దంవఱకూ ఈ త్రిమతాలకూ మైత్రి తప్ప అన్యోన్యశత్రుత్వం వుదయించనేలేదు. నాయనార్ యుగం నాటికి అంటే క్రీ.శ. 7,8 శతాబ్దాలలో మూడుమతాలు ముక్కోణపు పోటీలోపడ్డాయి.

తమిళసంఘవ్యవస్థలో ఆర్యమతప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. వర్ణంలేక రంగునుబట్టి కులవిభజన అనేదిఆర్యమతం నుంచి వచ్చినదే. ప్రాచీనతమిళ సంఘంలో వృత్తులనుబట్టి జాతి విభేదాలు ఉండేవి. పురనానూరులోని ఒక పద్యం నాలుగు కులాలను పేర్కొన్నది. అవి టుడియాంర్ పానన్, పరయార్, కదంబన్ అనేవి. అయితే తొల్కాప్పియం పరిశీలి స్తే వృత్తులను బట్టి యేర్పడ్డకులాలు మఱికొన్ని నెల్లార్ (భూస్వాములు) వనిగార్ (వర్తకులు) వనైవాలర్ (కూలీలు) అడియార్ (పాలేరులు) వంటివికూడా ఉన్నట్లు తెలుస్తున్నది. అయితే అవ్యవస్థితంగాఉన్న ఇటువంటి కులాలమీాద ఆర్యమత ప్రభావం ప్రసరించగానే వర్ణాన్నిబట్టి ముఖ్యంగా నాలుగురకాలకులాలకు అవకాశం కలిగింది. ఈరెండురకాల కులవిభజనలూ కొంతకాలం గడిచేసరికి పూర్తిగా ఏకీభావం పొందాయి. పురాణాలలో వీటికి సమన్వయం సాధించారు. వర్ణప్రధానంగా ఏర్పడ్డఆర్యకుల చతుష్టయంలోనూ కడపటిదైన శూద్రకులం వృత్తిభేదాలనుబట్టి అనేక శాఖలుగా చీలిపోయింది. బ్రహ్మక్షత్రియవైశ్యులందరూ ఉత్తరదేశంనుంచి దక్షిణదేశానికి వచ్చినవారే అని ఋజువు చెయ్యటానికి ఏమీా ఆధారాలులేవు. కొంతమంది బ్రాహ్మణులు మాత్రమే ఉత్తరభారతంనుంచి వచ్చారు. వీరే ఇక్కడవున్న వేర్వేఱు కులాలవారిని తమ మతంలో చేర్చుకొన్నారు. ఇక్కడి క్షత్రియులూ, వైశ్యులూ అనేవారు ఆర్యమతం అనుసరించిన కొన్ని ద్రావిడ జాతులవారు మాత్రమే అయి ఉంటారు.

క్రీ పూ. 3వ శతాబ్ది తర్వాత ప్రారంభం అయిన ఈ మత పరివర్తనం సంగం యుగం నాటికి పూర్తి అయి ఉంటుంది ఇక ద్రావిడులనీ ఆర్యులనీ వేర్వేరుగా చెప్పడానికి వీలులేకుండా ఉభయజాతులూ చిక్కగా పెనవేసుకొని ఉంటాయి. వర్ణాంతర వివాహాలు పనికిరావనే సిద్ధాంతం ఈకాలంలో వేళ్లు పాదుకొని ఉంటుంది. ప్రాచీన తమిళసంఘంలో రహస్యవివాహం బహిరంగ వివాహం అని రెండురకాల వివాహాలు ఆచరణలో ఉండేవి. కాని సంగంయుగం ప్రారంభంనుంచీ ఈఆచారానికి మార్పు వచ్చింది. శిలప్పదికారాది పురాణాల ప్రాదుర్భావ సమయంనాటికి ఆర్యసంప్రదాయ ప్రకారం అగ్నిసాక్షికవివాహం ఆచారమైంది. కొన్ని తమిళాచారాలను ఆర్యులుకూడా పరిగ్రహించారు. మాంగల్యచిహ్నంగా వరుడు వధువు మెడలో తాళికట్టటం, మృతుడైన పతితో సతి సహగమనం చెయ్యటం వితంతువులకు కేశఖండనం చెయ్యటం ద్రావిడులనుంచి (తమిళుల నుంచి) ఆర్యులు నేర్చుకొన్నారు.

సంగంయుగంలో స్త్రీకిగల గౌరవంఅసామాన్యం. ప్రాతివ్రత్యం పరమధర్మంగా భావించేవారు. పతివ్రత అయిన ఇల్లాలు ఇంటికి అమూల్యాభరణం అని ప్రశంసించేవారు. స్త్రీలకు తగినంత స్వేచ్ఛఉండేది. అనవసరపు భయాలకులోను గాకుండా సాంఘిక కార్యకలాపాలలో పాల్గొంటూ ఉండేవారు. కార్యావసరం కోసం ఇల్లుదాటి వెళ్లవలసివచ్చినప్పుడు నిష్కారణంగా భయపడేవారుకారు. కాని కేవలంధనకాంక్షతో ధనిక యువకులకు శరీరాన్ని అప్పగించే యువతులు (వేశ్యలు) కూడా ఉండేవారు. వీరికి సంఘంలో గౌరవంలేదు.

ఈవిధంగా సంగం సారస్వతంనుంచి ప్రాచీన తమిళ సంఘం ఎల్లాజీవించింది కన్నులగట్టినట్లు దర్శించ గలుగుతున్నాము. నాటిప్రజలు అసంతృప్తిఎరుగరు; పరాన్నభుక్కులు కారు. విశ్వాసం, పాతివ్రత్యం, పావిత్ర్యం, పరోపకారం, మొదలయిన ప్రశస్తలక్షణాలు కోకొల్లలుగానూ, సర్వాంతర్యాములుగానూ కన్పించేవి. ఈనైతిక బలంతో పాటు అర్థబలమున్నూ పుష్కలంగా ఉండేది. భౌతిక జీవితాభ్యుదయానికి తగినంత కృషికూడా జరిగేది. త్వరలోనే వాణిజ్యం ఉన్నత స్థాయికి వచ్చింది. పరిశ్రమలూ, వ్యాపారమూ, వ్యవసాయమూ అభివృద్ధి కావటం వల్ల ప్రజలు సిరిసంపదలతో తులతూగుతూ సోల్లాసులై జీవించేవారు.

# షష్ఠ ప్రకరణం

## రాచరిక ప్రయోగం

(క్రీ॥ శ. 500 సం॥ నుంచి 900 సం॥ వరకు)

శాతవాహన సామ్రాజ్యం పతనమైన తర్వాత దక్కను మీద తమ సర్వాధికారాన్ని ప్రతిష్ఠించుకోవాలని అనేక రాజ వంశాలు ఎలా ప్రయత్నించిందీ మనం తెలిసికొన్నాం. కాని క్రీ. శ. 6 వ శతాబ్దంలో చాళుక్యులు తలయెత్తగానే ఈ అన్యోన్య కలహాలు అంతరించాయి; రాజకీయంగా కొంత నిలకడ కలిగింది. పురాణాగాథలనుంచి విచారిస్తే చాళుక్యుల ఉత్పత్తిని గురించి అనేకులు అనేక విధాలుగా అభిప్రాయ పడుతున్నారు. హూణులు, గుర్జరులు, సెల్యూసిడ్లు మొదలైన విదేశీయులు కన్నడిగులతో కలిసి పోయారనీ వారే చాళుక్యులయ్యారనీ కొందరి అభిప్రాయం. చాళుక్య చరిత్ర పరిశీలిస్తే కన్నడిగులకూ చాళుక్యులకూ దగ్గర సంబంధం ఉండి ఉంటుందని తోస్తుంది. క్రీ.శ. 7 వ శతాబ్దంలో తమిళ దేశానికి వచ్చిన హ్యూన్ త్సాంగు "చాళుక్యులు క్షత్రియులమని చెప్పుకుంటున్నా"రని వ్రాశాడు.

చాళుక్య వంశానికి మూల పురుషుడు ఒకటవ పులకేశి. ఇతను వాతాపి నగరం స్వాధీనంచేసుకొని, అదే రాజధానిగా పరిపాలన ప్రారంభించాడు. తన సార్వభౌమత్వం నిరూపించు కోటానికి అశ్వమేధం మొదలైన యాగాలు చేశాడు. (క్రీ. శ. 535–566 సం॥) ఈ వంశంలో రెండవపులకేశి (క్రీ॥ శ॥ 611 – 642 – సం॥) సుప్రసిద్ధుడు. ఇతను కదంబులనూ, గాంగులనూ

కృ[illegible]తా ఇరుగు పొరుగు రాజులనూ ఓడించి దక్షిణా పథానికి సార్వభౌముడైనాడు.[1] చరిత్ర ప్రసిద్ధుడైన హర్షచక్రవర్తిని నర్మదానదిని దాటి రాకుండా నిలువరించిన గౌరవం ఇతనికి దక్కింది. కాని పల్లవ రాజైన ఒకటవ నరసింహ వర్మ ఇతనిని నిర్జించి వాతాపిని కూడా వశపఱుచుకొన్నాడు.

దక్షిణాపథంలో సుప్రసిద్ధమైన రాజవంశాలలో పల్లవ వంశం ఒకటి, కాని ఈ పల్లవులు ఎక్కడివారో తెలియటం లేదు. వీరు పార్థియనులలోనివారో, తమిళ రాజవంశాలకు చెందినవారో కూడా తెలియదు.[2] అయితే వీరు శాతవాహనులకు సామంతులై ఉండి అశోకశాసనాలలో ఉదాహృతులైన పుళిందుల అనంతరం రాజ్యాధికారాన్ని చేపట్టినవారు కావచ్చును. ఈ "పల్లవ" (చిగురు) అనే శబ్దం ప్రాకృత సంస్కృత సమ్మిశ్రితమైన "తొండై" (తీగ) అనే శబ్దంనుంచి పుట్టినది. పల్లవ రాజధాని అయిన కాంచీనగరం చుట్టుప్రక్కల ప్రాంతాలకు "తొండైనాడు" అనే పేరు ఉండేది.

పల్లవచరిత్ర నాలుగుదశలుగా విభజింపవచ్చును. మొదటిది ప్రాకృతశాసనయుగం నాటిది. రెండవది సంస్కృత శాసన

---

[1] ఇతను తన తమ్ముడైన విష్ణువర్ధనుణ్ణి తూర్పున నెల్లూరునుంచి విశాఖపట్టణం వరకూ తాను జయించిన దేశానికి రాజప్రతినిధిగా నియమించాడు ఈ విష్ణువర్ధనుడు కొంతకాలానికి స్వతంత్రుడై తూర్పు చాళుక్యులకు మూలపురుషుడైనాడు. వాతాపి చాళుక్యవంశం చాలాకాలం రాజ్యంచేసి చివఱకు రాష్ట్రకూటులవల్ల పదభ్రష్టత పొందింది.

[2] ఇండోపార్థియను శాఖకు చెందిన ఒక తెగవారు పల్లవులకు మూలపురుషులైయుండవచ్చును. వీరు శాతవాహనులకు సామంతులై తర్వాత పల్లవులనే పేర స్వతంత్రులైయుండవచ్చును.

యుగం నాటిది. మూడవది పల్లవాభ్యుదయం వివరించే పురాణ గ్రంథాల నాటిది. చివరిది పల్లవ పతనకాలం నాటిది. ప్రాచీన పల్లవరాజులలో ఒకడైన విష్ణుగోపుడు రెండవ సముద్రగుప్తుని దక్షిణదేశ దండయాత్రలో అతనికి సాయపడ్డాడు.

పల్లవచరిత్రలో ఉజ్జ్వలమైన మూడవదశ సింహవిష్ణువు (క్రీ. శ. 574 – 600 సం॥) తో ప్రారంభమైనది. ఇతను చోళులనూ, పాండ్యులనూ జయించి, తన రాజ్యాన్ని దక్షిణ దిశను విస్తరింపజేశాడు. ఇతనికుమారుడే సుప్రసిద్ధుడైన ఒకటవ మహేంద్రవర్మ. (క్రీ. శ. 600 – 630 సం॥) ఇతను కవీ, గాయకుడూ, అనేకశిల్పకళాఖండాలను నిర్మింపజేసినవాడూను. పల్లవచక్రవర్తులలో ఇతను అసమానఖ్యాతి గడించాడు. ఇతనికాలంలోనే రెండవపులకేశి పల్లవరాజ్యంలోని ఉత్తర భాగంమీదదండెత్తి వేంగీనగరాన్ని స్వాధీనపఱుచుకొన్నాడు. అయితే పుల్లలూరుదగ్గఱ మహేంద్రవర్మ పులకేశిని అడ్డగించాడు. ఈ మహేంద్రవర్మ తర్వాత ఇతనికుమారుడు ఒకటవ నరసింహవర్మ రాజ్యానికి వచ్చాడు. (క్రీ. శ. 630 – 668 సం॥) ఇతనూ సుప్రసిద్ధుడే. ఇతను చేర, చోళ, పాండ్యరాజులనూ, సింహళరాజులనూమాత్రమేకాక చాళుక్యులనుకూడా ఓడించి, చాళుక్యరాజధానిఅయిన వాతాపీనగరాన్ని పట్టుకొన్నాడు. హర్షచక్రవర్తిని ఓడించిన రెండవపులకేశి ఇతనిచేతులలో పరాజితుడై అంతరించాడు. బహుశః అతను యుద్ధభూమిలో మరణించియుండవచ్చును. తండ్రివలెనే ఈ నరసింహవర్మకూడా శిల్పకళను బాగా పోషించాడు. మామల్లపురంలో ఎన్నో గుహాలు తొలిపించి దేవాలయాలుగా నిర్మింపజేశాడు. ఇతని బిరుదుపేర ఆ చోటికి మహామల్లపురం అనే పేరు వచ్చింది.

చాళుక్య పల్లవ సంఘర్షణ రెండవపులకేశితో అంత రించలేదు. తర్వాతకూడా ఉభయసంతతులవారూ ఘర్షణ పడుతూనేఉన్నారు. ఒక్కొక్కప్పుడు చాళుక్యులు పల్లవులను ఓడించేవారు. ఇంకొకప్పుడు అధికనష్టంతో పరాజితులయ్యే వారు. అయితే అదృష్టవశాత్తూ విజయాదిత్యచాళుక్యుడు సింహాసనం ఎక్కినతర్వాత (క్రీ. శ. 696 – 733 సం॥) ఈ రవర వలు అంతమై దేశం శాంతియుతమైనది. ఇతనికి సమకాలికు డయిన పల్లవరాజు రెండవనరసింహావర్మ (క్రీ.శ. 680–720సం॥) కూడా శాంతిప్రియుడే. వీరిద్దఱూ నిర్మాణాత్మక కార్యాల్లో మనస్సు చొప్పించి ప్రజలను చల్లగా పాలిస్తూ అనేక సుందర దేవాలయాలను నిర్మించారు.

కాని రెండవ విక్రమాదిత్య చాళుక్యుడు (క్రీ.శ. 733సం॥ 744సం॥) తిరిగి పల్లవులతో యుద్ధాలు ప్రారంభించాడు; "పల్లవమల్ల" బిరుదాంకితుడైన రెండవ నందివర్మ (క్రీ.శ. 744 సం॥—766) కాలంలో కాంచీనగరాన్ని పట్టుకొన్నాడు. ఈ రెండవనందివర్మ అటుపాండ్యులతో కూడా తీవ్రంగా పోరాడ వలసివచ్చింది. చివఱకు చాళుక్యరాజు కాంచీనగరానికి కొంత నష్టంకలిగించినా, దేవాలయాలనుంచి దోచుకొన్న ఆభరణా లను తిరిగి ఇచ్చివేసి ప్రజలను సంతృప్తిపరచాడు. ఈవిక్రమాది త్యుడు రాజ్యవిస్తరణంకంటె పరాక్రమ ప్రదర్శనం చేతనే తన చాళుక్యవంశానికి కీర్తి తేవాలనే పట్టుదలకలవాడు; కనుక తిరిగి పల్లవరాజుకు రాజ్యం ఇచ్చివేశాడు. చాళుక్యరాజులలో చిట్టచివరి సమర్థుడైన రాజు ఇతను మాత్రమే. ఇతని కుమారు డైన కీర్తివర్మ రాష్ట్రకూటులతో పోరాడుతూ పదభ్రష్టుడై

నాడు. అంతటితో 8వశతాబ్ది సగపడ గడచేసరికి వాతాపి చాళుక్య సామ్రాజ్యం అంతరించింది.

క్రీ.శ. 4వశతాబ్దినుంచీ ఆభీరులనుంచి పుణికిపుచ్చుకొన్న ధైర్య స్థైర్యాలతో రాష్ట్రకూటులు దక్కనులో ప్రాముఖ్యం సంపాదించుకోవటం మొదలుపెట్టారు. దక్కను చరిత్రకాలంలో విభిన్నసమయాలలో విభిన్న ప్రదేశాలలో రాజ్యాలు పాలించారు. మానాపుర రాష్ట్రకూటులు క్రీ.శ. 5,6 శతాబ్దాలలో మధ్యభారతం పాలించారు. బీరారు రాష్ట్రకూటులు 7 8 శతాబ్దాలలోనూ, మల్ఖేడ్ రాష్ట్రకూటులు 9వ శతాబ్దంలోనూ ప్రాబల్యం వహించారు. యాదవుల సంతతివారే రాష్ట్రకూటులనికాని, మహారాష్ట్ర వాసులే రాష్ట్రకూటులనికాని చెప్పటం సమంజసంకాదు. 'రాష్ట్రాధికారి' అని అర్థం ఇచ్చే "రాష్ట్రకూట" శబ్దం చాళుక్య శాసనాలలో కనబడుతున్నది. కాబట్టి చాళుక్యరాజ్యాలలో రాష్ట్రాధికారులుగా ఉన్నవారే తర్వాత తర్వాత రాష్ట్రకూట నామంతో ఏర్పడ్డవంశానికి మూలపురుషులై ఉంటారు. రాష్ట్రకూటులభాష కన్నడం కనుక శాతవాహన కాలంలోనో తరువాతనో కన్నడప్రాంతానికి అధికారి అయిన ఒక ఉన్నతోద్యోగి సంతతివారే రాష్ట్రకూటులై ఉండవచ్చును.

ప్రాచీన చాళుక్యులు బలవత్తరులుగా ఉన్న కాలాన రాష్ట్రకూటులు వారికి అనుచరులై ఉన్నారు. క్రీ. శ. 752 వ సంవత్సరంలో దంతిదుర్గుడు అను రాష్ట్రకూట రాజు

చాళుక్యరాజైన రెండవ కీర్తివర్మను ఓడించినప్పటి నుంచీ రాష్ట్రకూటుల ప్రాబల్యం హెచ్చింది. దంతిదుర్గుని అనంతరం సింహాసనం ఎక్కిన ఒకటవ కృష్ణుడు (క్రీ. శ. 756 వ సం॥ –775 సం॥) చాళుక్య ప్రభుత్వాన్ని పూర్తిగా కూలద్రోసి, తన రాజ్యం అన్ని దిక్కులా విస్తరింప జేశాడు. మొట్టమొదట దక్షిణ కొంకణాన్ని తర్వాత గాంగులనూ జయించాడు. చివ అను తూర్పు చాళుక్యుల రాజ్యాలను కూడా జయించాడు. ఇతను ఎల్లోరాలో కైలాసం అనే దేవాలయం నిర్మించాడు. ఇతని తర్వాత సుప్రసిద్ధుడైన రాష్ట్రకూట రాజు ధ్రువుడు(క్రీ.శ 780 సం। –794 సం।). ఇతను పల్లవుల మీదనూ మాళవ దేశపు ఘూర్జరుల మీదనూ, వంగదేశపు పాలుల మీదనూ దండయాత్రలు చేసి విజయ లక్ష్మిని వరించాడు. మూడవ గోవిందుడు (క్రీ. శ. 794 సం।–814 సం। ) రాష్ట్రకూటరాజు లందరిలోనూ పరాక్రమ వంతుడని ప్రసిద్ధి గన్నవాడు; పల్లవు లనూ, తూర్పుచాళుక్యులనూ, కనోజ్ వంగ రాజులనూ ఓడించాడు. ఇతని విశాల సామ్రాజ్యం వింధ్య పర్వతాల దగ్గఱ నుంచి తుంగభద్రవఱకూ కల దక్కను అంతటా విస్తరించింది. ఒకప్పుడు పశ్చిమ భారతంలో రాష్ట్రకూటుల ప్రాబల్యం అత్యధికంగా ఉండేది. క్రీ. శ. 9 వ శతాబ్దంలో భారత దేశానికి వచ్చిన ఒక అరేబియా దేశస్థుడు ఆకాలంలో "ప్రపంచ ప్రసిద్ధులైన నలుగురు చక్రవర్తులలోనూ రాష్ట్రకూట చక్రవర్తి ఒక" డని పేర్కొన్నాడంటే ఆనాటి రాష్ట్రకూటులు ఎంత బలవంతులో ఊహించుకో వచ్చును.

గోవిందుని కుమారుడైన అమోఘవర్షుడు (క్రీ.శ.815సం॥ 878 సం॥) వాతాపి చాళుక్యుల ప్రభుత్వాన్ని సమూలంగా నశింపజేశాడు. కాని గాంగులతో జరిగిన పోరాటంలో వెను కంజవేసి గాంగరాజుకు తనపుత్రికనిచ్చి వివాహంచేశాడు. ఇతను జైనమతసిద్ధాంతాలననుసరిస్తూ, కర్ణాటభాషను పోషించినవాడూను. యుద్ధాలకంటె శాంతినే వాంఛించిన వాడు. అయితే తన సుదీర్ఘ జీవితంలో రాష్ట్రకూటవంశ ధీర త్వానికి ఎన్నడూ అపఖ్యాతి తీసికొనిరాలేదు. 10వ శతాబ్దం సగం గడిచేవఱకూ రాష్ట్రకూటుల బలం చెక్కుచెదఱలేదు. అటుతర్వాత మాళవపాలకులైన పరమారులు రాష్ట్రకూట రాజ్యంమీదికి దండెత్తారు. ఆ సమయంలోనే తైలపుడనే చాళుక్యసామంతుడు రాష్ట్రకూటప్రభుత్వాన్నే నిర్మూలిం చాడు. కల్యాణీ పశ్చిమ చాళుక్యవంశ ప్రభుత్వాన్ని క్రీ. శ. 975 సం॥లో సంస్థాపించాడు.

ఒక్కసారి పల్లవచరిత్రవైపు దృష్టి మళ్ళిస్తే పల్లవ మల్లుని పుత్రుడు దంతివర్మ (క్రీ. శ. 755 – 826 సం॥) రాష్ట్ర కూటరాజైన మూడవగోవిందునిచేత పరాజితుడు కావటమే కాక, పాండ్యులవల్లకూడా ఇఱుకునపడ్డాడు. కాని దంతివర్మ కుమారుడైన మూడవనందివర్మ (క్రీ. శ. 844 – 866 సం॥) ప్రతాపశాలి కావటంవల్ల పాండ్యులను తెల్లారువద్ద ఓడిం చాడు. నందివర్మ కుమారుడు నృపతుంగుడు (క్రీ॥ శ॥ 866 – 896 సం॥) తండ్రి గెలుపువల్ల విశేషలాభం పొందాడు. పుదు

కోట్టుకుంటూ దక్షిణదిశను తనరాజ్యం నిరాటంకంగా విస్తరింపజేసుకొన్నారు. పల్లవరాజులలో చివరివాడు అపరాజితుడు. (క్రీ॥ శ॥ 879 - 897 సం॥) ఇతను కుంభకోణంవద్ద పాండ్యులను ఓడించాడు. కాని చోళరాజైన ప్రథమాదిత్యుని చేతిలో పరాజితుడైనాడు. అందువల్ల తొండైనాడుమీద పల్లవుల అధికారం నశించింది. అప్పటినుంచీ పల్లవులు బలహీనులై కొంతకాలంవరకూ సామాన్యరాష్ట్రాధిపతులుగా కాలక్షేపం చేశారు.

పల్లవులకు ప్రక్కలోబల్లెములవంటి పాండ్యుల చరిత్ర సామాన్యమైనదికాదు. సంగంయుగానికి తర్వాత "కలాభ్రులు" అనేవారివల్ల చేర చోళులతోపాటు పాండ్యులుకూడా కొన్ని యిక్కట్లకు గురిఅయినారు. క్రీస్తుశకం 4 వ శతాబ్దంనుంచి 6 వ శతాబ్దంవరకు మొత్తం తమిళాహాన్ని చికాకుపెట్టిన ఈ కలాభ్రులు కర్ణాటకప్రాంతీయులు అని తోస్తున్నది. ఈ కలాభ్రుల ఒత్తిడినుంచి తమిళాహానికి విముక్తి కల్గించిన ఘనత పాండ్యరాజతిలకమైన కడుంగన్ (క్రీ॥ శ॥ 590 - 620 సం॥)కు దక్కింది.

కడుంగన్ తర్వాతవారు అప్రతిమాన శక్తిసామర్థ్యాలతో చేరులతోనూ, అయీలతోనూ, పోరాడి తమ అధికారాన్ని స్థిరపరచుకొన్నారు. పల్లవులు పాండ్యులకు ఆగర్భశత్రువులైనారు. అట్టివారిని పాండ్యులు చాళుక్యులతోకలసి తీవ్రంగా ప్రతిఘటించారు. ఆవిధంగా అరికేసరిమారవర్మ

(క్రీ॥ శ॥ 670 – 700 సం॥) ప్రథమ విక్రమాదిత్య చాళుక్యుని సాయంతో పల్లవులతో యుద్ధంచేశాడు కానీ ప్రయోజనం లేకపోయింది. కాని క్రీ॥ శ। 730 వ సంవత్సరంనుంచి 765 వ సంవత్సరం వఱకు పాండ్యదేశాన్ని పాలించిన ప్రథమ రాజ సింహుడు నందివర్మ పల్లవమల్లుని అనేకపర్యాయాలు ఓడించి కొంత కాలం నంది గ్రామంలో చెఱసాలలో నిర్బంధించాడు. తర్వాత పల్లవ మల్లుడు కొంగుచేర రాజుల మైత్రి సంపాదించి మళ్ళీ ఎదురు తిరుగగా అప్పటి పాండ్య రాజైన ప్రథమ వర గుణుడు (క్రీ. శ. 765 సం।–815 సం।) శత్రురాజులతో సమానంగా బలగం పెంచుకొని వారిని పూర్తిగా ఓడించాడు కాని వరగుణుని తర్వాత సింహాసనాధిష్ఠితుడైన అతని కుమారుడు శ్రీమార శ్రీవల్లభుడు (క్రీ. శ. 815 సం।–862 సం।) కొద్ది కాలంలోనే మూడవ నందివర్మ చేత పరాజితుడైనాడు. అటు తర్వాత తిరిగి బలం చేకూర్చుకొని శ్రీపురంబియం వద్ద పల్లవులను గెలచాడు. కాని ఈ నిరంతర యుద్ధాల వల్ల ఉభయులూ బలహీనులై చోళులు తల యెత్తక ముందే విస్మృతులైనారు.

ఇక క్రీస్తుశకం ఆఱవ శతాబ్దంనుంచి పదో శతాబ్దం వఱకూ చేరుల ప్రాభవం ఎల్లా ఉండేదో ఒక్కమారు పరిశీలిద్దాం. సంగం యుగానంతరం కొన్నిశతాబ్దాలవఱకూ చేర చరిత్ర అయోమయం. మళయాళ కావ్యం కేరళోల్పత్తీ సంస్కృతకావ్యం కేరళమాహాత్మ్యమూ 18వ శతాబ్దంనాటివి. అవి చారిత్రికదృష్టితో బయలుదేఱినవికావు కనుక వాటిని

బట్టి చేరచరిత్ర ఇదీ అనటానికి వీలులేదు. కలాభ్రుల ఒత్తిడివల్ల ఏర్పడిన విషమ పరిస్థితులనుబట్టి కేరళం తమిళదేశ రాజకీయా లకు కొంతకాలంపాటు దూరమై ఉండవచ్చును. ఈతాటస్థ్యం క్రీ॥శ॥ 4,5 శతాబ్దాలలోనిది అయి వుంటుంది. కేరళలలో నంబూద్రులు ప్రవేశించిన తర్వాత పరిస్థితులు మారిపోయి నాయి. నంబూద్రులు ఆస్యులైనప్పటికి ఆర్యజాతి దక్షిణ భారతానికి సుసంఘటితంగా తరలి రావటానికి ముందే వారు వచ్చినట్లు కనబడుతుంది. కేరళోత్పత్తికావ్యాన్నిబట్టి విచారిస్తే నంబూద్రులు ఉత్తరభారతంనుంచివచ్చినవారుకాదనీ, దక్కను నుంచే దక్షిణానికి వచ్చిన వారనీ తెలుస్తున్నది.

నంబూద్రులరాకతో కేరళం సాంఘికరాజకీయ మత సంప్రదాయములన్నింటిలో అద్భుతమైనమార్పువచ్చింది. రాజులను సింహాసనం ఎక్కించటంలోగానీ, పదభ్రష్టులను చెయ్యటంలో గానీ వారు అద్భుతపాత్ర నిర్వహించారు. పరశురాముడు ప్రాచ్యభారతంనుంచి భాను విక్రముడనే రాజకుమారుణ్ణి తీసి కొనివచ్చి, కేరళ రాజ్యాధిపతిగాచేసి, అతని తమ్ముణ్ణి ఉత్తర కేరళంలో రాజప్రతినిధిగా నియమించినట్లు పురాణం చెప్తు తున్నది. తర్వాతకొంత కాలానికి రాజుకూ నంబూద్రులకూ వైమనస్యం కలిగి, అతన్ని పదభ్రష్టుణ్ణిచేసి తామే పరిపాలనా భారం వహించారు. పిమ్మట తిరునవైలో సమావేశమై కేయ పెరుమాళ్ అనే అతన్ని పర్వతపంక్తికి తూర్పు ప్రాంతంలో నివసించేవానిని తమకు రాజుగా ఎన్నుకొన్నారు. ఈపెరుమాళ్

వంశంలోనివారు ఇరవైఅయిదుగురు కేరళాన్ని పాలించినట్లు ప్రసిద్ధి ఈపెరుమాళ్లలో ఉత్తర కేరళాధిపత్యం వహించిన వారు కొందఱూ, దక్షిణ కేరళాధిపత్యం వహించివారు కొందఱూగా మొత్తంమీద రెండుశాఖలు ఉన్నాయేమో! కాని పెరుమాళ్ వంశంవారు కొంతకాలం కేరళాన్ని పాలించి నట్లు మాత్రం కనబడుతుంది. దేశానికి బయటనుంచి రాజులను ఎన్నుకొవటం అనేది బహుశః ఇరుగుపొరుగు ప్రాంతాలనుంచి దండెత్తివచ్చి విజేతలయిన వారికి విధేయులై సింహాసనం సమర్పించటమే కావచ్చును.

పెరుమాళ్ రాజులలో కులశేఖర్ ఆళ్వార్ రాజ్య పరి పాలనా చాకచక్యంచేతనూ, మతసంబంధ సారస్వతసృష్టివల్లను సుప్రసిద్ధుడైనారు. అతను యోగి అయినప్పటికీ ఇహ జీవితం కూడా విజయవంతంగా నిర్వహించాడు. అతను రచించిన కొన్నిపద్యాలవల్ల చేర చోళ పాండ్యరాజులు అతని సార్వ భౌమత్వం అంగీకరించినట్లూ, కొంగునాడూ కిల్లిమలైలమీద కూడా అతని అధికారం చెల్లుతూఉండినట్లూ తెలుస్తున్నది. అయితే కులశేఖరఆళ్వార్ ఏనాటివాడో నిశ్చయించటానికి ఆధారాలు లేవు. అనేకులు అనేకవిధాల అభిప్రాయపడ్డారు. కొంతమంది అతను క్రీస్తుశకం 6 వ శతాబ్దంనాటివాడంటే మఱి కొందఱు తొమ్మిదవశతాబ్దంలోనివా డన్నారు. ఇంకా కొంత మంది ఇంకొకవిధంగా చెప్పారు. మొత్తంమీద అతను ఈ 6, 9 శతాబ్దాలమధ్య ఎప్పుడో ఉండిఉండాలి. అయితే

పాండ్యులు బలహీనులుగా ఉన్నది క్రీ. శ॥ 6వశతాబ్దంలో మాత్రమే. ఆతర్వాత వారిరాజ్యం పటిష్ఠమైనది. అందుచేత కులశేఖర ఆళ్వార్ వారిని జయించటం 6వశతాబ్దంలో జరిగి ఉండాలిగాని అటుతర్వాతకాదు. ఇంతేకాక అతని కవిత్వం ప్రాచీనమైనదిగానే కనబడుతున్నదిగాని ఆఱవ శతాబ్దానికి తర్వాతదిగా కనబడటంలేదు. ఈకారణంవల్ల కులశేఖరఆళ్వార్ 6వశతాబ్దంవాడే అయి ఉంటాడు.

క్రీ. శ. 7 వ శతాబ్దం నుంచి 9 వ శకాబ్దం వఱకూ పల్లవులూ, పాండ్యులూ కేరళం పైాద తఱచూ దండెత్తేవారు. చాళుక్యులూ రాష్ట్రకూటులూ కూడా అప్పుడప్పుడు ముట్ట డించేవారు. సింహవిష్ణువూ, నరసింహవర్మ, మహామల్లుడూ, ద్వితీయ నందివర్మ పల్లవ మల్లుల శాసనాలవల్ల వారు చేర దేశాన్ని జయించినట్లు తెలుస్తున్నది. ఆనాటి తమిళ కావ్యం "నందిక్కలంబకం" వల్ల తృతీయ నందివర్మ రాజ్యం చేర దేశంలో కూడ వ్యాపించినట్లు కనబడు తున్నది. అయితే ఈ విషయాలను ధ్రువపఱచదగిన చేర దేశపు గ్రంథాలుగానీ మతే ఆధారాలుగానీ లేక పోవటం శోచనీయం. బహుశః ఈ దండయాత్రలు మెఱపు దాడులుగా జరిగి ఉంటాయి. అలు తే ఈ రెండు రాజ్యాలకూ సాంస్కృతిక సంబంధం ఏర్పడినట్లు మాత్రం నిదర్శనాలు కనబడు తున్నాయి. మహేంద్ర వర్మ రచించిన "మత్తవిలాస ప్రహసనం" అనే హాస్య రూపకం కేరళ దేశంలోని చాకియాల్ నటులకు అత్యంత అభిమాన




1 నైసర్గిక దేశపటము
2 వింధ్యపర్వతములు
3 మెయికల్ కొండలు
4 నర్మదానది
5 సాత్ పురా
6 మహాదేవకొండలు
7 తపతినది
8 మహానది
9 గోదావరి
10 తూర్పుకనుమలు
11 కృష్ణానది
12 ఉత్తర పెన్నానది
13 పాలారు
14 దక్షిణ పెన్నానది
15 కావేరి
16 వైగై
17 తామ్రపర్ణి
18 కన్యాకుమారి
19 కొలంబో
20 జాఫ్నా
21 లంక
23 తిరువనంతపురం
23 క్యాలికట్
24 మంగళూరు
25 మైసూరు
26 గోవా
27 పూనా
28 బొంబాయి
29 అరేబియాసముద్రము
30 హిందూమహాసముద్రము
31 బంగాళాఖాతము
32 చెన్నపట్టణము
33 బెంగుళూరు
34 అనుమలై కొండలు
35 మధుర
36 పెరియారనది
37 నీలగిరి
38 పడమటకనుమలు

క్రీ॥ పూ॥ 200, 300 మధ్యకాల దక్షిణ భారత దేశము

పాత్రం అనే విషయం సువిదితమే. కాంచీ పల్లవ చరిత్ర ఆధారంగా దండి మహాకవి రచించిన "అవంతీ సుందరి కథ" లో కేరళ దేశం గూర్చిన ప్రస్తావనలు చాలా ఉన్నాయి. వాటిని బట్టి ఆ మహాకవికి కేరళదేశం సుపరిచితం అని తోస్తుంది ఈ 'అవంతీ సుందరి కథ' అనేది దండి మహాకవి మిత్రుడైన ఒక బ్రాహ్మణ విద్వాంసుని సంగ్రహ చరిత్ర. ఆ బ్రాహ్మణుడు కవితో పల్లవరాజ సంస్థానానికి వెళ్ళి ఉంటాడు. శిల్ప కళ విషయంలో కూడ గమనార్హమైన ఒక విషయం ఉన్నది. కేరళ దేశంలో కొండగుహాలలో నిర్మించబడిన ఆలయాలలో పల్లవ శిల్పకళ ప్రభావం ప్రసరించింది. తిరువాన్కూరు మధ్య భాగంలోని కరియూరు వద్దనూ, దక్షిణ తిరువాన్కూరులోని తిరునందిక్కరై వద్దనూ నిర్మితాలైన దేవాలయాలు ఇందుకు నిదర్శనాలు.

క్రీ॥ శ॥ 7, 8 శతాబ్దాలలోని పాండ్యరాజులు చేర దేశం మీద అనేకపర్యాయాలు దండయాత్రను చేశారు. జయంత వర్మ ( క్రీ॥ శ॥ 645 – 670 ) చేర దేశాన్ని జయించినట్లు సూచితమయే "వానవ" అనే బిరుదం వహించాడు మహా వీరుడైన అరికేసరివర్మ పరాంకుశుడు (క్రీ॥ శ॥ 670–700 సం॥) అనేకపర్యాయాలు చేరరాజును ఓడించి చివరకు అతన్ని ప్రాణాలతో పట్టుకొన్నాడు. కోకాదయ రణధీరుడు ( క్రీ॥ శ 700– 780 సం॥) కూడా "వానవ" బిరుదం ధరించాడు నెడుంజయని (క్రీ॥ శ॥ 705–815 సం॥) వేనాడును జయించి

నట్లు ఒక శాసనాన్నిబట్టి తెలుస్తున్నది. ఈశాసనం ఇప్పుడు మదరాసుమ్యూజియం (వస్తుప్రదర్శనశాల) లో ఉన్నది. ఈ శాసనంలో "వేనాడు" "వెల్నాడు" అని ఉదాహృతమైనది. ఆయీలచరిత్రనుబట్టి అయి వెల్ రాజధాని ఈ వెల్నాడు రాజధానికి సమీపంలోనేఉండేదనితర్వాత క్రీ॥శ॥9వశతాబ్దంలో ఆ పేరు మారినదని స్పష్టపడుతున్నది. పాండ్యరాజులు దండయాత్రలను ఎదురుకోవటంకోసం చేరులు అయీకీలతో డ్వాటు పొందినట్లు కనబడుతున్నది. అందువల్ల ఈ ఆయీలు లేక వేనాడురాజులు చేరరాజులకు సామంతులై ఉండవచ్చును. వేనాడును జయించిన పాండ్యరాజులు కేరళాన్ని లేక చేరదేశాన్ని జయించినట్లు శాసనాలలో వ్రాయించుకొన్నారు. శ్రీమారసింహవల్లభుడు (క్రీ॥శ॥ 815సం॥– 862సం॥)కూడా తన ఇతర విజయాలతో బాటు కేరళాన్నికూడా జయించినట్లు ప్రసిద్ధుడైనాడు. ఇతను దక్షిణ తిరువాన్కూరులోని కున్నూరువద్దనూ, విలింజంవద్దనూ గొప్ప విజయాలు పొందినట్లు తెలుస్తున్నది.

కేరళం చాళుక్యుల దృష్టిపథంలోకూడా పడ్డది. పల్లవులతో చేసిన యుద్ధాలలో పశ్చిమచాళుక్యులు పాండ్య చోళరాజులతో బాటు కేరళరాజులనుకూడా జయించారు. ప్రథమ విక్రమాదిత్యుడు (క్రీ॥శ॥ 635సం॥–681 సం॥) దక్షిణ దిగ్విజయయాత్రకు బయలుదేరినప్పుడు చేరచోళపాండ్యరాజులను ముగ్గురినీ ఎదురుకోవలసివచ్చింది. చివరకు ఆముగ్గురినీ జయించాడు. వినయాదిత్యుడు, ప్రథమవిక్రమాదిత్యుడు

ద్వితీయకీర్తివర్మఈముగ్గురుకూడా చేరవిజేతలుగా ప్రసిద్ధులైనారు. ఈవిజయాలు అన్నీ చాళుక్యశాసనాలవల్ల తెలుస్తున్నవే కాబట్టి ఇవి ఎంతవఱకు నిజమో చెప్పలేను.

చాళుక్యులను అనుసరించి రాష్ట్రకూటులుకూడా చేర దేశంమీద దండెత్తారు. చేరులను ఓడించిన రాష్ట్రకూటరాజు లలో దంతిదుర్గుడు ముఖ్యుడు. ఇతను కేరళరాజులను సపరి వారంగా లోబఱుచుకొన్నాడు. ఇతని తర్వాత మూడవ గోవిందుడు (క్రీ॥శ॥ 783సం॥-814సం॥) కేరళాన్ని ముట్టడించి ప్రజలను అనేకవిధాల భయపెట్టాడు. చివఱకు మూడవ కృష్ణుడు (క్రీ॥శ॥ 937సం॥-965సం॥, దక్షిణదేశపురాజులను అందరినీ లోబఱుచుకొన్నాడు.

పెరుమాళ్ రాజులలో చివరివాడు చేరమన్ పెరుమాళ్ శైవయోగి అయిన సుందరమూర్తికి సమకాలికుడు. అందు వల్ల ఇతను 8వశతాబ్ది ఉత్తరార్ధంలోగానీ, 9వశతాబ్దం మొదటిపాతిక సంవత్సరాలలోగానీ జీవించి ఉండాలి. ఇతని చరిత్రలో ముఖ్యంగా గమనించవలసిన విషయం ఒకటి ఉన్నది. జైనులూ, క్రైస్తవులూ, ముస్లిములూ, శైవులూకూడా ఇతని ఆదరం పొందినవారే. ఇతను మహమ్మదీయమతం అవలంబించి మక్కాయాత్రకూడాచేసినట్లు ప్రతీతి ఉన్నదిగాని, ఇందుకు తగిన నిదర్శనాలు మాత్రంలేవు. కాని అతను ఏదోఒకమతాన్ని గాఢంగా విశ్వసించి ఇహభోగాలయందు విరక్తుడు అయి ఉండ వచ్చును. అతను తన రాజ్యాన్ని బంధువులకూ సామంతులకూ

పంచిపెట్టాడన్న ప్రతీతికూడా ఉన్నదిగానీ, అదీ యెంతవఱకు సత్యమో చెప్పలేము. అయితే అతని అనంతరం రాజ్యంభిన్నా భిన్నమైంది. చిన్నచిన్న రాజులు చాలామంది బయలుదేరారు. చివఱకు చేరరాజు సంతతివాడైన ఒకరాజు మొత్తందేశాన్ని స్వాధీన పఱచుకొన్నాడు.

మఱొక పెద్దసందేహం ఏమంటే చేరమన్ పెరుమాళ్ తాను మక్కాయాత్రకు బయలుదేఱే సమయంలో కొల్లం శకాన్ని ప్రారంభించి ఉంటాడా అని. ఈశకంలో శంకరా చార్యుని పేరుకూడా ఉదాహరించటం ఎలాసంభవించిదో!కొల్లం తోనివల్ల కొల్లం అభ్యుదయంతో ఈశకం ప్రారంభమైనదని తెలుస్తున్నది. క్విలన్‌లో యూదువర్తకసంఘం ఒకటి ఏర్పడి నట్లూ, ఆవాణిజ్యంయొక్క క్రమాభ్యుదయం ఉద్దేశించే ఈ నూతన శకం ఏర్పాటైందనీ ఊహించవలసివస్తున్నది, ఇటు తర్వాత రెండుశతాబ్దాలకు ప్రథమ కులోత్తుంగుని సేనాని "నరలోక వీరుడు" "కొల్లం" నగరాన్ని ధ్వంసంచేసి "కొల్లం అలిందాఅందూ" అనే మరొక శకాన్ని సృష్టించినట్లు కనబడుతూ ఉండడంవల్ల పై ఊహాబలపఱుచుకోటానికి వీలు కలుగుతున్నది. అంతకుముందు "కొల్లంశకం" అనేది వెలసి ఉన్నట్లు అతను గుర్తించటంవల్లనే తన విజయానికి చిహ్నంగా దానిని ఇలామార్చి ఉండవచ్చును.

పరిపాలన:- ఈకాలంలో దక్షిణదేశపురాజ్యాలన్నిటి లోనూ పరిపాలన ఒకేవిధంగా ఉండేది. సార్వభౌమత్వంకానీ,

రాజత్వం కానీ వంశపారంపర్యంగా రాజుకువచ్చేది. ఔరస పుత్రుడు లేనప్పుడు సింహాసనంకోసం తగవులు ప్రారంభ మయేవి. అటువంటి సమయాలలో మంత్రులూ, తదితరులయిన పెద్దలూ జోక్యంచేసికొని ఆతగవులనుపరిష్కరించేవారు. క్రీ.శ 731వ సంవత్సరంలో పరమేశ్వరవర్మ పల్లవుడు స్వర్గస్థుడైనప్పుడు ప్రధానులూ, "ఘటికులు" అని వ్యవహారంకల బ్రాహ్మణ విద్వాంసులూ సమాలోచనలుచేసి రాజవంశానికి దగ్గఱి వాడైన నందివర్మ అనే రాజకుమారుణ్ణి రాజుగాఎన్నుకొన్నారు.

ప్రజల శాంతిభద్రతలను కాపాడవలసిన బాధ్యతమహా రాజుది. అందువల్ల రాజుఅంటే ప్రజలకు కల గౌరవం ఇంతా అంతాకాదు. ఈ కాలంలో రాజసభలయందు ఆర్యసంప్ర దాయాలకు ఎక్కువ గౌరవం ఉండేది. రాజులు ఏమిచేసినా మనుస్మృతి నిబంధనలకు అనుగుణంగా వర్తించాలనీ, ధర్మ శాస్త్రజ్ఞుల సమ్మతితోనే రాజ్యవ్యవహారాలు పరిష్కారం చెయ్యాలనీ కట్టుబాట్లు వచ్చాయి. "ధర్మరక్షకుడు" లేక "న్యాయరక్షకుడు" అని అర్థం యిచ్చే "ధర్మాధిరాజ" అనే బిరుదం చాలామంది రాజులు వహించారు. ప్రభువు భగవం తుని ప్రతినిధిగా రాజ్యంచేయాలనే దృష్టితో ప్రభుత్వం ఏర్ప డకపోయినా, మతాచార్యులూ, పండితులూ, కవులూ, నీతి మంతులూ అయిన వారి అభిప్రాయాలకు అనుగుణంగా ఆస్తిక సంప్రదాయబద్ధంగానే ప్రభుత్వం సాగేది.

ఏదియేమైనా, తమ ప్రభుత్వపద్ధతే విస్తరింపజెయ్యా లనే ఆకాంక్షతో రాజులు యుద్ధాలు సాగించేవారు. రణ

శూరత, దిగ్విజయకాంక్ష రాజుల దండయాత్రలకు ప్రోద్బలం ఇచ్చేవి. నాటి యుద్ధపద్ధతులుకూడా ఆ కాలానికి తగినట్లు ఉండేవి. రథ, గజ, తురగ, పదాతులనే చతురంగబలాలు సైన్యానికి అతి ముఖ్యభాగాలు. యుద్ధాలకు ఉపయోగపడే రథాలు, రథికుడూ, సారథీ మాత్రమే కూర్చుండదగినంత చిన్నవిగా ఉండేవి. అయితే అసలు రథాలు యుద్ధాలలో ఉపయోగపడటం అంతగా లేదేమో అని సందేహించవలసి వస్తున్నది. సైన్యంలో గజబలానికి విశేష ప్రాముఖ్యం ఉండేది. కాంచీపురంలోని వైకుంఠ పెరుమాళ్ దేవాలయంలోని శిల్పాలు ఇందుకు నిదర్శనాలు. యుద్ధానికి ముందుగా ఏనుగుల చేత మద్యం త్రాగించటం హ్యూయాన్ త్సాంగ్ మహారాష్ట్ర దేశంలో గమనించాడు. ఆశ్వికదళంకోసం పర్షియా, అరేబియా మొదలయిన దేశాలనుంచి గుఱ్ఱాలను తెప్పించేవారు. ఆశ్వికులు వక్షస్థలంమీదుగా కవచం అమర్చుకొనేవారు; శిరస్త్రాణాలు ధరించేవారు. ఈటెలూ, చాకులూ, కత్తులూ ముఖ్యాయుధాలుగా ఉపయోగించేవారు. ఇక పదాతిదళం ఎంతఎక్కువగా ఉంటే సైన్యం అంత పటిష్ఠంగా ఉంటుంది. దీనిలోని సైనికులు పాదచారులై యుద్ధంచెయ్యవలసినవారుకనుక ఈ దళానికి ఈ పేరు వచ్చింది. కాల్బలంలో విశేషభాగం సామంతులు తీసికొనివచ్చినదే అయిఉండేది. నౌకాదళ నిర్వహణనుగూర్చి మాత్రం ఏమీ తెలియటంలేదు. కాని చాళుక్యుల పశ్చిమతీర విజయాలూ, పల్లవులు సింహళం, మాల్దీవులమీద చేసిన దండ

యాత్రలూ, పాండ్యుల విలింజం ముట్టడులూ గమనిస్తే నౌకా దళం ఆ రోజులలో అసాధారణంకాదని స్పష్టమౌతుంది.

ఇక ప్రజాపరిపాలనావిషయం విచారిస్తే ప్రతిరాజ్యానికీ ఒక అమాత్య పరిషత్తు ఉన్నట్లు కనబడుతున్నది. వైకుంఠ పెరుమాళ్ శాసనం ఒకటి "మంత్రిమండలి" అనేది ఉన్నట్లు చెప్పుతున్నది. "మంత్రిమండలి"అన్నా అమాత్యపరిషత్తన్నా ఒకటే. పాండ్య చాళుక్య పల్లవ కదంబ శాసనాలన్నిటిలోనూ మంత్రీ, ప్రధానుడూ, మహాసామంతుడూ, ఉత్తరమంత్రీ అనే ఉద్యోగులు ఉన్నట్లు కనబడుతున్నది. ఈ నాలుగురకాల ఉద్యోగులూ మంత్రులే. ఏ రాజ్యానికైనా ఒక్కమంత్రి మాత్రమే ఉండటం ఎక్కడా కనబడదు. రాజ్యపరిపాలనకు సంబంధించిన అన్ని అంశాలలోనూ ముఖ్యం అముఖ్యం అని లేకుండా రాజులు మంత్రులతో సంప్రదించేవారు. కదంబరాజు శివచిత్తుడు ప్రధానమంత్రితోనూ ఇతరమంత్రులతోనూకూడా సంప్రదించినమీదటనే ఏ సమస్యనైనా పరిష్కరించేవాడని ప్రతీతి. పాండ్యరాజు ప్రథమ రాజసింహుడు గాంగరాజకుమారిని తనయింటికి కోడలుగా చేసుకొనే సందర్భంలో మధురకవి అనే మంత్రిద్వారా పెండ్లి రాయబారాలు జరిపి, అతనివల్లనే ఆ యత్నంలో కృతార్థుడైనాడు. పల్లవరాజైన ద్వితీయ నంది వర్మ తనకు ప్రబలశత్రువైన చాళుక్యరాజుతో యుద్ధం చెయ్యటానికి మంత్రుల ఉపదేశంమీదనే సిద్ధపడ్డాడు.

చాళుక్య రాష్ట్రకూటరాజులు ప్రభుత్వాలలో విదేశాంగమంత్రిని "మహాసంధివిగ్రహికుడు" అనేవారు. ఇతర

రాజ్యాలతో యుద్ధంకానీ, స్నేహంకానీ నిర్వహించవలసిన బాధ్యత ఈ మంత్రిదే. మంత్రిమండలి అనేది కొన్ని బాధ్యత లను నిర్వహిస్తూ ఉండినట్లు స్పష్టమౌతున్నా, ఏ మంత్రి అధి కారం ఎంతవరకో నిర్ణయించటానికి ఆధారాలు లేవు. చాళుక్య రాష్ట్రకూటరాజుల శాసనాలనుబట్టి విదేశాంగ మంత్రి దేశపరిపాలనాశాఖలోకూడా కొంత బాధ్యత వహించి, రాష్ట్రాధికారిగానో, ప్రత్యేక కరగ్రాహిగానో (పన్నులు వసూలుచేసే అధికారి) పనిచేసేవాడని తెలుస్తున్నది. పల్లవ రాజ్యంలో ప్రధానమంత్రీ, రాజగురువూ ఒకరే అయిఉండే వారు. ఉభయ కార్యాలయాలనూ అతనే పర్యవేక్షణ చేసే వాడు. "సిరుత్తొండవర్మన్" నరసింహవర్మ పల్లవునికి అమా త్యుడుగానూ, సర్వసేనానిగానూ ఉద్యోగించాడు.

రాణులకు గొప్పగౌరవం ఉండేది. కొందరు రాణులు సాంఘిక కార్య కలాపాలలో పాల్గొనటమే కాకుండా, దేవా లయ నిర్వహణను సంస్కరిస్తూ, పర్వ దినాలలోనూ ఉత్సవ సందర్భాలలోనూ అనేక దాన ధర్మాలు చేస్తూ, నూతన దేవా లయాలు నిర్మిస్తూ, తటాకాలు త్రవ్విస్తూ, ఉండేవారనీ, భర్తలతోబాటు దండయాత్రలలో పాల్గొనేవారనీ కొన్ని గాంగశాసనాలు పేర్కొంటున్నాయి. రాష్ట్రకూట రాజైన ధ్రువునిరాణి శీలభట్టారిక సామ్రాజ్ఞి బిరుదంతో భూదానాలు చేసి తన పేరనే ప్రభుత్వోద్యోగులకు ఉత్తరువులు పంపేది. ద్వితీయ పులకేశి సోదరి "అక్కదేవి" అనే చాళుక్యరాజ

కుమారి ఒక రాష్ట్రానికి ప్రధానాధికారిణి కావటమేకాకుండా, యుద్ధాలలోకూడా పాల్గొనేది. కాంచీపురంలోని కైలాస దేవాలయ నిర్మాణం పల్లవరాజసింహునిరాణి స్వయంగాపర్యవేక్షించేది. అదేనగరంలోని ముక్తేశ్వరాన్ని కట్టించిందికూడా ఒక చక్రవర్తినే. ఆమె పల్లవమల్లునిరాణికావచ్చును.

రాష్ట్ర ప్రభుత్వ నిర్వహణ :- వాతాపి చాళుక్య ప్రభుత్వంలో మొట్టమొదటి సామ్రాజ్యాన్ని కొన్ని "విషయాలు"గా విభాగించారు. తర్వాత వాటికే "రాష్ట్రాలు" అనే పేరు వచ్చింది. సామ్రాజ్యం విస్తరించినకొద్దీ పెద్ద పెద్ద రాష్ట్రాలు ఏర్పడ్డాయి. పల్లవరాజ్యంలో పెద్దవిభాగానికి "విషయం" అనీ చిన్నవిభాగానికి అంటే ఈనాటి జిల్లావంటి దానికి "రాష్ట్రం" అనీ పేర్లుండేవి. రాష్ట్రకూటశాసనాలు పెద్దవిభాగాన్ని రాష్ట్రం అనీ దానికంటెచిన్నది "విషయం' అనీ, అంతకంటెచిన్నది "గ్రామం" అనీ పేర్కొంటున్నాయి. వేంగి మొదలయిన కొన్ని దక్కనురాజ్యాలలో రాష్ట్రంవంటి సామ్రాజ్యాంతర్భాగానికి "మండలం" అనిపేరు. కర్ణాటదేశంలోని కొన్ని విభాగాలకు "స్థలం" అనీ, ఇతరదేశాలలోని విభాగాలకు "కంపన" అనీ విషయానికి పర్యాయపదాలుగా ఉండేవి. రాష్ట్రానికీ జిల్లాకూ కల వ్యత్యాసాన్నిబట్టి దక్కను లోని వివిధరాజ్యాలలో వేఱువేఱు పేర్లు వాడుకలోఉండేవి. ఆవిధంగా కొన్ని రాజ్యాలలో జిల్లాకు "రాష్ట్రాలు" అనీ కొన్నింటిలో "విషయాలు" అనీ పేర్లుండేవి. చేర పాండ్య

రాజ్యాలలోని రాష్ట్రానికి "నాడు" అనీ, జిల్లాకు "కుట్టమ్" లేక "కొట్టం" అనీ గ్రామానికి "ఊరు""గ్రామం" అనీ పేర్లు.

రాజబంధువునుకానీ విశేషానుభవంకల రాజోద్యోగిని కానీ, సామంతరాజునుకానీ రాష్ట్రాధికారిగా నియమించేవారు. సాధారణంగా రాజుకు దగ్గఱిచుట్టాలనే రాష్ట్రాధికారులుగా నియమించటం జరిగేది. అన్ని రాజ్యాలలోనూ రాజకుమారుణ్ణిగానీ, సోదరుణ్ణిగానీ యువరాజుగా నియమించటం ప్రసిద్ధ సంప్రదాయం. ఈయువరాజు కనుక పరిపాలనా దక్షుడై ఉంటే ఇతనిని రాష్ట్రాధికారిగా నియోగించేవారు. రాష్ట్రాధికారులకు చాలా స్వాతంత్ర్యం ఉండేది. తమ క్రింది ఉద్యోగులను వారే నియమించుకొనేవారు. ఒకొ్కక్కప్పుడు రాష్ట్రాధికారి పదవి వంశపారంపర్యంగా వర్తించటం కూడా ఉండేది. అలా జరగటంవల్ల ఒకొ్కక్కప్పుడు రాష్ట్రాధికారులు స్వాతంత్ర్యం ప్రకటించుకొనటమున్నూ సంభవించేది.

స్థానిక ప్రభుత్వం:- దక్షిణభారతంలో విస్తృతమైన స్థానిక స్వయంపరిపాలనా పద్ధతిని గుఱించి తెలిసికొనవలసినది చాలా ఉన్నది. కాని చరిత్రకారులు "బ్రహ్మదేయాలు" అనే వాటికీ సాధారణ గ్రామాలకూ కలతేడాగుర్తించక అన్నింటినీ ఒకేరకంగాభావించటంవల్ల గ్రామపరిపాలనాపద్ధతిని విస్పష్టంగా వివరించలేకపోయారు. వాస్తవానికి గ్రామగ్రామానికీ సాధారణ సభ ఒకటి ఉండేది. తమిళనాడులో ఈసభకు "ఊరు" అని పేరు. కేరళలో "తార" అనీ తెలుగులో "గ్రామ" అనీ, కన్నడలో

"గామ" అనీ దీనికి పర్యాయపదాలు. సాలంకాయన శాస నాలలో "ముతుడు" అనేదీ, చాళుక్య నిర్మిత దేవాలయాలలోని శాసనాలలో "గ్రామకూటం" అనేదీ గ్రామణి సలహాలననుస రించి సాగుతూవచ్చిన గ్రామపరిపాలనను సూచిస్తున్నాయి. క్రీ॥శ॥ 9వశతాబ్దపు చరిత్ర సామగ్రివల్ల కేంళలో మూడురకాల స్థానిక ప్రభుత్వాలుఉన్నట్లు తెలుస్తున్నది. ఒకటి తార లేక గ్రామానికి సంబంధించినకూటం అనేది; ఇంకొకటి నాడు లేక జిల్లాకు సంబంధించినది. మూడవది మొత్తం కేరళదేశానికి సంబంధించినది. ఈ పరిపాలక సంఘాలు తిరునవైలో సమా వేశం ఔతూఉండేవి. 9వశతాబ్దంలో వినవచ్చిన ఈ పరిపాలక సంఘాలు చాలాకాలంనుంచీ ఉంటూఉన్న సంస్థలుగా కనబడ తాయి. అయితే ఇవి ఎలా ఏర్పాటయేవో, వీటి విధులేమిటో తెలుసుకోటానికి తగిన ఆధారాలు చిక్కలేదు. ఇవి బహుశః సంగంయుగంనాటి "మ్రానమ్" లేక "పొదియిల్" వాటి తర్వాత అదే పద్ధతిలో విస్తృతాలయి ఉంటాయి.

"సభలు" లేక "మహాసభలు" అనేవి "బ్రహ్మ దేయాలు" లేక బ్రాహ్మణగ్రామాలలో ఉండే సభలు. తెలుగు కన్నడ దేశాలలో వాటికి "మహాజనులు" అని పేరు. ఈ సభలకు దేవాలయాలు, గ్రామస్థుల సమస్యలు విచారణీ యాంశాలు. ఇదివరకే చెప్పినట్టుగా శాతవాహనులనాటి నుంచీ బ్రాహ్మణబృందానికి గ్రామాలలో స్థిరనివాసం కల్పిస్తూ ఉండటం దక్షిణభారతంలో మహారాజులకు ఒక ముఖ్య

కార్యంగా ఉంటూవచ్చింది. 9 వ శతాబ్దానికి పల్లవరాజ్యంలో 20 "బ్రహ్మదేయాలు" (బ్రాహ్మణగ్రామాలు) ఏర్పడ్డాయి. పాండ్యరాజ్యంలోకూడా ఇన్ని అని సంఖ్య చెప్పటానికి ఆధారాలు లేకపోయినా చాలా బ్రాహ్మణగ్రామాలు ఏర్పాటైనాయి. దంతివర్మపల్లవుడు సింహాసనం ఎక్కినతర్వాత 20 సంవత్సరాలు గడచినపిమ్మట చేసిన శాసనాన్నిబట్టి మహాసభవారు న్యాయనిర్ణయమూ, సరిహద్దు తగాదాల పరిష్కారమూ చేస్తూఉండేవారని తెలుస్తోంది. తిరునల్వేలిజిల్లాలోని మానూరులోని ఒక మహాసభ ఏవిధంగా పనిచేసేదీ సంపూర్ణంగా తెలియజేసే 9 వ శతాబ్దినాటి శాసనం ఒకటి, లభించింది. 10 వ శతాబ్దంలోని ఉత్తరమేరూరులోని సభ విధినిర్వహణంకూడా దీనిమాదిరిగానే ఉన్నట్లు కనబడుతున్నది. ఉత్తరమేరూరు శాసనంలో మహాసభ యేవిధంగా యేర్పడేదీ యేయేబాధ్యతలు నిర్వహించేదీ స్పష్టంగా నిరూపితమైంది. ప్రత్యేక కార్యక్రమాలలో యేర్పడే కార్యనిర్వాహకసంఘాల వుత్పత్తి, సభ్యులను ఎన్నుకొనే ప్రక్రియ ఈ సమస్తమూ అధునాతన పద్ధతుల మాదిరిగానే వుండేది. అయితే అన్ని మహాసభలు ఇల్లాగే వుండేవని చెప్పలేము. అనేక గాంగశాసనాలలో ఈ మహాసభలు కొందరు పెద్దలను ఎన్నుకొనటం ద్వారా యేర్పడుతూవచ్చినట్లు కనబడుతున్నది. దక్షిణరాజ్యాలలోని అన్ని మహాసభలవలెనే ఇవికూడా స్వతంత్రంగా కొన్ని తీర్మానాలు చెయ్యటం వాటిని అమలుపరచటం

ప్రజల తగవులను పరిష్కరించటం చేసేవి. క్లిష్టసమస్యలు రాజ నిర్ణయానికి వదలిపెట్టేవి. చాళుక్య గాంగశాసనాలలో భూ సంబంధమైన వ్యాజ్యాలుగానీ, ధర్మసంస్థలనిర్వాహణంలోవచ్చిన అభిప్రాయభేదాలుగానీ పరిష్కరించే అధికారికి ధర్మకార్మికుడు అని వ్యవహారం ఉన్నట్లు కనబడుతున్నది. మఱి దక్షిణప్రాంతా లలో తప్ప తక్కిన దక్కనులో అంతటా బ్రహ్మదేయాలలోని మహాసభల కార్యకలాపాలను రాజోద్యోగులు గమనిస్తూ ఉండేవారు. వర్తకులూ, లలితకళలవల్ల జీవించేవారూ అధిక సంఖ్యలోనివసించేపట్టణాలలోనూ,మహానగరాలలోనూ,ఆయా వృత్తుల వారికి ప్రత్యేక సంఘాలుండేవి. తమిళనాడు, కేరళ ప్రాంతాలకంటే తక్కిన దక్కనులోని నగర సంఘాల పరిపా లనా విధానాన్ని గుఱించి ఎక్కువ వివరాలు తెలుస్తున్నాయి. పట్టణాలలో వర్తక కార్మిక సంఘాలుమాత్రమే కాక సాధారణ పౌరసంఘాలుకూడా ఉండేవి. ఈ సాధారణ పౌరసంఘంలో అష్టాదశవర్గాల ప్రతినిధులు ఉండేవారు. ఈసంఘం కొన్ని న్యాయసూత్రాలను నిర్మించి, నాగరికుడు (తోటిగరుడు) న్యాయాధికారి (మేజస్ట్రేటు) నగరరక్షక భటాధికారులద్వారా ఆసూత్రాలు ఆచరణలో పెట్టించేది.

అయితే అత్యంత దక్షిణప్రాంతంలోని నగరాలలో వలె ఈదక్కను నాగరికసంఘాలకు విశేష స్వాతంత్ర్యం ఉండేది కాదు. ఉభయప్రాంతాలలోని సంఘాలూ ఒకేరకమైనవైనా ఉత్తర ప్రాంతంలోని సంఘాలమీాద రాజోద్యోగుల పర్య

వేక్షణమాత్రమే కాకుండా, ఒక్కొక్కప్పుడు జోక్యంకూడా ఉంటూ ఉండటంవల్ల సంఘాధికారం కొంతవఱకు సంకుచిత మౌతూ ఉండేది. దక్కను నాగరక సంఘాలలో దక్కను నగర సంఘాలలో అధ్యక్షుణ్ణి "గావుండుడు" అంటారు. జమా ఖర్చులు వ్రాసే ఉద్యోగికి "సెనబోవుడు" అనిపేరు. "గ్రామ కరకుడు" గ్రామాధికారి (మునసబు) ఈ ఉద్యోగులుప్రభుత్వా నికీ సంఘానికీ అనుబంధంవంటివారు. దక్షిణ నగర సంఘాలలో "కరణత్తర్" (లెక్కలు వ్రాసే ఉద్యోగి) "మధ్యస్థుడు" అనే ఉద్యోగులు సంఘశాసనాలు అమలుపఱచే ఉద్యోగులు.

కార్మిక సంఘాలకంటె వర్తకసంఘానికి ఎక్కువ పలుకు బడి ఉండేది, ఈ వర్తకసంఘం విధులూ కార్యనిర్వాహణవిధా నమూ బ్రహ్మదేయాలలోని మహాసభలమాదిరిగానే ఉండేవి. దక్షిణభారతం అంతటా శాఖోపశాఖలుగా విస్తరించిన "నానాదేశి" అనే పెద్ద వర్తకసంఘం ఒకటి ఉండేది. భాషా ప్రాతిపదిక మీద ఏర్పడ్డ నానా వర్తకసభ్యులతో ఈ సంఘం ఏర్పడేది. ఈ స్థానికసంఘాలకు కన్నడంలో "వీరబనజు"లనీ తమిళంలో "వీరవలంజియారు"లనీ వ్యవహారం ఉన్నట్లు శాస నాలవల్ల తెలియవస్తున్నది. కేవలం వాణిజ్యాభివృద్ధికోసమే ప్రారంభమైన ఈ వర్తకసంఘం క్రమంగా ఒక మహాసంస్థగా విస్తరించి, ఇటీవలికాలంలోని ఇంగ్లీషువారి తూర్పు ఇండియా వర్తకసంఘంమాదిరిగా సొంత సైనికదళాన్నికూడా ఏర్పఱచు కొన్నది. 11, 12 శతాబ్దాలలో ఈ "నానాదేశి" అత్యుచ్ఛ స్థితిలో ఉన్నది.

సంఘజీవనం :- ఈ కాలంలో మహారాజుల ఆదరణతో ప్రత్యేక గ్రామాలలో నివసిస్తూఉండే బ్రాహ్మణులు సంఘంలో మంచి ప్రాబల్యం సంపాదించారు. మదరాసు పురాతన వస్తుప్రదర్శనశాలలో కనిపించే జటిలవర్మ పాండ్యుని తామ్రశాసనంవల్ల మగధదేశంనుంచి కొంతమంది బ్రాహ్మణులు పాండ్యదేశానికి వలసవచ్చినట్లు తెలుస్తున్నది. అయితే ఈ బ్రాహ్మణులు పాండ్యదేశంలో ఎప్పుడు స్థిరపడ్డదీ సరిగా తెలియకపోయినా, బహుశః ఇది 9 వ శతాబ్దానికి ముందే జరిగిఉంటుందని నిస్సందేహంగా చెప్పవచ్చును. చాళుక్య కదంబ రాజ్యాలలోనూ పల్లవ చేర గాంగరాజ్యాలలోనూ కూడా బ్రాహ్మణులకు ప్రత్యేకగ్రామాలు ఉన్నట్లు కనబడుతుంది. ఈ బ్రాహ్మణులు దేవాలయనిర్వహణలో నియుక్తులయి ఉండేవారు. తరచుగా బ్రాహ్మణ గ్రామాలలో రాజులు దేవాలయాలు కట్టిస్తూఉండేవారు. దేవాలయ నిర్వహణంలో బ్రాహ్మణులకే ఎక్కువ బాధ్యత ఉండేది. త్వరలో దేవళాలు గొప్ప విద్యాలయాలైనాయి. ఇవేకాక, మఠాలూ, ఘటికాలూ, చైత్యాలూ కూడా విద్యామందిరాలుగా, పుణ్యస్థలాలుగా పరిగణనలోకి వచ్చాయి. విద్యాబోధన దేవాలయాలలోగానీ, తత్ప్రాంతాలలోగానీ జరిగేది. క్రీ॥ శ॥ 4 వ శతాబ్దానికి పూర్వమే కాంచీపురంలోని ఒక ఘటికం ప్రసిద్ధ విద్యాలయమైంది. అక్కడ చదువుకొన్నవారెందఱో మహాపండితులైనారు. ఇప్పటి ఉత్తర ఆర్కాటు

జిల్లాలోని షోలింగర్‌లో ఒక గొప్ప ఘటికం ఉండేది. గాంగ పల్లవరాజయిన నృపతుంగవర్మ ప్రధానమంత్రి వుదుచ్చేరి దగ్గఱఉండే బహుగ్రామ విద్యాస్థానానికి మూడుగ్రామాలు దానంచేశాడు. ఇంకా తెలుగు కన్నడ దేశాలలో, ఎన్నో ఘటికాలుండేవని శాసనాలవలన తెలుస్తున్నది. క్రీ॥ శ॥ 9, 10 శతాబ్దాలలోని శాసనాలవలన అత్యంత దక్షిణానఉన్న కండ లూరు, పార్థివశేఖరపురం, కన్యాకుమారులలోని "సాలై లు" అనేవి ఘటికాలమాదిరిగానే గొప్ప విద్యాపీఠాలుగా ఉన్నట్లు తెలియవస్తున్నది. ఇంతేకాక బ్రాహ్మణవిద్వాంసులకు వారి వారి పాండిత్యానికి తగ్గట్టు భూరిసత్కారాలు చెయ్యట మున్నూ జరిగేది. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కగ్రామం సంపూర్ణాధికారంతో దానంచెయ్యటమున్నూ ఉండేది. ఇటు వంటిగ్రామాలకు "అగ్రహారాలు" అని పేరు. ఎనిమిదవ శతా బ్దంలో ద్వితీయ నందివర్మ పల్లవుడు తంజావూరుజిల్లాలో కుంభ కోణందగ్గఱా, నాగపట్టణందగ్గఱా ఇచ్చిన రెండు అగ్రహా రాలూ ఇటువంటివే. విష్ణుకుండినవంశస్థుడైన మాధవవర్మ గోదావరీ మండలంలోని పొలమేరు అనే గ్రామాన్ని ఒక బ్రాహ్మణునికి అగ్రహారంగా ఇచ్చినట్లు తెలుస్తున్నది. సర్వ దానాలలో బ్రాహ్మణులుకు అగ్రహారాలు ఇవ్వటం రాజులకు ఒక సంప్రదాయంగా ఏర్పడినట్లు కనబడుతుంది. రాజులు పట్టాభిషేక సమయంలో ఎన్నెన్నో బహుమతులు ఎందఱికో ఇచ్చేవారు. ఇంతేగాక గోసహస్రాలూ (వెయ్యి ఆవులను

దానం చెయ్యటం) హిరణ్యగర్భాలూ (బంగారు గోవును దాన మివ్వటం) దాత యెత్తుబంగారం తూచి పంచి యిచ్చే తులా భారాలూ మొదలైనవి మహోత్సవంగా జరిగేవి. ప్రథమ రాజసింహపాండ్యుడూ ఇంకాఎందఱో వేనాడురాజులూ,గాంగ రాజులూ, ఆంధ్రరాజులుకూడా ఇటువంటి దానాలను బ్రాహ్మ ణులకు ఇచ్చినట్లు తెలియవస్తున్నది. చాళుక్య విజయాదిత్యుని (క్రీ॥ శ॥ 696సం॥-734 సం॥)రాణి హిరణ్యగర్భం అనే దానం చేసింది. మొత్తంమీద ఈ కాలంలో మతాచార్యత్వం వహిం చిన జాతికి ఎంతో ఆదరంఉండేదనటంలో ఏమీసందేహము లేదు.

కులభేదాలు అంతపట్టింపుగా ఉండేవికావు. రాజకుటుం బాలలో ఉన్నట్లే ఇతర ప్రజలలోకూడ వర్ణాంతర వివాహాలు ఉండేవి. కదంబ కాకుత్స్థవర్మా, వాకాటక రుద్రసేనుడూ బ్రాహ్మణులే అయినా, వైశ్యరాజులకు తమ కూతుండ్రను ఇచ్చి వివాహాలుచేశారు. బ్రాహ్మణుడైన ఒక ఇక్ష్వాకురాజు శకరాజు కుమారిని పెండ్లాడాడు. దంతివర్మపల్లవుని రాణికూడా ఒక బ్రాహ్మణ ప్రభువు కూతురు.

వృత్తివరణం కులాలనుబట్టి జరుగుతూవచ్చినా,. ఇతర కులవృత్తుల్ని కొంతమంది అవలంబించటంకూడా ఉండేది. బ్రాహ్మణుకు రాజ్యాలు ఏలటం అలా వుండగా, కొందఱు బ్రాహ్మణులు వాణిజ్యమూ, శిల్పనిర్మాణమూ, ప్రభుత్వో ద్యోగమూ మొదలయినవి చేసేవారు. వాస్తవానికి ఇతర జాతులకంటె క్షత్రియులు అనేవారు దక్షిణభారతంలో చాల

తక్కువమంది మాత్రమే. ఇంతేగాక యుద్ధ పరిశ్రమ ఒక్క క్షత్రియుల సొత్తుగానే లేదు. పదాతిదళం మొదలయిన వాటిలో ఎక్కువమంది శూద్రులే. శూద్రులలో వివిధశాఖలు బయలుదేరాయి. దక్కనులోని రెడ్లూ, కాపుల మాదిరిగా, తమిళ దేశంలో వెల్లాలులు చెసుకటిమాదిరిగానే భూస్వాములు గానూ, కర్షకులుగానూ ఉండేవారు. మొత్తం దక్షిణ దేశం అంతటా శ్రేష్ఠులు, (సెట్టులు) వాణిజ్యంలో ప్రధానపాత్ర వహించారు. వైశ్యులమని చెప్పుకొనే కోమటి సెట్టులు మాదిగకులంతో గాఢ సంబంధం కలవారుగా ఉండేవారు, కోమటుల ఇండ్లలో జరిగే వివాహానికి మాదిగ ఇంటినుంచి అగ్నిహోత్రం తీసుకురావటం ఆచారంగా ఉండేది. ఇంతేగాక, కమసాలులూ, వడ్రంగులూ, మిగిలిన చేతిపనులవారూ మొదలైన వివిధ కులాలవారు అన్యోన్యంగా వివాహాలు జరుపుకొనేవారు. వైద్యవృత్తి ప్రధానంగాకల జాతికి పెద్దపెద్ద ఔషధశాలలూ, చికిత్సాలయాలూ ఉన్నట్లు 8వ శతాబ్దంనాటి కొన్ని పాండ్య శాసనాలవలన తెలియవస్తున్నది. ఈజాతికి ఇతర జాతులతో వివాహసంబంధం వుండేది. బృహద్ధర్మ పురాణాన్నిబట్టి వైశ్యులకు శూద్ర స్త్రీలయందు కలిగిన సంతానమే కరణకులంగా ఏర్పడిందని తెలుస్తున్నది. తమిళశాసనాలలో ఈకరణకులం ప్రసక్తి కనబడుతున్నది. కరణాలు రాజోద్యోగులుగా నియుక్తులయేవారు. దేవాలయాలకూ, ఇతరసంస్థలకూ ఆదాయ వ్యయాలలెక్కలు వీరే తయారుచెయ్యటం జరిగేవి. ఉత్తర

భారతంలోనూ,పడమటిదక్కనులోనూకల్గికాయస్థులు శూద్రు లని స్మృతివచనం. వీరు గుమాస్తాలుగానూ, అధికారులుగానూ కూడా ఉద్యోగాలు చేసేవారు. మనువు పేర్కొన్నఅంబష్ఠులు (మంగలివారు) బ్రాహ్మణులకు వైశ్యస్త్రీలయందు జన్మించిన వారు. వీరు వ్యవసాయమూ, శస్త్రచికిత్సా మాత్రమేకాక ఇతరోద్యోగాలుకూడా చేసేవారు. అత్యంత దక్షిణదేశంలో క్షురకులుగానూ, వైద్యులుగానూ పనిచేసేవారు ఈఅంబష్ఠ కులంవారే అయి వుంటారు. కులాలన్నింటిలోనూ తక్కువది చండాలజాతి. స్మృతులనుబట్టి అనాధప్రేతాలను శ్మశానానికి చేర్చటమూ, క్రూరశిక్షలకు అర్హులైన వారిని వధించటమూ మొదలయిన నీచకార్యాలు వీరి పనులని తెలుస్తున్నది. వీరు అస్పృశ్యులని చెప్పి, అగ్రకులాలవారు వీరికి చాలాదూరంగా ఉండేవారు. క్రీ॥శ। అయిదవ శతాబ్దంలో హిందూదేశానికి వచ్చిన ఫాహియాన్ అనే చైనాయాత్రికుడు మధ్యభారతంలో ఈచండాలురు తప్పనిసరిగా నగరాలకూ, విపణిస్థలాలకూ వెలుపల నివసిస్తూవుండే వారనీ, వీరు ఎప్పుడైనా పురవీధులకు రావలసివస్తే, ఒకకఱ్ఱతో చప్పుడుచేస్తూ రావలసి వుండేదనీ, ఆచప్పుడువినగానే అగ్రవర్ణులు దారితొలగి పోయేవారనీ వ్రాశాడు. క్రీ. శ. 7 వ శతాబ్దపువాడైన హ్యూయన్ త్సాంగ్ వీధులు ఊడ్చేవారూ, కసాయివాండ్రూ, తలవరులూ, మొదల యిన ఇతర నీచజాతివారుకూడా అస్పృశ్యులుగా ఉండేవారని వ్రాశాడు. ఈ అంశులు క్రీ॥శ॥ 7,8వ శతాబ్దాలలో దక్షిణ

దేశానికికూడా వ్యాపించాయి. కేరళంలో ప్రాబల్యం వహిం చిన నంబూద్రులు ఈ ఆంక్షలను చాలా కఠినంగా అమలు పఱచారు. ఇతర దక్షిణరాజ్యాలలోకూడా ఈ అస్పృశ్యత క్రమంగా వేళ్ళు పాదుకొన్నది.

నిజం చెప్పవలసివస్తే తర్వాత తర్వాత బయలుదేరిన స్మృతికర్తలూ, పురాణధర్మశాస్త్ర వ్యాఖ్యాతలూ కులభేదాల విషయంలో క్రొత్తగా కఠిననియమాలను ప్రవేశపెట్టారనాలి. సంస్కారప్రకాశిక అనే స్మృతిలో పరాశరుడు శూద్రపాకం తినటం అలాఉండగా, శూద్రునితో సమానమైన పీఠంమీద కూర్చోవటంకానీ, శూద్రునిదగ్గఱ చదువుకోవటంకానీ తగదని నిషేధించాడు. శూద్రస్పర్శ మాత్రమే కాకుండా, శూద్రుని దృష్టి తగిలినాకూడా మైలపడ్డట్టే అని కొన్ని గ్రంథాలలో ఉన్నది. క్రీ.శ. 9వశతాబ్దంలో మనుస్మృతి వ్యాఖ్యానించిన మేధాతిథి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర శవాలను వరుసగా, తూర్పు, ఉత్తరం, పడమర. దక్షిణాలనగరద్వారాల గుండా శ్మశానానికి తీసికొని వెళ్ళాలని నిర్దేశించాడు. ఉత్తర దేశంలోకంటె దక్షిణదేశంలో కులభేదాలుతీవ్రరూపంతాల్చిన కొద్దీ ఇటువంటి నిబంధనలన్నీ బయలుదేరాయి. ఉత్తరభార తపు బ్రాహ్మణులకంటె దక్షిణభారతపుబ్రాహ్మణులు కొంచెం తక్కువవారనే భావం వుండేదనటం ముఖ్యంగా గమనించదగ్గ విషయం. ఓఢ్ర (ఒరిస్సా), ఆంధ్ర, టక్క (పంజాబు) ద్రావిడ (తమిళ) కొంకణదేశాలు మ్లేచ్ఛదేశాలనీ, ఈ దేశాల్లో

నివసించే బ్రాహ్మణులు తక్కువవారనీ, వీరిని అపరకర్మలకూ బ్రాహ్మణార్థాలకూ పిలువగూడదనీ మత్స్యపురాణం నిషేధిస్తు వున్నది. దక్షిణభారతంలోని బ్రాహ్మణులు అనార్యులతో కలసిమెలసి వుంటున్నారనే అభిప్రాయమే ఔత్తరాహులయిన బ్రాహ్మణులకంటె దాక్షిణాత్య బ్రాహ్మణులు తక్కువ వారుగా పరిగణించటానికి కారణం.

రాజాస్థానాలలోనూ, సంఘంలోనూ బ్రాహ్మణులకు ఆధిక్యం లభించటంచేత ఆర్యవిశ్వాసాలు దేశంలో పరివ్యాప్త మైనాయి మతసిద్ధాంతాలలో అంతకుపూర్వమే ప్రారంభ మైన పరివర్తనం మరింత దృఢపడింది. నూతన దేవతల చేరి కతో ఆర్యమతం సువిశాలమైంది. క్రొత్తఆచారాలు ఏర్ప డ్డాయి. దేవాలయాలవద్ద చెయ్యవలసిన పూజావిధానాలూ, ఉత్సవాలూ అధికమైనాయి. పురోహితులకూ అర్చకులకూ క్రమంగా ప్రాబల్యం ఏర్పడింది. అయితే ఈ నవీనత దక్షిణ భారతంలోని హైందవస్వరూపాన్ని సంపూర్ణంగా మార్చ లేదనిమాత్రం జ్ఞాపకంపెట్టుకోవాలి. బ్రాహ్మణులూ తక్కిన పెద్దకులాలవారూ ఈ నూతనపద్ధతులను అనుసరించినా, మిగి లిన సామాన్యప్రజ ఇంకా గ్రామదేవతలనూ, దేవుళ్లనూ ఆరాధిస్తూనే ఉన్నది. వృక్షపూజా, నాగపూజా అలాఉండగా దయ్యాలనూ, భూతాలనూ, చనిపోయిన పూర్వీకులనూ ఆరా ధించటంకూడా సాగింది. అప్పుడప్పుడు సంభవించే ఈతిబాధల నుండి తప్పుకొనటానికి దేవతలకు జంతుబలులుకూడా ఇచ్చే

వారు. దేవతలను సంతృప్తిపరచటంకోసం అనేకవిధాల శరీ
రాన్ని శోషింపజేసికోవటమూ, ప్రాయోపవేశాలుకూడా
సాగాయి.

అయితే అగ్రవర్ణులు ఇటువంటి ఆచారాలను ఎంత
మాత్రమూ అరికట్టటానికి పూనుకోకపోవటం గమనార్హమైన
విషయం. శూద్రులలో చాలాభాగం ప్రాచీన దేవతలనూ
నూతన దేవతలనూకూడా ఆరాధిస్తూవచ్చారు. క్రీస్తుశకం తొలి
శతాబ్దాలలో మాంసాహారం తగదనే ప్రచారం సాగినతర్వాత
శూద్రులు మిగతావర్ణాలవారికి కొంచెం ఎడమైపోయారు.
కానీ తరతరాలుగా తాము సేవిస్తూవచ్చిన దేవతలనుమాత్రం
వదలిపెట్టలేదు.

హిందువులలో ఇటువంటిమార్పులు వస్తూవుండగానే
బౌద్ధులూ, జైనులూ తమ స్థితిగతులను అభివృద్ధిచేసికొన
టానికి ప్రయత్నాలు సాగించారు. వారి విహారాలనుంచీ,
విద్యాపీఠాలనుంచీ అనేక పరివ్రాజకులూ, విద్వాంసులూ
బయలు దేరారు. సారస్వతానికీ, కళలకూ, ఇతర విద్య
లకూ వారు చేసిన సేవ అపారం. జైన బౌద్ధ మతాలవల్ల
దక్షిణ భారత సంస్కృతికి కలిగిన అభివృద్ధి ఎంతటిదో ఇంత
వరకూ మనము గుర్తించనేలేదు. ముఖ్యంగా ఆంధ్ర కేరళ
దేశాలలో బౌద్ధమూ, కన్నడ తమిళ దేశాలలో జైనమూ
ప్రజల ఆచారవ్యవహారాలలోనూ అభిప్రాయాలలోనూ విశే
షంగా ప్రతిఫలిస్తున్నాయి. ఆ ఉభయమత సంప్రదాయాలూ,

సిద్ధాంతాలూ అనేకం సంఘంలో చొచ్చుకొనిపోయాయి. అహింసాసిద్ధాంతంమీద వారికిగల గాఢవిశ్వాసం, శాకాహారంతోనే ఆకలి చల్లార్చుకోవాలనే సంప్రదాయానికి మూలకారణమై ప్రత్యక్షంగానూ పరోక్షంగానూకూడా దక్షిణ భారతీయులమీద ఎంతోవఱకు తన ప్రభావం ప్రసరింపజేసింది. జైనులూ, బౌద్ధులూకూడా రాజుల ఆదరం సంపాదించటానికి విశేషంగా కృషిచేశారు. ఆకృషిలో వారు అనేక సందర్భాలలో కృతకృత్యులైనారుకూడాను. గాంగులూ, కొంతమంది చాళుక్యులూ, రాష్ట్రకూటులూ, ఇంకా ప్రాచీన తమిళులూ కూడా జైనమతాన్ని అభిమానించారు. హిందూమతం బౌద్ధమతంలోని విశిష్టతను తనలో జీర్ణించకోగానే ఆంధ్ర కేరళదేశాలలో బౌద్ధమతం నామమాత్రావశిష్టమైంది. జైనమతం మాత్రం తమిళ కర్ణాట దేశాలలో సారస్వతంమీద ఆధిపత్యం వహించి చాలాకాలంవఱకూ నిలదొక్కుకొని వుండగలిగింది.

క్రీ॥ శ॥ 7 వ శతాబ్దంవఱకూ ఈ మూడుమతాలూ ప్రశాంతంగానే అన్యోన్య విజిగీషతో కృషిచేశాయి. అభిప్రాయభేదాలు పుట్టక పోలేదు. ఒకరిని ఒకరు సాధించటానికి తీవ్రంగా కృషిచెయ్యకనూపోలేదు. కాని 7 వ శతాబ్దంవఱకూ ఏ మతమున్నూ బలప్రయోగానికి పూనుకోలేదు. భక్తి అనే ఉద్యమం సాగటంతో హిందూసంఘంలో సంస్కరణానికి విశేష కృషి సాగింది. శైవుల ప్రార్థనగీతాలు ప్రజాసముదాయాన్ని ఎంతో ఆకర్షించటంవల్ల తమిళదేశంలో శైవ

యోగులు ప్రాబల్యం వహించారు. అప్పటికి బౌద్ధం బాగా బలహీనమైంది; జైనమతం స్థితి అస్తవ్యస్తమైంది. హిందూ మతం ముందు జైనం అనేక ప్రదేశాలలో పరాజితమూ, పలాయితమూ కావలసివచ్చినప్పటికీ దక్షిణభారతంలోని కొన్ని కొన్నిచోట్లమాత్రం కాలూని నిలువగలిగింది. అయితే చాలామంది జైనులు హిందువులై పోయారు. అనేక జైన మఠాలు హిందూదేవాలయాలుగా మారిపోయినాయి.

కేరళం బౌద్ధానికి ఒక ముఖ్యస్థావరంగా ఉండేది. బౌద్ధంతోపాటు జైనమూ అక్కడ వ్యాపించింది. కాని క్రీ॥ శ॥ 7వ శతాబ్దంలో హ్యూయన్‌త్సాంగు వచ్చేటప్పటికి అక్కడ బౌద్ధం నిరాలంబమైంది. ఎన్నో బౌద్ధవిహారాలూ చైత్యాలూ శిథిలితాలై, వాటి స్థానాలలో హిందూదేవాలయాలు తల లెత్తటం అతను గమనించాడు. మధ్య తిరువాన్కూరులో ఇటువంటి శిథిలచైత్యాలు ఎన్నో కనిపించాయి. తిరువా న్కూరులోని అలప్పూంజాదగ్గరఉండే శ్రీమూలవాసం బౌద్ధ మత ప్రచారానికీ, బౌద్ధసంస్కృతికీ ఒక ప్రధానపీఠంగా ఉండేది. హిందూదేవాలయాలలో జరిగే కొన్ని ఉత్సవాలూ, దేవతారాధనలూ, బౌద్ధసంప్రదాయ చిహ్నితాలనే విషయం గమనించదగ్గది. విగ్రహారాధనకు అవలంబించే విశిష్టపద్ధ తులూ, విగ్రహాలనూ, దేవాలయాలనూ నిర్మించే విధా నాలూ, ఉత్సవ నిర్వాహణపద్ధతులూ మొదలైనవన్నీ దక్షిణ భారతంలోని మహాయానబౌద్ధుల సంప్రదాయాల నుంచి

తెచ్చిపెట్టుకొన్నవే. శివరూపాంతరమైన దక్షిణామూర్తి బౌద్ధ నిగదితమైన బుద్ధి స్వరూపం అనేది సత్యమైనా, కాకపోయినా, కేరళదేశంలోని శస్త్రపూజ బౌద్ధసంప్రదాయ చిహ్నితంగానే కనిపిస్తుంది. తిరువాన్కూరు దేవాలయాలలో జరిగే "కెట్టూ కహాజ్హా" అనే ఉత్సవం నిరంతరాయమైన ఒక ప్రాచీన బౌద్ధ ముఖ్యోత్సవమే అని అనుకొంటున్నాము. దక్షిణాగ్రాన మాత్రమేకాక, తిరువాన్కూరుకు బాగా ఉత్తరాన కన్యాకుమారికి సమీపానవున్న నాగెర్‌కాయిల్ చుట్టూకూడా జైనాశ్రమాలు నెలకొన్నాయి. విలవంకాడులోని తిరిచినత్తు మలమీదా, నాగెర్‌కాయిల్ వద్దా వెలసిన జైనాశ్రమాలలో 13 వ శతాబ్దంవఱకూ జైనదేవతారాధన జరుగుతూవచ్చింది.

హిందూమత సంస్కరణంలో కేరళం ప్రధానపాత్ర వహించింది. అద్వైతమతస్థాపకుడైన శ్రీ శంకరాచార్యుడు ఉత్తర తిరువాన్కూరు ప్రాంతంలోని నంబూద్రి బ్రాహ్మణ వంశలో జన్మించాడు. ఇక శైవంతోపాటు వెలసిన వైష్ణవంలో తదభ్యుదయానికి పాటుపడిన ఆళ్వార్లు అనే అవతార పురుషులలో కులశేఖరఆళ్వారు ఒకడు. కేరళమూ అందులోనూ ముఖ్యంగా తిరువాన్కూరూ గొప్పగొప్ప విష్ణ్వాలయాలు వెలసిన ప్రదేశాలు. తిరువనంతపురం, వర్కాలా, తిరువత్తార్లు ప్రసిద్ధ వైష్ణవక్షేత్రాలు. ఇక్కడి ఆలయాలు క్రీ.శ. 9వశతాబ్దానికి పూర్వమే వెలసినట్లు శాసనాధారాలువున్నాయి.

కేరళంలో సముద్రయానానికి అనుకూలమైనతీరభాగం




1 అజంతా
2 నాసిక్
3 ఎల్లోరా
4 ఐహోల్
6 నాగార్జునకొండ
7 ధాన్యకటకము
5 మాల్ఖేడు
8 అమరావతి
9 రాజమహేంద్రవరము
10 విష్ణుపురము
11 పట్టాడకల్
12 వర్ని
13 మహేంద్రవడి
14 మైలై
15 మామల్లపురం
16 తెల్లారు
17 బాహూర్
18 వాటలీపుత్రము
19 ఖైరవకోట
20 పుదైలూర్
21 తిరుక్కాళ్ కొండము
22 కంచి
23 వనవాసి
24 తాళకుండ
25 తలకాడు
26 దండంతోటం
27 తంజావూరు
28 నాగపట్టణము
29 చిత్తన్నవాసల్
30 కొడుంబాళూర్
31 మధుర
32 కొర్కై
33 మానూర్
34 వాడిస్యమ్
35 కన్యాకుమారి

క్రీ॥ పూ॥ 500 – 900 దక్షిణ భారతదేశము

ఉండటంవల్ల ప్రాచీనకాలంలోనే క్రైస్తవులూ, ముస్లిములూ ఇక్కడికివచ్చి దక్షిణభారతంలో ప్రవేశించారు. క్రీ॥శ॥52వ సంవత్సరంలో సెంట్ థామస్ అనే క్రైస్తవమత ప్రచారకుడు ఇక్కడికివచ్చి, కొన్ని క్రైస్తవ ప్రార్థనా మందిరాలను నిర్మించటమే కాకుండా అనేకులకు క్రైస్తవమతదీక్ష ఇచ్చినట్లు చాలాకాలంనుంచీ ప్రతీతి వున్నది. ఈప్రతీతిలో ఎంతవఱకు సత్యం ఉన్నదో అనూహ్యమే అయినా క్రీ॥శ॥ 4వశతాబ్దంలో కానాథామా అనే క్రైస్తవుడు జెరూసలేమూ నైనేవాలా నుంచి సుమారు నాలుగువందల మంది క్రైస్తవులను వెంట బెట్టుకొనివచ్చి, క్రంగనూర్ వద్ద వారికి స్థిరనివాసాలు కల్పించిన విషయం మాత్రం నమ్మదగినదిగా కనిపిస్తున్నది. క్రీ॥ శ॥ 522వ సంవత్సరంలో క్విలను సందర్శించిన కాస్మాస్ అనే అలెగ్జాండ్రియావర్తకుడు అక్కడ ఒక క్రైస్తవప్రార్థనామందిరం ఉన్నట్లు పేర్కొన్నాడు. వాణిజ్యాభివృద్ధి దృష్టిలో పెట్టుకొని చేరసామ్రాట్టులు తమ దేశానికి వలసవచ్చిన క్రైస్తవులను ఆదరించారు. క్రీ. శ. 9వ శతాబ్దంలో చేర దేశాధీశ్వరుడయిన స్థాణురవి క్విలన్‌లో క్రైస్తవులు ఇండ్లుకట్టుకొనడానికి స్థలాలు ఇచ్చినట్లు "కొట్టయమ్ సిరియన్ క్రైస్తవశాసన ఫలకాలు" తెలియజేస్తున్నాయి. ఆమరుసటి శతాబ్దంలోనే చేరరాజయిన 'భాస్కరవర్మ' కొంతమంది యూదులకు కేరళంలో నివసించటానికి అనుమతి ఇచ్చాడు. ఈఫలకాలు విశ్వసనీయాలేనా అనే అనుమానమున్నా వున్నది. అయితే కేవలం ఎవరో వీటిని



అమరావతీ శిల్పము

మద్రాసు మ్యూజియంవారి అనుమతితో



అజంతా గుహలు (నెం. 19)

పురావస్తు పరిశోధక శాఖవారి అనుమతితో

కల్పించివుంటారని గట్టిగా వక్కాణించటానికి వీలులేదు. అరబ్బులు వర్తకంకోసం కేరళతీరం చేరుకొన్నారు. వాణిజ్యం అభివృద్ధిచెందుతూ వుంటే 8వ శతాబ్దంలో జ్యూజ్ లూ ఇక్కడి స్థిరపడటం మొదలుపెట్టారు. వీరు కొంతమందిని [illegible] మతంలో కలుపుకొన్నట్లు కనబడుతుంది. దీనితో కొన్ని కట్టు కథలుకూడా పుట్టుకొనివచ్చాయి.

అగ్రవర్ణాలలోని స్త్రీలగౌరవం ఏమీ చెప్పుకోదగిన లేదు. రాణులూ, రాజకుటుంబాల కన్యలూ విద్యావతులై కవులను సత్కరించేవారని శాసనాలు చెప్తున్నాయి. కొందరు ఉత్తమకాంతలు వైద్యంలోనూ, నీతిశాస్త్రంలోనూ తత్త్వశాస్త్రంలోనూ మంచి నైపుణ్యం సంపాదించటమే కాకుండా ఇతరులకు బోధిస్తూ వుండేవారు. కొందరు విదుషీ మణులు ఐహికభోగాలను రోసి, జైనపరివ్రాజికలైనట్లుకొన్ని శాసనాలు ఘోషిస్తున్నాయి. దేవాలయాలలో నాట్యకత్తెలను నియమించటం క్రీ॥శ॥ 7వశతాబ్దంనుంచే పల్లవదేవాలయాలలో ప్రారంభమైంది. ప్రథమ రాజరాజచోళుడు ఈపద్ధతికి ఒకచక్కనిరూపంఇచ్చాడు. అయితే ఇతనికిపూర్వం 9వశతాబ్దం నాటికే దక్షిణరాజ్యాలన్నింటిలోనూ ఇది ఒక ఆచారమై పోయింది. ఈవిధంగా దేవాలయాలలో భగవత్సన్నిధి నాట్యం చెయ్యటానికి నియుక్తలయిన దేవదాసీయువతులు తొలిదశలో అతిపవిత్రులై దేవదాసీ శబ్దాన్ని సార్థకపఱచారనటంలో సందేహంలేదు.

ఉన్నతకుటుంబాలలో బహుపత్నీత్వం ఉంటూనే ఉండేది. వివాహం అనేది సాంఘికపు కట్టుబాటు మాత్రమే కాక మతదృష్ట్యాకూడా ప్రధానంగా ఉండేది. తల్లిదండ్రులు గానీ, ఇంటిపెద్దలుగానీ సంబంధాలు నిశ్చయించేవారు. అయితే రాజకన్యలకుమాత్రం ఒక్కొక్కప్పుడు స్వయంవరపద్ధతినే వివాహాలు జరిగేవి. వివాహాలు వెనుకటికంటె ఎక్కువ వేడుకగా జరుగుతూవచ్చాయి. సతీసహగమనమున్నూ అధికమైంది. వితంతువులు పాటించవలసిన నియమాలు పెఱిగిపోయాయి. ఈ సందర్భంలో ప్రాచీన తమిళ పురాణాలూ, స్మృతులూ ప్రమాణగ్రంథాలుగా ఉండేవి. మనువున్నూ, మేధాతిథీ (మనుస్మృతివ్యాఖ్యాత) కూడా స్త్రీకి వివాహం మఱీ చిన్న తనంలోనే జరగాలని శాసించారు. ఈ నిబంధనలు క్రీ. శ. 9 వ శతాబ్దంలో ఉత్తర భారతంలో అమలులోకి వచ్చిన వెంటనే దక్షిణభారతానికి కూడా ప్రాకాయి. దీని వల్ల క్రమంగా సంఘంలో స్త్రీకి కల గౌరవం క్షీణిస్తూ వచ్చింది భార్యయందు దోషం ఉన్నదని భావిస్తే పురుషుడు ఆమెకు ఎంత కఠిన శిక్ష అయినా విధించ వచ్చుననీ, చివఱకు చంపినా, చంపవచ్చుననీ, తనకు ఎదురాడినంత మాత్రాన వదలి పెట్ట వచ్చుననీ కూడా మనువు అనుమతించాడు. భర్త పూర్తిగా అయోగ్యుడైనప్పటికీ, అతనిని దైవంగా భావించి భార్య సేవించ వలసినదే; అని కూడా అతను శాసించాడు. భార్య సర్వకాల సర్వావస్థలలోనూ, భర్త జీవించివున్నా, గతించినా,

అతనికి అభిమతమైన మార్గం విశ్వాసపాత్రురాలుగా జీవించ వలసినదేకానీ, పురుషుడుమాత్రం భార్యచనిపోతే పన్నెండవ రోజుననే మరొక సంబంధం విచారించుకోవచ్చును. క్రొత్త పెండ్లికొడుకు కావచ్చును. ఇందుకు ఏవేవో కారణాలున్నా యని ఎవరైనా వాదించవచ్చును. ఏమైనప్పటికీ ఈఆచారలన్నీ స్త్రీకిగల సాంఘిక ప్రతిపత్తిని పూర్తిగా క్రుంగదీశాయని చెప్పక తప్పదు. ఇంతేకాక ఈకాలంనాటికి స్త్రీలు వైదిక కర్మలు స్వతంత్రంగా చెయ్యటానికి వీలులేదనీ, (వేదం చదివే అర్హత వీరికి లేదనీ) కూడా ధర్మశాస్త్రాలు శాసించాయి.

సారస్వతం : సంస్కృతం:-ఈకాలంలో దక్షిణభార తంలోని అన్ని రాజాస్థానాలలోనూ సంస్కృతవాణికే పట్టాభి షేకం చేశారు. ఘటికాలలోనూ, ఇతర విద్యానిలయాల లోనూ ఉండే విద్వాంసులు సంస్కృతంలోనే రచనలు సాగిం చారు. క్రీ॥శ॥ 5వశతాబ్దంనుంచి 7వశతాబ్దంవఱకూ గీర్వాణ సాహిత్యానికి "సువర్ణయుగం" అనిచెప్పవచ్చును. ఈకాలంలో ఉత్తరభారతంలో అమరభారతీ మంజులనూపురారావం దక్షిణ భారతానికి కర్ణపర్వంగా వినిపిస్తూ ఉండటంవల్ల దాక్షిణాత్య రచయితలుకూడా దేవభాషాయోషా సమర్చనకే ఘంటాలు మీదుగట్టారు. ఈకాలంలో దక్షిణభారతాన ఉదయించిన సంస్కృత గ్రంథాలలో మతప్రధానాలైనవీ, తత్త్వవిచారణా పరాయణాలైనవీ, సాహిత్య విమర్శనా, లక్షణ పరామర్శా చేసేవికూడా ఉన్నాయి.

ఈకాలంలోని తొట్టతొలి సంస్కృతకవులలో కులశేఖర ఆళ్వారు ఒకడు. ఈయన మహాభక్తుడూ, విద్వాంసుడూకూడా. అతని రచనలలో భగవన్నుతిపరాయణమైన "ముకుందమాల" సుప్రసిద్ధమైనది. సాహిత్యదృష్ట్యా మాత్రమేకాక, భక్త్యావేశ విశేషంవల్లకూడా అది ఉత్తమ గ్రంథంగా ఎన్నికకు వచ్చింది. క్రీ॥శ॥ 9వశతాబ్దంలోనే (శంకరాచార్యుని శిష్యుడైన) శక్తి భద్రుడు కేరళదేశంలోని ప్రధాన కవిగా, నాటకకర్తగా ప్రసిద్ధుడైనాడు. ఇతని గ్రంథాలన్నింటిలోనూ, రామాయణ కథను అనుసరించిన "ఆశ్చర్యచూడామణి" సంస్కృత సాహిత్యంలో ఒక విశిష్ట స్థానాన్ని సంపాదించుకొన్నది.

పల్లవులు సంస్కృతాన్ని ఎంతో అభిమానించారు. సంస్కృత వాఙ్మయంలో ఈనాడు అత్యుత్తమాలుగా ఎన్నిక వచ్చే గ్రంథాలు కొన్ని వారి యేలుబడిలో తలెత్తినవే. దక్షిణ భారత కవులలో సుప్రసిద్ధుడైన భారవి "కిరాతార్జునీయం" రచించాడు. అర్జునుడు పాశుపతాస్త్రంకోసం శివుని గురించి తపస్సుచేసి, ఆయనను మెప్పించి, ఆ అస్త్రాన్ని సంపాదించటం దీనిలోని ప్రధానేతివృత్తం. ఇది 18 సర్గలుగల మహాకావ్యం. భారవిమహాకవి పల్లవరాజాస్థానంలోనేకాక, తూర్పు చాళుక్యులవద్దనూ, గాంగరాజులవద్దనూకూడా ఉన్నవాడనే ప్రతీతి ఉన్నది. అయితే ఆ మహాకవి క్రీ॥ శ॥ 7వ శతాబ్దంలో పల్లవరాజాస్థానంలో ఉన్నవాడూ, వేంగీ, తలకాడు రాజధానీ నగరాలను సందర్శించినవాడూ కావచ్చును. ప్రథమ

మహేంద్రవర్మ రెండు మనోహరప్రహసనాలు రచించాడు. వీటిలో ఒకటి "మత్తవిలాసప్రహసనం"; రెండవది "భగవదజ్జుక". ఈ రెండున్నూ సాంఘిక దురాచారాలను నిరసించటం కోసం బయలుదేరినవే. సుప్రసిద్ధుడైన దండిమహాకవి ప్రథమ నరసింహపల్లవునికి సమకాలికుడు అని ప్రతీతి. "అవంతీసుందర కథా" "దశకుమారచరిత్రా" ఆయన రచించినవే. దండి "కావ్యాదర్శం" సాహిత్య విమర్శక గ్రంథాలలో ఒకటి. ఆయన రచనలలో ఇది అత్యుత్తమం. సంస్కృత గద్య రచయితలలో ఆయనకు ఒక విశిష్టత ఉన్నది. ఇక వేదాంతసారస్వతంలో శ్రీ శంకరాచార్యులవారి బ్రహ్మసూత్రభాష్యమూ, ఉపనిషద్భాష్యమూ గీతాభాష్యమూ మాత్రమేకాకుండా కుమారిలభట్టు రచించిన "శాబరభాష్యమూ", "జైమిని మీమాంసాసూత్రభాష్యమూ" కూడా సుప్రసిద్ధాలు. కుమారిలభట్టు ఆంధ్రుడు. ఆయన క్రీ॥ శ॥ ఎనిమిదవశతాబ్దంనాటి వాడు. "పూర్వమీమాంస" లో ఆయన చేసిన పరిశ్రమ అపూర్వమైనది. కుమారిలభట్టు శిష్యుడైన ప్రభాకరుడు కేరళ దేశస్థుడు. ఈయనకూడా పూర్వమీమాంసాభాష్యానికి రెండు వ్యాఖ్యానాలు వ్రాశాడు. దక్షిణభారతంలో వేదాంత శాస్త్ర విషయంలో ఎక్కువకృషి జరిగింది. ద్వైతాద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతాలు మూడున్నూ ఇక్కడనుంచి బయలుదేరినవే. ఈ మూడింటిలోనూ 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే అద్వైతసిద్ధాంతం మహనీయుడైన శంకరాచార్యుల భాష్యాల

వలన ప్రచారమైనది. సురేశ్వరునివంటి ఆచార్య శిష్యులు కొంతమంది ఆయన భాష్యాలకు అమూల్యోజ్జ్వలవ్యాఖ్యానాలు చేశారు. క్రీ॥శ॥ 9వశతాబ్దంచివర నాథముని "యోగరహస్యం" "న్యాయతత్త్వం" అనే గ్రంథాలద్వారా విశిష్టాద్వైతాన్ని ప్రతిపాదించినా, పదోశతాబ్దానికి అవతలనే ద్వైతమూ(ద్వంద్వ వాదం) విశిష్టాద్వైతమూ (విశిష్టప్రతిపత్తివాదం) వ్యాప్తిలోకి వచ్చాయి.

సంస్కృతవ్యాకరణ విషయంలో శాకటాయనుడు నవీన దృక్పథం తీసుకొనివచ్చాడు. ఇతను రాష్ట్రకూటరాజైన అమోఘవర్షునికి సమకాలికుడు. ఇతను రచించిన "శబ్దాను శాసనం" జైనపండితుల్ని మాత్రమేకాక ఇతర పండితులను కూడా ఆకర్షించింది.

కర్ణాట వాఙ్మయం:- కన్నడ సాహిత్యం చాలా ఆలస్యంగా తలఎత్తిందని చెప్తారు. ఈ భాషలో ప్రాచీన మైన గ్రంథం క్రీ॥శ॥ 9వశతాబ్దంనాటి అమోఘవర్షుని "కవిరాజ మార్గం". అయితే చెప్పుకోదగ్గవాఙ్మయం కొంతఉంటేనేగాని కావ్యస్వరూపనిర్ణయంచేసే ఇటువంటి గ్రంథం పుట్టటానికి అవ కాశంలేదు. క్రీ॥ శ॥ 5 వ శతాబ్దానికీ 9 వ శతాబ్దానికీ మధ్య కాలంలో పుట్టిన ప్రాచీన కర్ణాట కావ్యాలను 'కవిరాజ మార్గం' పరామర్శిస్తున్నది. ఈ గ్రంథంలో కర్ణాట వచన రచ యితలలో ప్రసిద్ధుడైన దుర్వినీతుని ప్రశంస ఉన్నది. ఇతను క్రీ॥ శ॥ 6 వ శతాబ్దానికి చెందిన గాంగరాజు. అందువల్ల

క్రీ॥ శ॥ 8 వ శతాబ్దానికి పూర్వమే ప్రాచీన కర్ణాటం (పూర్వ దహళె) లో కొంత సాహిత్యసృష్టి జరిగిందని చెప్పాలి. క్రీ॥శ॥ 5 వ శతాబ్దంనాటి చిక్కమగళూరు శాసనమున్నా, దాని కంటె ప్రాచీనమైన శ్రవణ బెల్గోలా శిల్పాలపైన కనిపించే రచనలున్నా పరికిస్తే కొంత ప్రాథమికదశలో ఉన్నట్లున్నా, 4 వ శతాబ్దంనాటినుంచే సాహిత్యకృషి జరుగుతూవచ్చిందని స్పష్టపడుతుంది. కన్నడం ద్రావిడభాషా కుటుంబంలోని దనడం నిస్సందేహం. తమిళ్ గ్రంథ లిపికీ ఈలిపికీ పోలిక లున్నాయి. కర్ణాట వ్యాకరణ పద్ధతి కేవలం తమిళ వ్యాకర ణానుసారంగానే వున్నది. అయితే కాలంగడచినకొద్దీ కన్నడం మీాద సంస్కృతప్రభావం ఎక్కువవుతూ వచ్చింది. ఈప్రభావా నికి మూలకారకులు జైనులు కన్నడ వాఙ్మయం చాలావరకూ జైనపండితులవలన పెంపొందిందే. వారిలో తుంబులురా చార్యుడూ, శ్యామకుందాచార్యుడూ సుప్రసిద్ధులు. శివకోట్యా చార్యుడనే జైనపండితుడు రచించిన "దొడ్డఆరాధన" అనే గద్యగ్రంథం కన్నడభాషలో అతి ప్రాచీనమైనదని చాలామంది అభిప్రాయం. అయితే అది ఏకాలంలో పుట్టిందో నిర్ణయించ టానికి ఆధారాలు లేవు.

కాబట్టి నవీన కన్నడ వాఙ్మయచరిత్ర అమోఘవర్షుని "కవిరాజమార్గం" దగ్గఱనుంచే తెలుసుకోవలసివున్నది. మంచి కవిత్వాన్ని ఎలాగు ర్తించాలో అతను అందులోవిశదీకరించాడు. ఇతర భాషలనుంచి ఎరువు తెచ్చుకోవటం అతనికి గిట్టదు. 'హరి

వంశ' 'శూద్రక' గ్రంథాలను రచించిన ప్రథమగుణవర్మ (9వ శతాబ్దం)కూడా ప్రాచీన కన్నడ రచయితలలో ఒకడు.

తెలుగు వాఙ్మయం:- కన్నడదేశంలో మాదిరిగానే తెలుగుదేశంలోకూడా మొట్టమొదట వాగ్రూపంలో ఉన్న భాష ద్రావిడభాషాకుటుంబంలోదే అయిఉండాలి. ఇదన్నీ తమిళభాషకు తోడబుట్టువే. కుమారిలుడన్నట్లు పూర్వకాలపు తెలుగు 'ఆంధ్ర ద్రావిడ'భాష. బౌద్ధులూ, జైనులూ రావటంతో ఆంధ్రదేశంలో ప్రాకృతభాష ప్రవేశించింది. పైశాచి అనే ప్రాకృతభేదం వాడుకలోకి వచ్చింది. ఇది అప్పటికి వాడుకలోఉన్న ఇతరభాషలమీద తన ముద్రవేసింది. తర్వాత సంస్కృతభాషా సంపర్కం కలగడంతో నవీనాంధ్రభాష రూపొందింది.

క్రీ.శ. 5వ శతాబ్దినాటి శాసనాలవలన అప్పటికింకా పూర్వకాలంనుంచీ కాకపోయినా, ఆనాటికైనా తెలుగుభాషకు ఒకవ్యక్తిత్వంప్రారంభమైందని తేటతెల్లమవుతున్నది.సంస్కృతం తోనూ, తమిళంతోనూ దానికిగల అనుబంధం స్పష్టంగా గోచరిస్తుంది. తెలుగు ఛందస్సుమీద మొట్టమొదట వెలువడినది. "జైనాశ్రయచ్ఛందం" అనే గ్రంథం విష్ణుకుండిన వంశజుడైన ద్వితీయమాధవవర్మ (క్రీ.శ. 560–620సం॥) అనే చక్రవర్తిదీనిని రచించిఉండవచ్చును. ఇది తెలుగుఛందస్సునూ, నుడికారాన్నీ వివరించేదైనా, సంస్కృతంలోనే రచింపబడినది. కాని యీ గ్రంథం వెలువడడానికి చాలా ముందుగానే లిఖితరూపంలేక

పోయినా వాగ్రూపంలోనైనా అపారమైన సాహిత్యం ప్రచారంలో ఉండి ఉండాలి. తెలుగు సారస్వతంలో ఉత్తమరచన 11వ శతాబ్దంలో నన్నయ భారతానువాదంతో ప్రారంభమైంది.

తమిళ వాఙ్మయం :- క్రీ. శ. 6, 9 శతాబ్దాలమధ్య శైవనాయన్మార్లవల్లనూ, వైష్ణవ ఆళ్వార్లవల్లనూ తమిళ వాఙ్మయం క్రమక్రమంగా వృద్ధిఅవుతూవచ్చింది. తిరుజ్ఞానసంబందర్, తిరునావుక్కరసర్, సుందరమూర్తి అనే ముగ్గురు గొప్ప శివగేయ వాఙ్మయకర్తలు ఈ యుగంలోని వారు. వీరు ముగ్గురేగాక మాణిక్కవాచగర్ అనే గేయ వాఙ్మయకర్తకూడా ఈ యుగంలోనివాడే అయిఉండవచ్చును. ప్రసిద్ధులయిన పన్నెండుగురు ఆళ్వార్లు క్రీ॥ శ॥ 500 – 850 సంవత్సరాలమధ్యవారు. తిరుమాలికయ్ తేవర్, పట్టినత్తార్, కారైక్కాల్ అమ్మయ్యార్, కాదవార్ కోన్ అనేవారు నాయనార్లవలెనే పరిశ్రమించి ఈ యుగంనాటి భక్తిప్రధాన వాఙ్మయాన్ని అభివృద్ధిచేశారు. ఈ భక్త్యావేశపూరితమైన వాఙ్మయం అంతా లలితమూ, సుస్పష్టమూ, సుప్రసిద్ధమూ అయిన శబ్దజాలంతోనే నిండిఉన్నది. మూమూలార్ రచించిన తిరుమందిరం అనే 3000 పద్యాలుగల గ్రంథం, ఉన్నతమైన ఆధ్యాత్మిక దృక్పథంతో వెలసిన శైవ పురాణం. ఇదీ ఈ కాలంనాటిదే.

భక్తి వాఙ్మయాన్ని సృజించిన గౌరవం కొంత వైష్ణవ యోగులకు కూడా చెందవలసి ఉంటుంది. "నాలాయిర

ప్రబంధం” అనే నాలుగువందల భక్తిగీతాలుగల గ్రంథం కేవలం ఆత్మప్రబోధకంగా రచించబడ్డది. పన్నెండుగురు ఆళ్వార్ల కృతులలోనూ తిరుమంగై ఆళ్వారు గీతాలు కవిత్వ సంపదకూ, నమ్మాళ్వార్ గీతాలు ఆధ్యాత్మికభావ వైశిష్ట్యానికీ ప్రసిద్ధికెక్కినవి. పెరియాళ్వారూ ఆయన పెంపుడుకూతురు ఆండాళ్, అమూల్యగీతాలు రచించిన భాగవత శిఖామణులు. ప్రథమ మహేంద్రవర్మ అనే పల్లవరాజుకు సమకాలికుడైన తిరుమళిశై ఆళ్వారు “నాన్ముఖ తిరువందాది” “తిరుచ్ఛంద విరుత్తమ్” అనే రెండు ఉద్గ్రంథాలను రచించినవాడు. ఇవి జైన బౌద్ధమతాల తాకిడినుంచి వైష్ణవమతాన్ని సంరక్షించి అభివృద్ధిచెయ్యటంకోసం పుట్టినవి.

అష్టాదశ ఖండకావ్యాలని ప్రసిద్ధికెక్కిన పద్యకావ్యాలు కూడా ఈ యుగంనాటివే అని తోస్తుంది. అయితే ఇందులో సత్యం ఎంతవఱకున్నా “కురళ్” “కళవళి” అనేవి సంగం యుగం నాటివిగా కనిపిస్తాయి. ఈ అష్టాదశ ప్రబోధాత్మక కావ్యాలలోనూ, రాజనీతి, ప్రేమ, నీతి సూత్రాలను మనోరంజకంగా చిత్రించినది “కురళ్” కావ్యము. 400 నీతి ప్రబోధక పద్యాల సంకలనమైనది “నాలడియార్” గ్రంథము. ప్రతి పద్యంలోనూ ఏదో ఒక సామెతకానీ ఆర్యోక్తికానీ కనిపిస్తూ ప్రశంసనీయంగా సాగినది నాలుగువందల పద్యాల కావ్యం. “పఝమెయి”, నీతిమార్గాన్ని సూత్రప్రాయంగా శాసించి, మంచి సాహిత్యపు విలువకలది నన్మణిక్కడిగై కావ్యం, కేవల



ఎల్లోరాగుహలు - కైలాసమందిరము
పురావస్తు పరిశోధక శాఖవారి అనుమతితో



పాపనాథగుడి - పట్టాడకల్

పురావస్తు పరిశోధక శాఖవారి అనుమతితో



మహిషాసురమర్దని - మహాబలిపురం
పురావస్తు పరిశోధక శాఖవారి అనుమతితో

నీతిశాస్త్రంగా పరిగణించదగినది. "ఆసారకోవై" క్లుప్తంగానూ, లలితంగానూ భావాలను ప్రకటించటం అనే శక్తి ఈ కావ్యాలన్నిటిలోనూ కనిపిస్తుంది. ఈ యుగం చివరి భాగంలో "నందిక్కలంబకం" అనే 80 పద్యాల కావ్యం వెలువడింది. ఇది తృతీయ నందివర్మ పల్లవుని విజయాలను (క్రీ॥ శ॥ 830 – 854 సం॥) అభివర్ణిస్తున్నది. ఈ రాజు కొలువులోని పెరుందేవనార్ మహాభారతాన్ని తమిళంలోకి అనువదించాడు.

కళ :- ఈ యుగంలో అసంఖ్యాలైన దేవాలయాలు నిర్మించటం జరిగింది. దక్కనులో బౌద్ధులు ప్రారంభించిన జాతి శిల్పాలలో ముఖ్యంగా రెండురకాలు కన్పిస్తాయి. మొదటివి చైత్యాలు లేక పూజామందిరాలు. రెండోవి విహారాలు లేక మఠాలు. క్రీ॥శ॥ 5వశతాబ్దంనుంచీ ఈశిల్పకళకు మంచిప్రోత్సాహం లభించింది. హైద్రాబాదుసంస్థానంలోపలి అజంతా, ఎల్లోరా, ఔరంగాబాదులలో మధ్యభారతంలోని బాగ్‌లో ఈ చైత్య విహారాలకు అనుకరణంగా శిల్పసృష్టి జరిగింది. మహాయాన మతప్రభావంచేత అసలువిగ్రహాలేఉండరాని బౌద్ధవిహారాలలో బుద్ధవిగ్రహాలు నెలకొల్పటం తటస్థించింది. అజంతాలోని 28 గుహాలలో 23 గుహాలు క్రీ. శ. 4 – 7 శతాబ్దాలమధ్య తొలిచినవే. అన్నింటిలోనూ మొట్టమొదటివిగా కన్పిస్తున్న 16 వ 18 వ సంఖ్యలు గల గుహాలు 6 వ శతాబ్దంనాటి ఒకానొక వాకాటకరాజు కొలువులోని ఉద్యోగులు నిర్మింపజేసినవి. ఇక్కడి కుడ్యాలమీది వర్ణచిత్రాలు జగత్ప్ర

సిద్ధాలు. చాతుర్యంతో కూడిన చిత్రలేఖనమూ, ఉజ్జ్వలమైన వర్ణ రచనమూ ఈఅద్భుత శిల్పాలకు వన్నె తెచ్చాయి. క్రీ॥శ॥ 6వ శతాబ్దంనాటి బాగ్, వాతాపి, గుహాలలోని వర్ణచిత్రాలనూ, 7వ శతాబ్దంనాటి సిత్తన్నవాసల్ లోని జైనదేవాలయంలోను, కంచిలోని కైలాసనాథదేవాలయంలోనూ కల వర్ణచిత్రాలను చిత్రించిన చిత్రకారులకు అజంతాచిత్రాలే మార్గదర్శకాలయి నాయి. తొమ్మిదిగుహాలుగల బాగ్ శిల్పాలవరుస 6వ శతాబ్దం నాటిది. సిత్తన్నవాసల్ లోని జైనగుహాలలో ప్రథమమహేంద్ర వర్మ విగ్రహమూ, అతనిభార్య విగ్రహమూ, రకరకాల నృత్య భంగిమలను ప్రకటించే చిత్రాలూ ఉన్నాయి. మధ్యభారతం లోని బాగ్ లోగానీ, దక్షిణభారతంలోని సిత్తన్నవాసల్ కాంచీ పురాలలోగానీ, సింహాళంలోని సిగిరియాలోగానీ కల చిత్రరచ నకూ అజంతా చిత్రరచనకూ కేవలం స్థానికమైన స్వల్పవిష యాలలోతప్ప తక్కిన పద్ధతిలో భేదం ఎంతో లేదు.

ఔరంగాబాదు దగ్గఱ తొలిచిన గుహాలు పన్నెండు. ఇవి మూడుభాగాలుగా ఉన్నవి. ఒక్కొక్కభాగంలో నాలు గేసి గుహాలున్నవి. మొత్తం పన్నెండింటిలోనూ చైత్యం ఒక్కటే. తక్కినవన్నీ విహారాలే. ఈ చైత్యం క్రీ॥ శ॥ రెండుమూడు శతాబ్దాలనాటి పద్ధతిలో ఉన్నది. విహారాలు 7వ శతాబ్దంనాటిపద్ధతిలో ఉన్నవి. నగిషీలుగానీ, అలంకార విశే షాలుగానీ అజంతాగుహాచిత్రాల మాదిరిగానే ఉన్నవి. కాని యెంత జాగ్రత్తగా అనుకరణం జరిగినా యిక్కడి విగ్రహాలు

యంత్ర నిర్మితాలవలె జీవకళ లేకుండా ఉన్నవి. అయినామూడవ గుహాలో బుద్ధవిగ్రహంముందు మోకరిల్లుతున్నట్లు చిత్రించబడ్డ విగ్రహాలలో కొంత విశిష్టతా వ్యక్తిత్వమూ కనబడకపోవటం లేదు. ఔరంగాబాదు శిల్పుల నైపుణ్యం వీటిలో పరాకాష్ఠకు వచ్చింది. సహజతా సజీవతాలక్షణాలు కొట్టవచ్చినట్లున్నాయి.

ఎల్లోరాలో బౌద్ధహిందూజైన సంప్రదాయాలు మూడున్నూ కనిపిస్తాయి. ఇక్కడి శిల్పాలలో చాలావఱకు క్రీ.శ. 6–8 శతాబ్దాలమధ్య సృష్టించబడినవే. బ్రాహ్మణమత విశ్వాసానుగుణంగా వెలసిన 16 గుహాలలోనూ కైలాస దేవాలయం చాలా ముచ్చటగాఉన్నది. ఇది కంచిలోనికైలాస నాథాలయం నిర్మించినపద్ధతిలోనే నిర్మించబడింది. జైనగుహాలు తక్కినవాటితోపోలిస్తే చాలాతక్కువే. వాతాపిలోనిఒకటిన్నీ ఐహోలులోని ఒకటిన్నీ 7వశతాబ్దం మధ్యకాలంలో కట్టినవిగా కనిపిస్తాయి. ఎల్లోరాలోమాత్రం చూడదగిన గుహాలు చాలా ఉన్నాయి. అయితే ఇవి అన్నీ క్రీ.శ. 800సం॥ కంటె ముందు వెలసినవి కావు. శిల్పరచనాపద్ధతిలోగానీ, అలంకార విధానా లలోగానీ యివి బౌద్ధబ్రాహ్మణమతస్థులు నిర్మించిన గుహాల మాదిరిగానే ఉన్నాయి.

ప్రాచీన చాళుక్యుల రాజధాని అయిన వాతాపివద్ద బ్రాహ్మణమత సంప్రదాయచిహ్నితాలైన గుహామందిరాలు కనబడుతున్నాయి. వాతాపిలో కొండలుతొలిచి నిర్మించిన మందిరాలేకాక, విడిగా కట్టిన ఆలయాలుకూడా ఉన్నాయి.

శిల్పరచనలో ఇవిఅన్నీ ఒకేపద్ధతిప్రకారం కట్టినట్లు కనిపిస్తాయి. బ్రాహ్మణమత విశ్వాసానుగుణంగా నిర్మించిన మూడుగుహాల లోనూ పరస్పరసామ్యం బాగా కనిపిస్తుంది. వీటిలో మూడవ గుహా వైష్ణవులు నిర్మించినది. దీనిలో ఒక ప్రత్యేకత ఉన్నది. క్రీ॥ శ॥ 578 వ సంవత్సరానికి సరిఅయిన శకసంవత్సరం 500లో దీనినినిర్మించినట్లు ఇక్కడిశాసనంవల్ల తెలుస్తున్నది. ఈమూడు గుహాలకున్నూ అంతర్భాగాలు శిల్పకళాలక్ష్మికి ఆటపట్లు అని చెప్పవచ్చును. ఇక్కడి స్తంభాలమీాదనూ, కుడ్యాలమీాదనూ చెక్కిన రకరకాల బొమ్మలూ, అలంకారాలూ చూడ ముచ్చ టగా ఉన్నాయి.

చాళుక్యులకాలంనాటి శిల్పకళలో 7 వ శతాబ్దం నవీన యుగాది అనవచ్చును. ఇప్పటినుంచీ ఒక క్రొత్తతరహా బయలు దేరింది. వాతాపిదగ్గఱఉన్న పట్టక్కాల్ లో ఈ నవీనత ప్రతి బింబించే దేవాలయాలు పది ఉన్నాయి. అయినా వీటిలో ఆఱుమాత్రం దాక్షిణాత్యపద్ధతిలో కట్టినవే. ద్వితీయ విక్రమా దిత్యుని రాణి కట్టించిన విరూపాక్షాలయం కంచిలోని కైలాస నాథాలయానికి ప్రతిబింబంమాదిరిగా ఉన్నది. దీనిని దక్షిణ దేశపు శిల్పులే నిర్మించిఉంటారు. ఆలయప్రాంగణమూ, మంట పాలూ, శిలానిర్మితగవాక్షాలూ, ప్రదక్షిణంచెయ్యటానికి గుడి చుట్టూ అమర్చిన త్రోవలూ, ఎన్నో అంతరువులతో ఆకాశాన్ని చుంబించేట్టు నిక్కిన చతురస్రాకారపు శిఖరమూ, ప్రాకార కుడ్యాలమీాద చతురస్రాకారంగా అక్కడక్కడ నిర్మించిన

అందమైన బురుజులూ, ఆ యా శిల్పాలలోని స్త్రీ పురుష మూర్తుల వస్త్రధారణ పద్ధతులూ దాక్షిణాత్యసంప్రదాయాను గుణంగానే ఉన్నాయి.

దక్షిణాన శిలాశిల్పకళ పల్లవులతో ప్రారంభమైనది. ప్రథమ మహేంద్రవర్మ మహాబలిపురంలో తొలిపించిన గుహాలు తప్పితే దక్కనులో ఎక్కడా ప్రాచీనమైన గుహామందిరాలు లేవు. మహాబలిపురం గుహాలు తొలిచినవారికి అది ప్రథమ ప్రయత్నమనీ, అంతకుముందు ఆ విద్యతో అక్కడి శిల్పులకు పరిచయంలేదనీ తోస్తుంది. అయితే అటుతర్వాత ప్రథమ నర సింహావర్మ పల్లవునికాలంలో ఈ విద్యకు బాగా పోషణ లభిం చింది. అతను తన నగరం యావత్తూ బాళ్ళుతొలిచి నిర్మించిన మండపాలతో, రథాలతో, రకరకాల శిల్పాలతో నింపివేశాడు. అర్జున తపస్సు చిత్రించే శిల్పం చాలా సహజంగా ఉన్నది. అయితే గంగకోసం భగీరథుడు తపస్సుచెయ్యటం ప్రదర్శించే శిల్పం కళౌన్నత్యానికి గీటురాయి అనీ, ఏ చిన్నవిషయమున్నా వదలిపెట్టకుండా బాతిమీద అలా చిత్రించటం చాలాకష్టమనీ, విజ్ఞులందరూ అభిప్రాయపడుతున్నారు.

ఏది యేమైనప్పటికీ శిల్పకళమీద తర్వాత తరాలవారికి ఎంతో అభిమానం కల్గించిన పల్లవుల దేవాలయాలు ప్రథమ రాజసింహాపల్లవునికాలంనుంచీ క్రమంగా వృద్ధిఅవుతూ వచ్చాయి. ఈ పల్లవ దేవాలయాలను పరిశీలిస్తే వీటి నిర్మాణ విధానంలో ముఖ్యంగా రెండుదశలున్నట్లు తోస్తుంది. ఒకటి

రాజసింహునితో అతని పేర ప్రారంభమైనది. రెండవది అపరాజితునితో ప్రారంభమై అతని పేరనే ప్రఖ్యాతమైనది. మహాబలిపురంవద్ద సముద్రతీరాన కట్టిన దేవాలయమూ, కంచిలోని కైలాసనాథ, వైకుంఠపెరుమాళ్ దేవాలయాలూ, రాజసింహ నిర్మాణపద్ధతికి చక్కని దృష్టాంతాలు. కంచిలోని ముక్తేశ్వర, మతంగేశ్వరాలయాలూ, తిరుత్తనిలోని విరాట్టానేశ్వరాలయమూ అపరాజితనిర్మాణపద్ధతికి చూడదగ్గవి. అయితే నిజానికి అపరాజిత నిర్మాణపద్ధతిలో కట్టినవి. పరిమాణంలో చిన్నవి మాత్రమేకాక, రాజసింహ నిర్మాణపద్ధతికంటె ఎక్కువ మెరుగులేవీ కలవికావు. పల్లవాధికారం క్షీణిస్తూ వచ్చినట్లే పల్లవశిల్పకళకూడా క్షీణిస్తూ వచ్చిందనటానికి ఇవి నిదర్శనాలు. అయితే పల్లవులు శిల్పకళాలక్ష్మికి చేసినసేవ మహత్తరమైనది. పెనుఱాళ్ళలో జీవకళచిందించే శిల్పకళానైపుణ్యం వారితోనే ప్రారంభమైనది. మొట్టమొదటివారు కొండలుతొలిచే పద్ధతితో గుహాలు నిర్మించటం ప్రారంభించి, అటుతరువాతదక్షిణభారతం అంతటా ఱాతిశిల్పాలను సృష్టింపజెయ్యటమే కాకుండా, భారతీయుల వలసరాజ్యాలైన దూరప్రాచ్యదేశాలలోకూడా అనేక దేవాలయాలు నిర్మింపజేశారు.

# ఏడవ ప్రకరణం

## హిందూ నవోదయం

క్రీ. శ. 6 – 9 శతాబ్దాల నడుమ దక్షిణ భారతంలో వేర్వేఱు రాజ్యాలు అధికారం కోసం ప్రాకులాడుతూ ఉండగానే పెద్ద ఎత్తున మత విప్లవం కూడా జరుగుతూ వచ్చింది. క్రీస్తు శకం తొలి శతాబ్దాలలో హిందూ బౌద్ధ జైన మతాలు మూడూ కూడా అన్యోన్య శత్రుత్వానికి పాలు గాకుండానే ప్రక్క ప్రక్కల వర్ధిల్లుతూ వచ్చాయి. 7 వ శతాబ్దంలో బౌద్ధం ఆంధ్ర కేరళ దేశాలలో నిలువ నీడ లేనిదైంది. అయినా ఈ రెండు దేశాలలోనూ బౌద్ధ విహారాలు మొదలయినవి కట్టటం జరుగుతూనే ఉన్నది. ఇక తమిళహాంలో బౌద్ధ మత ప్రాబల్యం సాగుతూనే వచ్చింది. జైన మతం ఒక్క తమిళ దేశం లోనే కాకుండా, దక్షిణ భారతం లోని ఇతర ప్రాంతాలలో కూడా ప్రబలంగానే ఉన్నది. పశ్చిమ గాంగులూ, అనేక చాళుక్య చక్రవర్తులూ జైనమతాన్ని అభిమానిస్తూనే వచ్చారు.

6 వ శతాబ్దం అంత్యం నుంచీ దక్షిణ భారతం లోని సనాతన హిందూ మతస్థులు ఈ ఉభయ మతాల ముంచుకా తమ మతం ఏమౌతుందో నని భయ పడుతూ ఉండి నట్లు కన బడుతుంది. ఈ నిస్పృహే ఏడవ శతాబ్దం నుంచీ ఒక విధమైన

మతోద్రేకాలకి కారణమైంది.[1] ఈమతోద్రేకం క్రమంగా భక్తి ఉద్యమంగా పరిణమించి 9 వ శతాబ్దం చివరి వరకున్నూ దేశ మంతటా రాజ్యం చేసింది. 9 వ శతాబ్దానికి తర్వాత కూడా అప్పుడప్పుడు మారుగు పడుతూ వచ్చి నప్పటికీ ఈ ఉద్యమ ప్రభావం కేవలం అదృశ్యంగా లేదు.

ఈ మతోద్రేక వీచిక విభిన్నాచారాలకూ, బహుళ తత్త్వ సిద్ధాంతాలకూ కారణం కావటానికి బదులు యథార్థమైన భక్తి మీదనే తన శక్తిని కేంద్రీకరించింది. హిందువులకు ముఖ్యంగా ఆరాధ్య దేవతలు శివవిష్ణువులు. నిర్గుణారాధనస్థానాన్ని సగుణారాధన ఆక్రమించింది. ఈ యుగ లక్షణమైన ఆవేశానికి లోనైన యోగులూ, మహా భక్తులూ అనేకులు పుణ్యక్షేత్రాలకు యాత్రలు చేస్తూ భక్తిగీతాలను గానం చేసేవారు. దయామయుడూ, మానవుని దుఃఖాలను తత్క్షణం నివారించే వాడూ, అఖండమైన ఆనందాన్ని ప్రసాదించే వాడూ అయిన ఇష్ట దైవం పట్ల గాఢమైన భక్తి ఉప్పొంగింది. ఈ ఉద్యమానికి నాయకత్వం వహించిన ఆచార్యులు తమకు ప్రతిస్పర్థులైన జైనులతోనూ బౌద్ధులతోనూ మత విషయమైన చర్చలలో స్వయంగా పాల్గొన్నారు. హిందువులలోని శైవ వైష్ణవ శాఖలు

---

[1] ఈ మతోద్రేకానికి ఇస్లాముమత సిద్ధాంతాలు దోహదం చేసి ఉంటాయి అనే ఊహ అసంగతంగా కనిపిస్తుంది. యథార్థభక్తుని ప్రోత్సహించే బౌద్ధ జైన మతాల ప్రభావమే ఈ ఉద్యమానికి కొంతవరకు కారణం అయిఉంటుంది.

రెంటి లోనూ భక్తి ఉద్యమం బయలు దేరింది. ముందు శైవ శాఖలో బయలు దేరిన ఉద్యమాన్ని పరిశీలిద్దాము.

అరవై ముగ్గురు శైవ మతాచార్యులు లేక 'నాయనార్లు' శైవ మతోద్ధరణ చేసి నట్లుగా ప్రసిద్ధి ఉన్నది. ఈ అరవై ముగ్గురున్నూ వేర్వేరు కులాల నుంచీ, రక రకాల తరగతుల కుటుంబాల నుంచీ వచ్చిన వారు కావటం గమనించ తగ్గది. నాయనార్లలో బ్రాహ్మణులూ, రాజులూ, సేనానులూ వైశ్యులూ, రైతులూ, గొల్లలూ, కుమ్మర్లూ, సాలెలూ, బోయలూ, పల్లెకారీలూ, చివఱకు అస్పృశ్యులు కూడా ఉన్నారు. ఈ నూతనోత్తేజం ఎంత సర్వ సామాన్యంగానూ సర్వతోముఖంగానూ వర్ధిల్లిందో దీనినిబట్టి ఊహించ వచ్చును. పెరియకుళంలో జన్మించిన నందుడనే భక్తుడు ఎన్ని ఆటంకాలు కలిగినా అతిక్రమించి చిదంబరంలో శివుణ్ణి అర్చించాలనే తన ఏకైక లక్ష్యాన్ని సాధించి మోక్షం పొందాడు. శివ భక్తాగ్రే సరుడైన శేక్కిలార్ రచించిన పెరియ పురాణం ఈ నాయనార్ల జీవితాలూ వారు చేసిన పనులూ విశదంగా వర్ణిస్తున్నది

నాయనార్లలో తిరుజ్ఞానసంబందర్, తిరునావుక్కరసు నాయనార్, సుందరమూర్తి, మాణిక్కవాచకర్లు చాలా విశిష్టులనడంలో సందేహంలేదు. తిరుజ్ఞానసంబందర్ షియాలీ లోని ఒక బ్రాహ్మణకుటుంబంలో జన్మించాడు. ఈయన మూడేండ్ల పసిపిల్లవాడై యుండగా ఈశ్వరుని అర్ధాంగిఅయిన పార్వతీదేవి స్తన్యంద్వారా దివ్యజ్ఞానాన్ని ప్రసాదించిందని

ప్రజల విశ్వాసం. పిల్లవానిలో కలిగిన దివ్యశక్తిని గుర్తించిన తండ్రి కుమారుణ్ణి బుజంమీద కూర్చుండబెట్టుకొని గుడిగుడికీ తీసుకొనివెళ్ళుతూఉంటే, కుమారుడు భగవన్నుతిగీతాలను గానంచేసేవాడు. ఇతను తన 16 సంవత్సరాల స్వల్పజీవితం లోనే లెక్కపెట్టడానికి వీలులేనన్ని శివాలయాలను సందర్శించి తన గేయకవిత్వంచేత సుప్రసిద్ధుడైనాడు. ఈయన రచించిన పాటలు పదివేలు అని ప్రసిద్ధిఉన్నదికానీ మనకు ఇప్పుడు తెలిసినవి 384 మాత్రమే. ఈయన దేశసంచారం చేస్తూ ఉండగా, పాండ్యదేశపురాణీ, మంత్రికూడా ఈయనను తమ రాజ్యానికి రావలసిందనీ, మహారాజునుసైతం కైవసం చేసికొన్న జైనమత దౌర్జన్యంనుంచి దేశాన్ని రక్షించవలసిందనీ అభ్యర్థించారు. సంబందర్ తత్క్షణం మధురకువెళ్ళి, ఎన్నో మహిమలు ప్రదర్శించి, మతవివాదాలలో జైనులను జయించి హిందూమతానికి అఖండవిజయం తెచ్చాడు. ఈ సందర్భంలో 8000 మంది జైనులకు మరణశిక్ష పడ్డట్లు చెప్పుతారుగానీ ఇది కేవలం అతిశయోక్తిమాత్రమే. తమిళదేశంలో బౌద్ధ జైన మతాలకు ఉప్పు పత్రీ పుట్టకుండాచేసినవాడు సంబందరే అనటంలో అనుమానంలేదు. ఆయన ప్రతిగీతమూ శైవమతం పట్ల లోకులకుకల అవిశ్వాసాన్ని ఖండిస్తూ, శివమహిమను కీర్తిస్తూఉంటుంది. ఈయన 7వ శతాబ్దం నడిమికాలంలో జీవించిఉన్నట్లు తెలుస్తున్నది.

తిరునావుక్కరసు నాయనార్ (అప్పర్) :- ఈయన దక్షిణ ఆర్కాటుజిల్లాలోని తిరువామూర్‌లో వెల్లాలకులంలో జన్మించాడు. తిరునావుక్కరసు జన్మతః శివభక్తుడు. కాని కొంతకాలానికి జైనమతం అవలంబించి, అటుపిమ్మట మళ్ళీ శివభక్తుడైనాడు. తనసోదరుడు మతాంతరుడైనందుకు విచారపడ్డ అతని సోదరి కొన్ని అద్భుతాలుచేసి అతనిని తిరిగి శైవ మతంలోకి రప్పించినట్లుగా ఒకకథ ప్రచారంలోఉన్నది. తిరునావుక్కరసుకు తీవ్రమైన జబ్బుచేసింది. జైనులెవ్వరూ దానిని నివారించలేకపోయారు. అప్పుడు అతనిసోదరి శివుణ్ణిగూర్చి ప్రార్థించింది. శివానుగ్రహంవల్ల అతనికి వ్యాధి నయమైంది. ఆ అద్భుతం జరిగేసరికి అతను మళ్ళీ శైవుడైనాడు. అందుకు కుపితులైన జైనులు అప్పుడు దేశాన్ని పాలించే ప్రథమ మహేంద్రద్వారా తిరునావుక్కరసును హింసించటానికి ప్రయత్నించారు. కాని అతను శివునికటాక్షంవల్ల ఆ అగ్నిపరీక్షలన్నిటినీ తట్టుకోగలిగాడు. తిరునావుక్కరసు దివ్యశక్తికి ఆశ్చర్యపడ్డ రాజు తానుకూడా జైనమతం పరిత్యజించి శైవ మతం అవలంబించాడు. అప్పటినుంచీ తిరునావుక్కరసు శివ క్షేత్రాలు సందర్శిస్తూ తన గేయాలలో శివుణ్ణి కీర్తించటం ప్రారంభించాడు. ఇతను ఈవిధంగా దేశసంచారం చేస్తూ వుండగా ఒకచోట సంబందర్ తటస్థపడ్డాడు. సంబందర్ అంతకు ముందే తిరునావుక్కరసు ప్రశస్తి వినిఉన్నాడు. అందుచేత అతన్నిచూడగానే అప్పా (తండ్రీ) అని సంబోధించాడు. తి

నాప్పక్కరసుకు అప్పర్ అనే పేరు రావటానికి ఇదే కారణం. కొంతకాలంవఱకూ ఈ యిద్దఱుభక్తులున్నూ జతగా తీర్థ యాత్రలుచేస్తూ మతప్రచారం చేశారు. తర్వాత అప్పర్ తన జీవితకాలమంతా శివభక్తిప్రచారానికే వినియోగించి 81 వ సంవత్సరంలో శివసాయుజ్యం పొందాడు.

సుందరమూర్తి:- అప్పర్ నిర్యాణం పొందిన కొన్ని దశాబ్దాలకు సుందరమూర్తి జన్మించాడు. ఇతని జన్మస్థలం కూడా దక్షిణ ఆర్కాటు జిల్లాలోని ఒక గ్రామం. సుందర మూర్తి శివార్చకుల యింట పుట్టాడు. ఇతనికి వివాహం కానున్న సమయాన శివుడు వృద్ధబ్రాహ్మణ రూపంలో ప్రత్య క్షమై అతను తనకు అమ్ముడు పోయిన బానిస అని చెప్పి వివాహం జరుగకుండా ఆపి వేసినట్లు ఒక కథ ఉన్నది. తర్వాత సుందరమూర్తి శివునకు ప్రియ భక్తుడై శివమహిమ గానం చేస్తూ ఊరూరా తిరగటం మొదలు పెట్టాడు. అటు పిమ్మట అతను రెండు సార్లు వివాహం చేసికొన్నాడు. అంధు డయి ఈశ్వరుని ఆగ్రహానికి గురియైనాడు కూడాను. కాని కొంత కాలానికి శివానుగ్రహ పాత్రుడు కాగలగటమే కాకుండా దృష్టి లాభాన్ని కూడా పొంద గలిగాడు. చివఱకు అతను దేశాటనం చేస్తూ రాజర్షి అయిన చేరమాన్ పెరుమాళ్ళను కలిసి కొన్నాడు. ఇద్దరున్నూ కొంత కాలం దైవ ధ్యానంలో గడపిన తర్వాత మోక్షం పొందారు. సుందర్ జీవించినది 18 సంవత్సరాలు మాత్రమే. అతను వేల కొలది పాటలు రచించి

నట్లు చెప్పుతున్నారు కాని ఇప్పుడు దాదాపు వంద పాటలు మాత్రమే కనబడుతున్నాయి. అతని పాటలలో భగవంతుని యందు అతనికిగల గాఢమైత్రీభావం ప్రస్ఫుటమౌతున్నది. పదోశతాబ్దివాడైన నంబిఅంఢార్ నంబినాయనార్ల పాటలన్నింటినీ తేవారం అనే గ్రంథంలో సంకలనం చేశాడు.

మఱొక శైవమతాచార్యుడైన మాణిక్క-వాచగర్ ఏకాలం నాటివాడో అనేది ఇప్పటికిన్నీ వివాదాస్పదంగానే ఉన్నది. సుందరమూర్తి పేర్కొన్న శైవాచార్యుల పట్టిక (తిరుత్తొండ త్తొగై)లో మాణిక్క-వాచగర్ ప్రసక్తి లేకపోవటంచేతనూ, 6 వ శతాబ్ది ఉత్తరార్థంలో రాజ్యమేలిన వరగుణపాండ్యుని కాలంలో ఇతని ప్రశంస కనబడటంచేతనూ, ఇతను ఈపాండ్య రాజుకు సమకాలికుడై ఉండవచ్చునని తోస్తుంది. అందుచేత ఇతను తేవారంత్రిమూర్తులకు ముందుగాక తర్వాతనే జన్మించి ఉంటాడు. మాణిక్క-వాచగర్ పాండ్యరాజమంత్రులలో ఒకడు. అయితే దైవభక్తి అతిశయించి మంత్రిగా తనకుకల బాధ్యతలను అలక్ష్యంచేసినందువల్ల ఇతను పదభ్రష్టుడైనాడు. ఇతని పాటలు 'తిరువాచగమ్' అనేపేర గ్రంథస్థమైనాయి. ఇవి నిజంగా హృదయాన్ని పులకింపజేస్తాయి. కాలక్రమాన అతనిలో కలిగిన భక్తి భావ పరిపక్వత అంతా ఈ పాటలలో ప్రతిబింబితమౌతున్నది. అందుచేత 'తిరువాచగమ్' మాణిక్క-వాచగర్ ఆధ్యాత్మిక జీవితచరిత్రగా సంభావించబడుతున్నది. తిరువాచగమ్ తాత్పర్యం తెలిసికొంటే తన్మయుడుకానివాడు

వట్టి నీరసుడో పాషాణప్రాయుడో అయివుండాలన్న మాట ఒప్పుకొనితీరవలసిందే. పరమేశ్వరునికి ఆత్మసమర్పణం చేసికోవాలనే శైవమతసిద్ధాంతం 'తిరువాచగం'లో చక్కగా ప్రతిపాదితమైనది. స్వార్థరహితమైన భగవత్ప్రేమ ప్రధాన లక్ష్యంగాకల అతని పాటలలో ప్రతిగీతానికీ రెండేసి అర్థాలున్నాయి. నటరాజమహిమను కీర్తించే 'తిరుచిత్రబలక్కోవై' అనే మరొక గ్రంథంకూడా అతను రచించినట్లు తెలుస్తున్నది. సింహళంనుంచివచ్చిన బౌద్ధులతో చిదంబరంలో వాదించి మాణిక్కవాచగర్ అద్భుతవిజయం పొందినట్లుగా ప్రతీతి ఉన్నది.

ఇతర శైవాచార్యుల చరిత్ర ఎలా ఉన్నా ఈ నలుగురు మతోద్ధారకులున్నూ శివభక్తి ఉద్యమాన్ని ప్రచారం చేసి, దక్షిణ భారతంలో హిందూ మత విశ్వాసాలనూ సంప్రదాయాలనూ కొన్ని శతాబ్దాల పాటు నిలబెట్ట గలిగారు. నాయనార్లను గురించిన పురాణ గాథలన్నీ యథార్థాలు కాకపోవచ్చును. అయితే తమిళదేశంలోని ప్రజలందరూ వాటిని గాఢంగా విశ్వసించారనే విషయం జ్ఞాపకం పెట్టుకోవాలి. హృదయాన్ని స్పందింప జేసే నాయనార్ల గీతాలకు వేలకొలది ప్రజలు ముగ్ధులౌతున్నారు. చోళ సామ్రాట్టుల కాలంలో ప్రధానులయిన నాయనార్లకు దేవతలతో బాటు పూజలు జరిగాయి. వారి జీవితాలలోని ఘట్టాలు దేవాలయాలలో జరిగే వార్షికోత్సవాలలో ఒక భాగంగా నాటక రూపాన ప్రదర్శించ

టమున్నూ జరిగేది. ఇంతే గాక ఇప్పటికి ఎన్నో శతాబ్దాలు గడిచినా, నాటినుంచి నేటివఱకున్నూ, నాయనార్ల పాటలు దేవాలయాలలో నిర్ణీత వేళలందు నిత్యమూ గానం చేయటం కూడా జరుగుతున్నది.

వారి ప్రభావం తర్వాత కాలంలో కూడా అనేక శైవ యోగులనూ, ఋషులనూ సృష్టించినట్లు కనబడుతుంది. తమిళ దేశంలో పదో శతాబ్దిలో పటినత్తుపిళ్ళయార్ జన్మించాడు. ఇతని భక్తిగీతాలు నాయనార్ల పాటల వలెనే చాల ప్రచారం లోకి వచ్చాయి. ఇతను కావేరి పట్టణం లోని ఒక సంపన్న కుటుంబంలో జన్మించాడు. అయితే చిన్నతనంలోనే వైరాగ్యం పొంది అనేక పుణ్యక్షేత్రాలు సందర్శిస్తూ, మదరాసు దగ్గఱ తిరువత్తియూర్‌లో కొంతకాలం నివసించాడు. "కోవిల్ నమ్మణి మాలై" అనే ఇతని గ్రంథం లోని భక్తి గీతాలు నాయనార్ల పాటల వలెనే హృదయాన్ని విప్పి చూపు తున్నట్లు చక్కని భావస్ఫూర్తితో తొణికిస లాడుతూ ఉంటాయి. పదో శతాబ్దం లోని వారైన తిరుమాళిగై తేవర్, కరువూర్ తేవర్, సేంతనార్, చోళరాజకుమారుడైన కందరాదిత్తన్ మొ॥ కొందరు శైవయోగులు అనేక శైవక్షేత్రాలను గురించి 29పద్యకావ్యాలు రచించారు. ఈపద్యాలను నంబియుండార్ నంబి తిరుయిశైపా అనే గ్రంథంగా సమకూర్చాడు. తర్వాత తరాలలో బయలుదేఱిన శైవ కావ్యాలలో కూడా ఈ భక్తి ఉద్యమం ప్రభావం ఉన్నదనటం అతిశయోక్తి కాదు.

పెరియ పురాణం రచించిన సేక్కిళారు (1133-60) మురుగన్‌ను దేవాధి దేవుడుగా విశ్వసించి;తిరుప్పుగళ్ రచించినఅరుణగిరినాథార్, 17 వ శతాబ్దిలోని మహాభక్తుడు తాయుమానవర్ 19వ శతాబ్దిలో అరుళ్పా కావ్యం రచించి సుప్రసిద్ధుడైన రామలింగ స్వామిగళ్ ఈభక్తి ఉద్యమం వల్ల ప్రభావితులైనవారే.

శైవ మతంలోని ఆధ్యాత్మిక విభాగంమీదకూడా భక్తి ఉద్యమం ప్రభావం ప్రసరించకపోలేదు. శైవమతం యొక్క ఆధ్యాత్మిక సిద్ధాంతాలను చక్కగానిర్వచించిన మహావిద్వాంసుడు తిరుమూలర్. అతను ఏకాలంనాటివాడో ఇంకా నిర్ణయంకాలేదు. కొంతమంది అతను 5, 6 శతాబ్దాలలోమధ్య ఎప్పుడో జీవించిఉంటాడని చెప్తున్నారు. మరికొందరు అతన్ని తొమ్మిదోశతాబ్దంవాడని అంటున్నారు. ఏదియేమైనప్పటికీ అతని ఆధ్యాత్మిక సిద్ధాంతం నాయనార్ల భక్తిఉద్యమానికి మూలంగాగాక ఫలితంగానే కనిపిస్తున్నది. ఇంతేగాక అతని రచలలో మొదటిదైన తిరుమందిరాన్నిగూర్చిన ప్రశంస పన్నెండోశతాబ్దంనాటి పెరియపురాణంలోనే కనిపిస్తున్నది. తిరుమందిరం గ్రంథకర్తకు అనుభవంలోఉన్న 3000 మంత్రాలు కల అత్యద్భుతమైనగ్రంథం. ఇది శివమాహాత్మ్యాన్ని చక్కగా నిరూపిస్తున్నది. ఆగమాలు క్షుణ్ణంగానేర్చినవాడు కావటంవల్ల ఈగ్రంథకర్త ఆగమాలకూ వేదాలకూ పరస్పరసమన్వయాన్ని సాధించటానికి కృషిచేశాడు. నిజానికి ఇతను ఆగమవిహితమైన

శైవమతంయొక్క ఆధ్యాత్మిక సిద్ధాంతానికి మూలపురుషుడు. ప్రకృతీ, ఆత్మ అనేవి యథార్థాలనీ ప్రేమ అనేది శివునితో తాదాత్మ్యం కలిగిస్తుందనీ ఇతడుబోధించాడు. "శివజనబోధం" అనే తన గ్రంథంలో మెయికండర్ శైవసిద్ధాంత ముఖ్యోద్దేశంగా ఇదే సిద్ధాంతాన్ని "పతి-పశు-పాశము" అనే పేర ప్రతిపాదించాడు.

ఇంతేకాక దక్షిణభారతంలో అద్వైత సిద్ధాంతానికి ప్రధానాచార్యుడైన శంకరాచార్యుడుజన్మించాడు. క్రీ॥శ॥790వ సం॥ ప్రాంతంలో నంబూద్రి కుటుంబంలోపుట్టి, శంకరుడు చిన్నతనంలోనే పరివ్రాజకుడైనాడు. అద్వైతమతప్రబోధంచేస్తూ భారతదేశమంతటా పర్యటించాడు. గొప్ప మేధావి మాత్రమే కాక, ఇతరులనుకూడగట్టుకొని నిరాటంకంగా కార్యనిర్వహణం సాగించగల సమర్థుడైన ఈయన హిందూదేశంలోని ముఖ్యప్రదేశాలలో మనాలుగు తాలు నెలకొల్పాడు. ఉపనిషత్తులకూ, భగవద్గీతకూ, బాదరాయణుని బ్రహ్మసూత్రాలకూ ఈయనచేసిన వ్యాఖ్యానాలు సుప్రసిద్ధాలు. ఇవి అన్నీ అద్వైత వేదాంతానుగుణమైనవే. నిత్యసత్యమైనవస్తువు ఒక్కటే అనీ, జీవాత్మ ఆ సత్యపదార్థానికి అభిన్నమైనదనీ ఈయన సిద్ధాంతంలోని సారాంశం, అజ్ఞానంగమనకనశిస్తే ఇది అనుభవగోచరం అవుతుంది. ఈయనకూడా కొద్దివయస్సులోనే కీర్తిశేషుడైనా తనతర్వాతతరాలప్రజలమీదకూడా తనప్రభావాన్ని ముద్రించగలిగాడు. హిందూదేశమంతటా అనేకలక్షలమంది ప్రజలు

అత్యంతభక్తి విశ్వాసాలతో నేటికీన్నీ శంకరజయంతిజరుపుతూ ఉన్నారు. ఆయన శిష్యులు నలుదిక్కులా ఆయన సిద్ధాంతాలను ప్రచారం చేస్తున్నారు.

పన్నెండవ శతాబ్దంలో ఆంధ్ర కర్ణాట దేశాలలో ఉదయించిన "వీరశైవం" లేక 'లింగాయతు పూజ' హిందూసంఘ సంస్కరణోద్యమం యొక్క మరొక శాఖ. ఈ లింగాయతు ఉద్యమపు ప్రథమదశ యెటువంటిదో తెలియదు. క్రీ. శ. 1156 వ సం॥లో కల్యాణీచాళుక్యుల రాజ్యాన్ని వశపరుచుకున్న బిజ్జలునికి ప్రధానమంత్రి అయిన బసవేశ్వరుడు ఈమతాన్ని స్థాపించాడని ప్రతీతి. కొంత మంది అతను కేవలం ప్రాచీన మత సిద్ధాంతాన్నే ప్రచారం చేసిన వాడనీ ఏకందాడ రామయ్య అనేఒకవ్యక్తి ఆ మతానికి మూలపురుషుడనీ అంటారు. అయితే ఈ బసవేశ్వరుని కంటెనూ ఏకందాడ రామయ్య కంటెనూ ప్రాచీనులైన అయిదుగురు పరివ్రాజకులు ఈ లింగాయతు మతాన్ని ప్రవచించినట్లు ఆమత గ్రంథాల వల్ల తెలుస్తున్నది. ఈ మతంలో శివుడే దేవాధి దేవుడు. ఈ మత సిద్ధాంతాలకు 28 శైవ ఆగమాలూ మూలాధారం. భక్తిసిద్ధాంతం పట్ల వీర శైవులకు కల గౌరవం అరవై ముగ్గురు నాయనార్లనూ తమకు మార్గోపదేష్టలు గానూ, చైతన్య ప్రదాతలు గానూ వారు పేర్కొనటం వల్ల స్పష్టమాతున్నది. అయితే వీర శైవానికి ఇతర మతాలంటే ఎంత మాత్రమూ గిట్టదు. అది వేదాలను తిరస్కరించి వర్ణవ్యవస్థను త్రోసి రాజన్నది. అయితే వీర శైవ సంఘంలో

కుల విభేధం అనేది లేక సర్వ సమానత ఉండటం గమనించ దగ్గ విషయం. భక్తి ప్రధాన మైన ఎంతో సారస్వతం ముఖ్యంగా కన్నడంలో వెలువడింది. వీర శైవంలోని ఒక శాఖ అయిన ఆరాధ్య శైవం తెలుగు దేశంలో ఎక్కువ విరి విగా కనబడుతుంది. బసవేశ్వరునికి సమకాలికు డైన పండితా రాధ్య మల్లిఖార్జునుడు దీనిని ప్రవేశ పెట్టాడు.

వైష్ణవం :- దక్షిణభారతంలోని భక్తి ఉద్యమం శైవమతంలోనేకాక వైష్ణవ మతంలో కూడా ఒకే విధమైన పరివర్తనాన్ని కలిగించింది. వైష్ణవులలో కూడా యోగులే పాటల ద్వారా భక్త్యావేశాన్ని రగుల్కొలిపి, భావుకులై మతసంబంధమైన తాత్విక సిద్ధాంతాలలో అభ్యున్నతి సాధిం చారు.

దివ్యశక్తి సంపన్నులైన పన్నెండుగురు ఆళ్వార్లూ నాయ నార్ల వలెనే తమిళ దేశంలోని వివిధ ప్రాంతాల నుంచీ విభిన్న కులాలనుంచీ రకరకాలతరగతులకు చెందిన కుటుంబాలనుంచీ వచ్చిన వారు. పురాణాలలో ఈ ఆళ్వార్లు క్రీస్తు శక ప్రారంభా నికి ఎన్నో వేల సంవత్సరాలు ముందుగానే ఉదయించి నట్లూ, ఒక్కొక్కరు సుదీర్ఘకాలం జీవించినట్లూ కనబడు తున్నది, కాని పరిశోధనల మూలంగా తేలినవిషయ మేమంటే వీరం దఱూ క్రీ.శ. 500- 850 సంవత్సరాల మధ్య ఉన్నవారనే. వీరిని మూడు తరగతులుగా విభజించ వచ్చును. పొయ్ ఘయ్ ఆళ్వారూ, భూదత్తాళ్వారూ, పేయాళ్వారూ, తిరుమళిశై

ఆళ్వారు మొదటి తరగతికి చెందినవారు. వీరు వరుసగా, కంచి మల్లై (మహాబలిపురం), మైలాపూర్, తిరుమళి శైలలోని ఉన్నత కుటుంబాలలో జన్మించిన వారు. కాబట్టి వీరు నలుగురూ పల్లవ దేశంలో ఉదయించినవా రనవచ్చును. నమ్మాళ్వారూ, మధురకవి ఆళ్వారూ, కులశేఖ రాళ్వారూ, పెరియాళ్వారూ, ఆండాళ్లూ రెండవ తరగతికి చెందినవారు. చేర దేశీయుడు కులశేఖరుడు తప్ప తక్కిన వారందరూ పాండ్యరాష్ట్రంలో పుట్టిన వారే. తొండరడిప్పొడియాళ్వారూ, తిరుప్పాణా ఆళ్వారూ. తిరుమంగై ఆళ్వారూ చోళ దేశీయులు.

ఇప్పుడు మనం ఈ ఆళ్వార్లను గూర్చి, భక్తి ఉద్యమానికి వీరు చేసిన దోహదం గూర్చి స్పష్టంగా తెలిసికొందాము. మొదటి ముగ్గురు ఆళ్వారులున్నూ ఒక నాటి రాత్రి తిరుక్కోవలూర్లోని ఒకే ప్రదేశంలో విశ్రమించి నట్లూ విష్ణు దేవుడు కూడా వారితో కలిసి కొంతకాలం గడిపినట్లూ పురాణ కథ చెప్పుతున్నది. భగవత్సాంగత్యం వల్ల ఆళ్వార్లలో కలిగిన ఆనందాతిశయమే వారిలో ఒక్కొక్కరి చేత ఒక్కొక్క వంద గీతాలను పలికించింది. తర్వాత వారు తిరువళిక్కేళికి వెళ్లి తిరుమళిశై ఆళ్వారును కలిసి కొన్నారు. అక్కడ నుంచి నలుగురూ కలిసి అనేక వైష్ణవ క్షేత్రాలను సందర్శించి అటు పిమ్మట ఎవరిదారిని వారు వెళ్లిపోయారు.

తిరుమళిశై పుట్టుకచేత బ్రాహ్మణుడే కానీ పుట్టిన నాడే తలిదండ్రులకు దూరమై పోగా, తక్కువ కులానికి

చెందిన తిరువాళన్ అతనిని పెంచి పెద్దవాణ్ణి చేశాడు. సత్యాన్వేషణ పరాయణుడైన తిరుమళిశై జైన బౌద్ధ శైవాలను చవి చూచి చివరకు వైష్ణవం స్వీకరించి అందులో ఆత్మసంతృప్తిని సాధించాడని చెప్తారు. అతను కంచి వెళ్ళగా ఆకాలంలో అక్కడ రాజ్యం చేస్తున్న పల్లవ మహేంద్రవర్మ అతనిని ఎంతో గౌరవించాడు. తర్వాత అతను కుంభకోణానికి యాత్రార్థమై వెళ్లి జీవితశేషం అక్కడనే గడిపాడు. ఈ నలుగురు ఆళ్వారులున్నూ ఏడవశతాబ్దం మధ్యభాగంనుంచి ఎనిమిదవ శతాబ్దంలో మొదటి 25 సంవత్సరాలవరకూ జీవించినవారు. మొదటిముగ్గురు ఆళ్వార్ల మూడువందల పాటలూ 'నాలాయిర ప్రబంధం'లోని మూడవఆశ్వాసమైన ఇయల్పాలో కనిపిస్తాయి. తిరుమళిశై కృతులు అదేప్రబంధంలోని తిరుచందవిరుత్తమ్, నాన్ముఖన్ తిరువందాది అనే ప్రథమ ద్వితీయాశ్వాసాలలో ఉన్నాయి. మొదటి ముగ్గురు ఆళ్వార్ల కృతులూ నిరాడంబరమూ కోమలమూ అయిన భక్తిభావంతో పరిపూర్ణాలై విష్ణుదేవునిపట్ల గాఢానురక్తి వెలువరిస్తూ ఉంటాయి. తిరుమళిశై రచనలు భగవంతునితో వాదిస్తున్న ధోరణిలో ఉండి, ఏకేశ్వర సిద్ధాంతంపట్ల అతనికిగల అనూహ్యపరిజ్ఞానాన్ని విశదీకరిస్తూ ఉంటాయి.

తిరునెల్వేలి జిల్లాలోని తిరునగరిలో వెల్లాలకులంలో పుట్టిన నమ్మాళ్వారుకు కరిమారన్, శఠగోపన్, వకుళాభరణన్, పరాంకుశుడు అనే నామాంతరాలు ఉన్నాయి. అతను చాలా

సంవత్సరాలు యోగాభ్యాసంతో కాలం గడిపాడు. అటు తర్వాత మధురకవి అనే బ్రాహ్మణుడు అతనిని సందర్శించి భక్తితాత్పర్యాలతో అతనికి శుశ్రూష చేస్తూవచ్చాడు. నమ్మాళ్వార్ రచించిన పాటలు 'నాలాయిర ప్రబంధం'లోని "తిరువాయ్ మొళి" అనే చతుర్థాశ్వాసంలో తిరుమంగై కృతులకు పిమ్మట గ్రంథస్థాలైనాయి. "తిరువిరుత్తమ్" "తిరువాశిరియం" "పెరియ తిరువిరుత్తమ్" అనే ఇతర రచనలు కూడా చేశాడితను. ఇవి ప్రబంధంలోని తృతీయాశ్వాసంలో ఉన్నాయి. నమ్మాళ్వారు దివ్యావేశంపొందినమహాపురుషులలో ఒకడు. ఇతని గీతాలలో అత్యద్భుతమైన దివ్యానుభూతి గోచరిస్తుంది. గాఢమైన ఆధ్యాత్మిక పరిణతి వాటిలో క్రమాభ్యున్నతి పొందినట్లు కనిపిస్తుంది. విష్ణువుకోసం భక్తుడు పడే ఆవేదన అంతా ఆకమ్మని కవిత్వంలో వినిపిస్తుంది. ఈ రమ్యమైన కృతులవల్ల ఇతను వైష్ణవగురు పరంపరలో విశిష్టస్థానాన్ని అందుకొన్నాడు.

"విష్ణుచిత్తర్" అనీ "పట్టర్ పిరాన్" అనీ ప్రఖ్యాతుడైన పెరియళ్వారు శ్రీ విల్లిపుత్తూరుపురవాసి అయిన బ్రాహ్మణుడు. ఈయన స్వగ్రామంలోని దేవాలయంలో అర్చితుడయే భగవంతునికి అనుదినమూ పుష్పమాలలతో అలంకారాలుచేస్తూ ప్రశాంతమైన జీవితాన్ని గడుపుతూఉండేవాడు. తనకు సమకాలికుడైన శ్రీ నర శ్రీవల్లభుడు (815 – 62) అనే పాండ్యరాజు కొలువుకూటంలో పెరియాళ్వారు మతచర్చలలో పాల్గొని అఖండ విజయాన్ని సంపాదించినట్లు కనబడుతుంది. ఈయన

కూడా 'నాలాయిర ప్రబంధా'నికి 500 గీతాలు చేర్చాడు. ఈయన గీతాలలో "తిరుప్పల్లాండు" సుప్రసిద్ధమైనది. తిరుమొయి ఈయన ఇతరరచన. ఇది శ్రీకృష్ణుని బాల్యజీవితాన్ని అత్యార్ద్ర భావనారమణీయంగా చిత్రించే కావ్యం. భావోజ్జ్వలతకూ విజ్ఞానసంపత్తికీ పెట్టినపేరైన పెరియాళ్వారు గీతాలు అతిశీఘ్రకాలంలోనే ప్రసిద్ధిలోకి వచ్చాయి.

పెరియాళ్వారు కూతురైన ఆండాళ్ ఈ యుగంలోని వైష్ణవ యోగినులలో విశిష్టత సంపాదించినది. ఆమె రచించిన "తిరుప్పావై" అనే ప్రసిద్ధగ్రంథం తమిళ వైష్ణవభక్తలోకంలో అనుదినపారాయణ గ్రంథంగా ఉన్నది. ఆమె రచించిన మరొక గ్రంథం నాచియార్ తిరుమొళి. అయితే ఇది తిరుప్పావై అంతటి ప్రసిద్ధి గలదికాదు. శ్రీరంగ దేవాలయంలోనిరంగనాథుణ్ణి తప్ప ఇతరుణ్ణి వివాహమాడనని ఆమెపట్టుపట్టిందనీ, రంగనాథుడు ఆమెను అంగీకరించితనలో ఐక్యంచేసికొన్నాడనీ తెలిపే కథ భగవంతునియందు ఆమెకుగల గాఢానురాగాన్ని వ్యక్తం చేస్తున్నది. విష్ణువును మనసారప్రేమించి, ఆస్వామితో తనకు వివాహమైనట్లు కలలుకంటూ, ఆకలలను ఆమె తనపాటలలో వర్ణించింది. ఈపాటలు వైష్ణవ బ్రాహ్మణగృహాలలో కళ్యాణ వేళలందు ఈనాటికిన్నీ వినబడుతూ ఉంటాయి.

కేరళ, కొంగు, పాండ్య, చోళ రాజ్యాధినేతనని చెప్పుకొన్న కులశేఖరాళ్వారు కేరళరాజకులాలంకారుడు. ఆయన యుక్తవయస్కుడైన పిమ్మటనే రాజ్యం ఒప్పజెప్పి, శ్రీరంగ

పట్టణంలో నివసిస్తూ రంగనాథాలయాన్ని అభివృద్ధిచేశాడు. తమిళ భాషలో "పెరుమాళ్ తిరుమొళి" సంస్కృతంలో "ముకుందమాల" అనే గ్రంథాలను రచించాడు. వీటిలో మొదటిది 'నాలాయిరప్రబంధం'లో సంగ్రథితమైనది. ఇందులో 108 పద్యాలున్నాయి.

తిరుప్పాణాళ్వారూ, తొండరడిప్పొడి ఆళ్వారూ, తిరుమంగై ఆళ్వారూ మూడవతరగతికి చెందినవారు. వీరందరూ తొమ్మిదోశతాబ్ది పూర్వార్ధాన జీవించినవారు. వీరిలో మొదటివాడైన తిరుప్పాణాఆళ్వారు నాయనార్లలో నందనార్ వలె నిమ్నజాతిలోపుట్టిన భక్తుడు. ఇతని పరమభక్తికి సంతుష్టుడైన రంగనాథస్వామి లోకసారంగముని అనే భక్తుణ్ణి పిలిచి తిరుప్పాణాఆళ్వారును నాదగ్గఱకు మోసికొనిరా! అని చెప్పి, ఆ విధంగా తనదగ్గఱకువచ్చిన ఆళ్వారును తనలో లీనంచేసికొన్నాడట! 'నాలాయిరప్రబంధం'లో ఇతను వ్రాసిన పాటలు పది ఉన్నాయి. మొట్టమొదట వీరనారాయణుడని పేరుగల తొండరడిప్పొడియాళ్వార్ ఒక అపవిత్రయువతి మూలంగా రాజదండనకు గుఱికాగా రంగనాథస్వామి అతనిని రక్షించాడట. అందుకు కృతజ్ఞుడైన తొండరడిప్పొడి తన జీవితాన్ని రంగనాథునికి అంకితంచేశాడు. వైష్ణవభాగవత రచనలలో ఈయన రచించినవి 55 గీతాలు.

ఆళ్వార్లలోఅత్యంతప్రశస్తి గడించిన తిరుమంగై ఆళ్వారు 8వ శతాబ్దం మధ్యకాలానికి చెందినవాడని పియాలీలో సంబం

దర్ను ఇతను కలసికొన్నట్లుకల కనవలసి స్పష్టమౌతున్నది. తంజావూరు జిల్లాలలో తనజాతికి నాయకుడుగా ఉంటూ వేట తోనూ, దారిదోపిడితోనూ కాలంగడిపేవాడు. ఒకసారి ఇతని చేతిలోచిక్కిన ఒక క్రొత్తపెండ్లికొడుకు ఇతని అదృష్టంవల్ల ఒకానొకమంత్రాన్ని రహస్యంగా కర్ణగోచరం చెయ్యగానే, యితను వెంటనే విష్ణుభక్తుడుగామారిపోయాడు. అటుతర్వాత అనేక వైష్ణవక్షేత్రాలు సందర్శించి కొన్ని దేవాలయాలను బాగుచేయించి, ఆయా దేవతలను గురించి అనేక కీర్తనలు రచించాడు. ప్రబంధంలోని గీతాలలో ఇతను రచించినవి 1351 ఉన్నాయి. "పెరియతిరుమొళి" అనే 'నాలాయిరప్రబంధ' ద్వితీయాశ్వాసమంతా ఇతను రచించినదే. ఇతనిగీతాలు మరి కొన్ని తృతీయాశ్వాసంలోకూడా ఉన్నాయి. అన్యమతస్థులను ఎదుర్కొనే ఆవేశంలో కలిగిన మతాభిమానంవల్ల ఇతను రచించిన గీతాలలో జైనులనూ, బౌద్ధులనూ, శైవులనూ కూడా తీవ్రంగా నిందించటం కనబడుతుంది. నమ్మాళ్వార్ కవి భగవంతునితో తాదాత్మ్యం పొందినట్లుగా ఇతను కృతార్థుడు కాలేకపోయాడని ఇతని రచనలవల్ల బోధపడుతోంది. ఇతని పాటలన్నీ అనవసరమయిన అలంకారాలతో కూడి ఉంటాయి గానీ యథార్థభక్తి స్ఫోరకాలుకావు.

పదోశతాబ్ది చివరి దశాబ్దంలో మతోద్యమంలో ఒక ముఖ్యమైన మార్పు వచ్చింది. చిత్త వికాస హేతువైన ఆధ్యాత్మిక దృష్టి సన్నగిల్లింది. ఆళ్వార్ల స్థానాన్ని ఆచార్యులు

ఆక్రమించారు. రంగనాథాచార్యు డనే నామాంతరం కల నాథముని ఈ నవీనమార్గాన్ని బయలుదేఱదీసిన వాడు. తమిళ మయ మైన గేయ వాఙ్మయంలో చాలా వఱకు సంస్కృతం చోఱ బడ్డది. నాథముని వీర నారాయణ పుర (నేటి మన్నారు గుడి) నివాసి. ఇతను క్రీ. శ. 935–1030 సంవత్సరాల నడుమ జీవించి ఉన్నట్లు తెలుస్తున్నది. చోళ రాజైన ప్రథమ రాజేంద్రునికి ఇతను సమకాలికుడు. శ్రీరంగంలో నివసించే వాడు. తన గురు వైన నమ్మాళ్వారు దగ్గఱ నుంచి 400 గీతాలు గల వైష్ణవ గ్రంథం ఇతనికి లభించిందని తెలుస్తున్నది. ఇతని చేతులలో ఆ గ్రంథానికి కొంత విస్పష్టమైన మార్పు వచ్చింది. విశిష్టాద్వైత వేదాంతంపై న్యాయ తత్వం అనే గ్రంథాన్ని ఇతను రచించాడు. ప్రపత్తి సిద్ధాంతాన్ని (భగవంతునికి సర్వాత్మనా అంకితం కావటాన్ని) అందులో ప్రతిపాదించాడు. ఆళవందార్ అనే నామాంతరం కల యామునాచార్యుడు నాథముని మనుమడగు శ్రీరంగంలోని వైష్ణవ మతాలకు అధ్యక్షు లైన ఆచార్యులలో నాథముని తర్వాత ప్రసిద్ధకెక్కినవాడు ఇతనే.

11 వ శతాబ్ది తొలి 25 సంవత్సరాల లోపల మదరాసు దగ్గఱి శ్రీపెరుంబుదూరులో జన్మించిన రామానుజా చార్యుడు ఆచార్యు లందరిలో నిస్సందేహంగా ఉత్తమోత్తముడు. కంచిలోని అద్వైత మత బోధకుడైన యాదవ ప్రకాశుడు ఈయనకు మొట్టమొదటి గురువు. కాని రామానుజుడు ఆయన బోధనతో

ఏకీభవించ లేదు. అప్పటికే నలు దిక్కులా వ్యాపిస్తూ ఉన్న రామానుజుని కీర్తి విని, శ్రీరంగం లోని యామునా చార్యుడు తన దగ్గఱకు వచ్చి శాస్త్రాభ్యాసం చెయ్య వలసిందని ఆహ్వానించటం వల్ల రామానుజుడు ఆయన వద్దకు వెళ్ళాడు. కాని ఆయన శ్రీరంగం చేరుకొనే సరికి యామునాచార్యుడు కీర్తిశేషుడైనాడు. అందు చేత రామానుజుడు యామునాచార్య శిష్యులలో ఒకడైన పెరియనంబి వద్ద కొంతకాలం శుశ్రూష చేసి, అటు తర్వాత దక్షిణ భారతంలోని నానా వైష్ణవ క్షేత్రాలు సందర్శిస్తూ, ఉత్తర భారతానికి కూడా వెళ్ళాడు. చివఱకు బ్రహ్మ సూత్రాలమీద వ్యాఖ్యానంగా పుట్టిన 'బోధాయన వృత్తి' అనే గ్రంథాన్ని సంపాదించ టానికి కాశ్మీర దేశానికి వెళ్లాడు కూడాను. బ్రహ్మసూత్రాల మీద ఆయన రచించిన శ్రీభాష్యం అనే వ్యాఖ్యాన గ్రంథం శ్రీరంగంలో ఉండగానే ప్రారంభమైంది. అయితే అటు తర్వాత చాలా సంవత్సరాలు శ్రీరంగం విడిచి పెట్టి 'హొయిసల' రాష్ట్రంలో నివసించి రావటం చేత గ్రంథ రచన ఆగిపోయి ఎప్పటికో కాని పూర్తి కాలేదు. రామానుజుడు శ్రీరంగం విడిచిపెట్టటానికి కారణం శైవమతంపట్ల గాఢాభిమానంకల ఒక చోళరాజు దౌర్జన్యమే. రామానుజుడు 'హొయిసల' రాజ్యానికి వెళ్ళేసరికి అక్కడ బిత్తిదేవుడు (క్రీ॥ శ॥ 1104 – 1141 సం॥) అనే రాజు పరిపాలిస్తున్నాడు. ఆచార్యుడు అతనిని వైష్ణవమతం అవలంబించేటట్లుచేసి "విష్ణువర్ధనుడు" అని పేరుకూడా మార్చి

వేశాడు. తర్వాత కొంతకాలానికి శ్రీరంగంలోని చోళరాజు మరణించటంవల్ల శ్రీరంగానికి చేరి, శ్రీభాష్యం పూర్తిచేశాడు. వేదాంతసారం, వేదార్థసంగ్రహం, వేదాంతదీపం, బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్యానమైన శ్రీభాష్యమూ, భగవద్గీతా భాష్యం ఈయన రచనలు. భక్తికి అవకాశమే కనబడదని ఆయనకు తోచిన శంకరుని అద్వైతాన్ని ఆయన ప్రతిఘటించాడు. జీవాత్మ భగవంతునికంటె వేఱనీ, ఈ భిన్నత ఎప్పటికిన్నీ తొలగేదికాదనీ, భగవంతునిలో ఐక్యంకావటంకాక, ఆయన సన్నిధిలో ఉండటమే మోక్షమనీ రామానుజాచార్యుడు బోధించాడు.

రామానుజుని విశిష్టాద్వైతంతోబాటే దానికి భిన్నమైన మఱొక వైష్ణవమతంకూడా బయలుదేఱింది. ఈ నవీన వైష్ణవ శాఖను సృష్టించిన నింబార్కుడు బహుశః రామానుజాచార్యునికి సమకాలికుడై ఉంటాడు. ఈయన బళ్ళారిజిల్లాలోని నింబపురంలో జన్మించాడు. ఈయనకూడా భక్తికే విశేష ప్రాధాన్యం ఇచ్చాడుగానీ, "భేద-అభేద" (భిన్నత్వంలో ఏకత్వం) సిద్ధాంతవిషయంలో రామానుజునితో ఏకీభవించలేదు. రామానుజాచార్యుడు లక్ష్మీనారాయణులను అర్చించవలసిందంటే ఈయన రాధాకృష్ణులను అర్చించవలసిందన్నాడు. ఈవిధంగా ఈయన క్రొత్తబాటతొక్కటానికి చిరకాలం ఉత్తర భారతంలోని బృందావనంలో నివసించటమే కారణమై ఉంటుంది. ఈయన బ్రహ్మసూత్రాలకున్నూ, స్వవిరచితమైన

"దశశ్లోకి" అనే పదిశ్లోకాలుగల చిన్నగ్రంథానికిన్నీ వ్యాఖ్యానాలు వ్రాశాడు. ఈ దశశ్లోకి ఈయన ఉపదేశసారమే.

శంకరమతాన్ని ఎదుర్కొన్న మతాల తీవ్రప్రతిస్పర్థి కూడా వైష్ణవభక్తి సిద్ధాంతాన్ని నమ్మినవాడే. ఈయన పేరు మాధవుడు. ఆనందతీర్థుడనీ, పూర్ణప్రజ్ఞుడనీకూడా మాధవుడికి వ్యావహారిక నామాలు ఉన్నాయి. ఈ ఆచార్యుడు ఉడిపి తాలూకాకు చెందిన కళ్యాణపురంలోని ఒక బ్రాహ్మణకుటుంబంలో జన్మించాడు. బాల్యంలోనే గురువుదగ్గర అద్వైతసిద్ధాంతాలు పఠిస్తూ ఈయన వాటిని అంగీకరించలేదు. తర్వాత శంకరుని మాయావాదాన్ని ప్రతిఘటించే వారితో చేరి, క్రమంగా తనకు సత్యమని తోచిన ద్వైతసిద్ధాంతాన్ని ప్రచారం చెయ్యటానికి పూనుకొన్నాడు. దక్షిణోత్తర భారతాలు రెండింటిలోనూ సంచారంచేసి బ్రహ్మసూత్రాలకు తాను రచించిన భాష్యాలకు పెద్దల ఆమోదం సంపాదించటానికి రెండుసార్లు బదరికాశ్రమానికి వెళ్ళాడట. దేశసంచారంచేస్తూ ఉండగా అనేక స్థలాలలో ప్రతికక్షులను ఎదుర్కొని ఓడించాడనీ, అద్వైతసిద్ధాంతంలో గాఢవిశ్వాసం కల త్రివిక్రమ పండితుణ్ణి తనమార్గానికి త్రిప్పివేశాడనీ, ఆపండితుడే ఆయనకు మొట్టమొదటి శిష్యుడైనాడనీ ప్రసిద్ధి. మాధవాచార్యుడు మొత్తంమీద 37 గ్రంథాలు రచించాడు. ఈయన అనేకత్వ సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన అద్భుతాచార్యుడు. ఈయన మతంలోని ప్రధాన సిద్ధాంతాలివి.

నారాయణుడొక్కడే ప్రధానదైవం. శంకరుడన్నట్లుగా ఈ లోకం మిథ్యకాదు; రామానుజుడు చెప్పినట్లు భగవంతుని

లోని ఒకభాగముమాత్రం కాదు. అది సత్యమైనదేకాక భగవం తునికి కేవలం భిన్నమైనదికూడాను. జీవాత్మలసంఖ్య అనంత మైనది. జీవులంతటూ ముక్తికోసం భగవంతునిపై ఆధారపడ వలసిందే. వీటిలో ఉత్తమమధ్యమాధమాదిభేదాలు ఉన్నాయి. శక్తిసామర్థ్యాలలోనూ తేడాలున్నాయి. అధములకు శాశ్వత నరకం ప్రాప్తిస్తుంది. హృదయపూర్వకమైనభక్తి మోక్షానికి సాధనం. భగవంతునిగురించి తెలిసికోనటానికి వేదాలే దిక్కు.

13, 14 శతాబ్దాలలో రామానుజశిష్యులలో అభి ప్రాయభేదాలు బయలుదేరాయి. ఒడకలైలూ తెంకలైలూ అని రెండు తెగలుగా వారు చీలిపోయారు. మొదటితెగకు నాయకుడు వేదాంతదేశికుడు (1258) రెండవతెగకు పిళ్లైలోకా చార్యుడు (1213) నాయకుడు. ప్రపత్తి సిద్ధాంతాన్ని నిర్వ చించటంతో ఉభయులకూ భేదాభిప్రాయాలు కలిగాయి. ఒడకలైలు తమిళానికి బదులు సంస్కృతమే ఉండాలనీ, తెంక లైలు సంస్కృతంగాక తమిళమే ఉండాలనీ అభిప్రాయపడ్డారు.

పదమూడవశతాబ్దం ముగియవచ్చేసరికి మహారాష్ట్ర దేశంలో చాలావరకు వైష్ణవమతం ప్రబలిపోయింది. దానిలో ముఖ్యమైన భక్తిసిద్ధాంతం ప్రజలను ఎంతో ఆకర్షించింది. తమిళ దేశంలో నాయనార్లూ ఆళ్వార్ల మాదిరిగానే ఎందరో వైష్ణవ యోగులూ, భక్తులూ మహారాష్ట్రంలోకూడా బయలుదేరి భక్తిభరితాలైన గీతాలతో దేశంలో ఒకనూతనోత్సాహాన్ని సృష్టించారు. మరాఠీలో ఎన్నో అభంగాలను రచించిన జ్ఞానే



సముద్రతీరపు దేవాలయము - మహాబలిపురం

పురావస్తు పరిశోధక శాఖవారి అనుమతితో



బృహదీశ్వరాలయము - తంజావూరు
పురావస్తు పరిశోధక శాఖవారి అనుమతితో



లింగరాజ దేవాలయము - భువనేశ్వరము

పురావస్తు పరిశోధక శాఖవారి అనుమతితో



కేశవాలయము - సోమనాథపురము
పురావస్తు పరిశోధక శాఖవారి అనుమతితో

శ్వరుడు ఈనపైనోద్యమాన్ని ప్రారంభించినవాడు. మహాభక్తుడైన తుకారాం ఉదయించేవరకున్నూ మహారాష్ట్రంలోని భక్తి ప్రవాహం జ్ఞానేశ్వరుణ్ణి అనుసరించింది. ఇదేవిధంగా భక్తి ఉద్యమం ప్రభావం 'దాసకూట'మును లోనైనది. ఈ 'దాస కూటమే' కన్నడంలో "దేవరనామాలు" అనేపేర ఎన్నో భక్తి గీతాలు రచించారు. ఇవి నిరక్షరాస్యులలోకూడా భగవద్భక్తిని మొలకెత్తించాయి. ఈ దాసులలో పురందరదాస విఠల్ సుప్రసిద్ధుడు. ఈయన అనేక దేవరనామాలు రచించారు. ఈపాటలన్నీ ద్వైత మత సిద్ధాంతానుగుణమైనవి. అంతగా చదువుకోని సామాన్య ప్రజలను ద్వైత మతానికి అభిముఖులను చేసికొనటమే ఈ గీతాలు రచించిన వారి ముఖ్యోద్దేశం. 15, 16 శతాబ్దాలనాటి విజయ నగర చక్రవర్తులకు సమకాలికు లయిన దాసులు వారి ఆదరాభిమానాలకు పాత్రులయినారు కూడా. వైష్ణవ భక్తి ప్రచారం చేసిన వారిలో వల్లభాచా ర్యుణ్ణి కూడా పేర్కొనాలి. ఆయన కాశీ నగరంలో జన్మిం చాడు. చాలాకాలం ద్వైతమతస్థులవద్ద విద్యాభ్యాసం చేసి, దక్షిణభారతంలో చాలాకాలం ఉన్నాడు. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానాన్ని సందర్శించిన వేదాంతులలో ఆయనకూడా ఒకడు. ఆయన జ్ఞానంకంటె భక్తికి ప్రాధాన్యమిచ్చే శుద్ధాద్వైతమనే నూతన మతాన్ని సృష్టించాడు. వేదాంత సూత్రాలకు చేసిన వ్యాఖ్యానంతో సహా ఆయన రచనలన్నీ ఈ మతానికి అనుగు ణంగా ఉన్నవే. గోపికలకు శ్రీకృష్ణుని యందు కలిగిన భక్తికి అనురూపమైన భక్తిని ప్రచారం చేసే ఇతని అనుయాయుల ఉద్యమం తీవ్రవిమర్శల పాలైనది.

# ఎనిమిదవ ప్రకరణం

## చోళసామ్రాజ్యాలూ, కడపటిచాళుక్యులూ (క్రీ.శ. 900-1300)

కాలాభ్రుల దాడితో అడుగంటిన చోళులు అకస్మాత్తుగా తొమ్మిదో శతాబ్ది చివరిభాగంలో ప్రాబల్యం సంపాదించారు. తర్వాత మూడువందల సంవత్సరాలపాటు తుంగభద్రకు దక్షిణప్రాంత మంతా ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించారు. ప్రారంభ దశలో వారు రాష్ట్రకూటులతోనూ, కల్యాణి చాళుక్యులతోనూ పోరాడవలసి వచ్చింది. యథార్థానికి పదో శతాబ్ది చివరి ఇరువై అయిదేండ్లనుంచీ, పన్నెండో శతాబ్ది ముప్పాతిక వరకూ చోళులకూ చాళుక్యులకూ పోరునడుస్తూనే ఉన్నది.

7, 8 శతాబ్దాల మధ్య పల్లవులచేతనూ, పాండ్యుల చేతనూ వాతాపి చాళుక్యులచేతనూ చోళులు పరాజయాల పాలవుతూ ఉండేవారని శాసనాల వల్ల తెలుస్తున్నది. పల్లవులకు సామంతు లయిన తంజావూరు ముత్తరాయర్లు పల్లవులను తిరస్కరించి, పాండ్యులకు సామంతులైనారు. అందువల్ల పల్లవసామంతులలో ఒకడైన విజయాలయచోళుడు క్రీ. శ. 850 వ సంవత్సరంలో తంజావూరు మీద దండెత్తి కోటను స్వాధీన పరుచుకొన్నాడు. దీనితో చోళులకు స్వాతంత్ర్యం లభించింది. విజయాలయుని అనంతరం సింహాసనం ఎక్కిన ప్రథమాదిత్యవర్మ (871-907) పాండ్య రాజైన ద్వితీయ వర

గుణుని దాడిని తట్టుకోవలసి వచ్చిందికానీ, పల్లవులతో గాంగులతో మైత్రి సంపాదించి, క్రీ. శ. 880 వ సంవత్సరంలో శ్రీపురంబియం వద్ద పాండ్యులను ఓడించాడు. తర్వాత తంజావూరే కాక చుట్టు ప్రక్కల గల కొంత పల్లవరాజ్యాన్ని కూడా అతనే పరిపాలించుకొనేటట్లు ఒప్పందం జరిగింది. అయితే అంతటితో ఆగక అతను అచిర కాలంలోనే పల్లవ రాజైన అపరాజితుణ్ణి యుద్ధంలో వధించి, పల్లవ రాజ్యం అంతా ఆక్రమించు కొన్నాడు. ఆపైన పాండ్యుల వద్దనుంచి కొంగు రాష్ట్రాన్ని లాగికొన్నాడు. అందుచేత అతని తర్వాత 907 వ సంవత్సరంలో రాజ్యానికి వచ్చిన ప్రథమపరాంతకుడు ఉత్తరాన కాళహాస్తి నుంచి దక్షిణాన పుదుక్కోట వఱకూ కల విశాల భూభాగానికి అధిపతి అయినాడు.

ప్రథమ పరాంతకుడు (907–55) మహావీరుడు. ఇతను మధురను ముట్టడించి, పాండ్యరాజునూ అతని మిత్రుడైన సింహళాధిపతినీ వెల్లూరు వద్ద ఓడించి తన రాజ్యాన్ని ఉత్తర ఆర్కాటు జిల్లాలోని వేలూరు వఱకూ వ్యాపింప జేశాడు. అయితే రాష్ట్రకూట రాజైన రెండవ కృష్ణుడు అడ్డు తగలటం చేత ఆపైన రాజ్యవిస్తరణ చెయ్యటానికి అవకాశం లేక పోయింది. రెండవ కృష్ణుడు (880–915) ప్రథమాదిత్యవర్మ భార్య అయిన తన కూతురి కుమారుని కన్నార దేవునికి తండ్రి అనంతరం చోళసింహాసనం దక్కనీయ లేదనే క్రోధం చేత పరాంతకునిమీద శత్రుత్వం వహించాడు. 915 వ సంవత్సరంలో

వెల్లాలవద్ద జరిగిన యుద్ధంలో గాంగుల తోడ్పాటుతో తన్ను దుర్కొన్న చోళుల చేతిలో కృష్ణుడు పూర్తిగా ఓడిపోయాడు. తర్వాత అతను వేంగి మీద చాలాసార్లు దాడిచేశాడు కానీ నిష్ప్రయోజన మైంది. రెండవ కృష్ణుని అనంతరం రాష్ట్రకూట రాజైన మూడవ ఇంద్రుడు (915-27) తనపైకి దండెత్తివచ్చిన మాళవరాజు ఉపేంద్రునితో నిరంతర యుద్ధాలు చెయ్యవలసి వచ్చి అప్పుడప్పుడు అతనిని తఱిమివేసినా చోళుల మాట తల పెట్టటానికి అతనికి అవకాశం లేకపోయింది. కాని కొంత కాలానికి వీలు చేసుకొని ఇంద్రుడు వేంగి చుట్టు ప్రక్కల ఉన్న విశేష భూభాగాన్ని ఆక్రమించుకొని, ఏడేండ్లపాటు పరిపాలించాడు.

చోళ ప్రాబల్యాన్ని అణచివేయటానికి రాష్ట్రకూటులు యత్నించటం మూడవకృష్ణునినాటి (939-66) నుంచీ ప్రారంభ మైనది. అది ప్రథమపరాంతకుని అవసానదశ. సమర్థుడూ, రాజ్యవిస్తరణం చెయ్యాలనే కుతూహలం కలవాడూ అయిన మూడవకృష్ణుడు మొట్టమొదట తన బావమఱది అయిన మూడవ బూటుగునికి ప్రతిస్పర్థి అయిన రాజును ఓడించి పశ్చిమగాంగ రాజ్యాన్ని తన బావమఱదికి కైవసం చేశాడు. తర్వాత 949వ సంవత్సరంలో చోళులపై దండెత్తి తక్కోలం వద్ద వారిని ఓడించాడు. ఆయుద్ధంలో చోళయువరాజు రాజాదిత్యుడు మరణించాడు. ఆతర్వాతకూడా ఎన్నోయుద్ధాలు జరిగాయి. పర్యవసానంగా కృష్ణుడు చోళరాజ్యంలో ఉత్తరా

రానికి అధిపతి అయినాడు. చోళులకు ఈవిధంగా పర్రాజయాలు కలిగి, సామ్రాజ్యం క్షీణిస్తూఉంటే చాళుక్యులకు చోళుల అధికారంనుంచి విముక్తిపొంది స్వాతంత్ర్యం సంపాదించాలని కోరిక పుట్టింది.

మూడవకృష్ణుడు వేంగిలో చొరబడి దానిని పరిపాలిస్తున్న రెండవ అమ్మన్ణి మిత్రభేదంతో పదభ్రష్టుణ్ణి చెయ్యటానికి యత్నించాడు కానీ ఆ ప్రయత్నాలు ఫలించలేదు. అప్పుడతను ఉత్తరానికి వెళ్ళి మాళవరాజునుఓడించి రాష్ట్రకూటుల సార్వభౌమాధికారాన్ని ఒప్పుకోవలసిందని నిర్బంధించాడు. అయితే రాష్ట్రకూటరాజులలో చివరి గొప్పరాజు అతనే. అతని తర్వాతవారు మాళవరాజుల ఒత్తిడి భరించలేక పోయారు. కడపటి చాళుక్యవంశానికి మూలపురుషుడైన రెండవ తైలుడు రాష్ట్రకూటరాజులలో చివరివాడైన రెండవ కాప్కణ్ణి సులభంగా పదభ్రష్టుణ్ణి చేశాడు.

ఇంతలో ప్రథమపరాంతకుని అనంతరం ముప్ఫైసంవత్సరాలనుంచీ చోళుల అధికారం నానాటికి తీసికట్టు నాగంభట్టూ అన్నట్లవుతున్నది. కాని ప్రథమరాజరాజు (985–1014) రాజ్యానికి వచ్చినతర్వాత చోళసామ్రాజ్య చరిత్రలోనేకాక, దక్షిణ భారత చరిత్రలోకూడాచక్కనిమార్పువచ్చింది. ఒకనిర్ణీతకార్యక్రమం ప్రకారం వరుసగా విజయపరంపరలు అందుకొంటూ రాజరాజు పాండ్య-చేర రాజులను జయించి సింహళంలో ఉత్తర భాగాన్నికూడా స్వాధీనపఱచుకొన్నాడు. నేడు కూర్గు అని

పిలువబడ్డ ప్రాంతమూ గంగవాడీ, నోలంబవాడీ (దక్షిణ మైసూరూ, ఉత్తరమైసూరూ) జయించి, క్రమంగా మాల్దీవు ద్వీపాలనుకూడా వశపఱచుకొన్నాడు. తర్వాత రాజరాజు రెండవతైలుని ఆధిపత్యాన సుస్థిరులై ఉన్న కల్యాణి చాళుక్యులతో తలపడవలసి వచ్చింది. ఆసమయంలోనే తైలుడుమాళవ రాజైన ముంజునితో యుద్ధాలలో మునిగితేలుతున్నాడు. ముంజుడు ఆఱుపర్యాయాలు వరుసగా తైలుణ్ణి ఓడించాడనీ, ఏడవపర్యాయం జరిగిన యుద్ధంలో అతని అదృష్టం తాఱుమాఱైందనీ తెలియవస్తున్నది.

తైలుని అనంతరం సింహాసనాధిష్ఠితుడైన ఒకటవసత్యాశ్రయుడు (997–1008) చోళులతో యుద్ధాన్నికొనసాగించాడు. రాజరాజు వేంగీవ్యవహారాలలో జోక్యం కలిగించుకొనటమే ఈయుద్ధానికి కారణం. ఒకసామంతరాజుచేత పదభ్రష్టుడైన శక్తివర్మ అనే పూర్వరాజకుమారుణ్ణి సింహాసనం ఎక్కించి రాజరాజు, ఆ రాజకుమారుని తమ్ముడైన విమలాదిత్యునికి తనకూతురు 'కుందవై'ని ఇచ్చి వివాహం చేశాడు. ఇందువలన చోళ వేంగీరాజ్యాలు రెండున్నూ చిట్టచివరకు ఏకమై ప్రథమ కులోత్తుంగుని పరిపాలన క్రింద వర్ధిల్లటానికి అవకాశం ఏర్పడింది. వేంగిలో చోళుల జోక్యం సహించలేని సత్యాశ్రయుడు ఒకపెద్ద సేనను వేంగీదేశానికి పంపించాడు. ఈ సైన్యం వేంగిలో కొంత భాగాన్ని ఆక్రమించుకోగలిగింది. ఇందుకు ఎదురెత్తుగా రాజరాజు 1008 వ సంవత్సరంలో పశ్చిమ చాళుక్య రాష్ట్రం మీద

దండెత్తి, నెత్తురు టేర్లు ప్రవహింపజేసి మహత్తరమైన విజయం సాధించాడు. వన వాసీ, రాయచూరు ప్రాంతంలో చాలా భాగమూ చోళుల వశమైంది. అందువల్ల సత్యాశ్రయుడు తప్పని సరిగా తనసైన్యాన్ని వేంగి నుంచి తొలగించ వలసి వచ్చింది. ఇలా యుద్ధాలు చేస్తూ అఖండ విజయాలు సాధిస్తూనే రాజరాజు ప్రభుత్వయంత్రాన్ని చక్కబరచి, మతమూ, సారస్వతమూ, కళలూ మొదలయిన అన్నివిషయాలలోనూ వృద్ధికలిగించి, ఒక మహాసామ్రాజ్యానికి పునాదులు వేశాడు.

ఒకటవ రాజేంద్రుడు (1012–44) ప్రథమరాజరాజుకు తగిన కుమారుడు. తనతండ్రి ప్రారంభించిన రాజ్యవిస్తరణ రాజ్యసుస్థిరతప్రయత్నాలను చక్కగాకొనసాగించాడు. అతను రాజరాజు కొంతవరకే జయించిన సింహళాన్ని పూర్తిగా లో బరచుకొని, పాండ్యచేర దేశాలలో జైత్రయాత్ర ప్రారంభించాడు. పశ్చిమచాళుక్యరాజు రెండవజయసింహుడు(1015–42) పూర్వాచారం ప్రకారం వేంగీవ్యవహారాలలో జోక్యం కలుగ జేసికొన్నాడు. అందువల్ల రాజేంద్రుడు అంతులేని సైన్యాన్ని పంపి, మాస్కివద్ద ఆచాళుక్యరాజును ఓడించాడు. వేంగీలో కూడా చోళసైన్యం బలపడి, నాడు వేంగీపరిపాలకుడైన రాజ రాజుకు అండగానిలిచి, రెండవజయసింహుని ప్రోత్సాహంతో అతనిని ఎదుర్కొంటున్న శత్రువునుఓడించింది. చోళులచేతిలో చావుదెబ్బదిన్నప్పటికీ జయసింహుడు మాళవరాజైన భోజుని దాడులనుంచి పశ్చిమచాళుక్యరాజ్యాన్ని నిలబెట్టుకోగలిగాడు.

ఒకటవ రాజేంద్రుడు తుంగభద్ర వరకూ తన సామ్రాజ్యాన్ని పెంచటంతో సంతృప్తుడు కాక, ఇంకా ఉత్తరానికి కూడా తనఅధికారాన్ని విస్తరింపజెయ్యటానికి నిశ్చయించాడు. అతని సైన్యాలు గంగా నదిని కూడా దాటి, గంగా మైదానం లోని ఇద్దరురాజులను ఓడించి, ఇంటికి తిరిగివస్తూవంగరాజైన ఒకటవ మహీపాలుణ్ణి కూడా పరాజితుణ్ణి చేశాయి. రాజేంద్రుని ఈఉత్తరదండయాత్రవల్ల కొంతమంది దక్షిణభారతీయులు వంగ, మిథిల దేశాలలోస్థిరపడటమూ, దానిఫలితంగా వంగదేశంలో సేన వంశమూ, మిథిలలో కర్ణాటక వంశమూ వర్ధిల్లటమూ సంభవించిందని తెలుస్తున్నది. ఇంతేగాక ఉత్తర దేశంలోని కొందరు శైవులు తమిళదేశంలో స్థిరపడ్డారు. ఈ ప్రఖ్యాత దండయాత్ర మూలాన రాజేంద్రుడు "గంగైకొండ" బిరుదాంకితుడు కావటమూ, దక్షిణభారతంలోని అతని నూతన రాజధానికి "గంగైకొండచోళపురం" అని పేరుపెట్టటమూ జరిగాయి.

సుమాత్రాలోని శ్రీవిజయ రాజధానికి రాజేంద్రుడు చేసిన నౌకాదండయాత్ర *అతని ఉత్తర దేశ దండయాత్రకు దీటుగా ప్రసిద్ధి కెక్కింది. ఈ దండయాత్రకు కీర్తికాంక్ష తప్ప మరో కారణం ఉండి ఉండదు. అనేక యుద్ధాలలో చోళులు వరుసగా గెలుస్తూ రావటంచేత శ్రీవిజయాధిపతి శ్రీసంగ్రామ విజయోత్తుంగవర్మ చోళ సార్వభౌమత్వాన్ని అంగీకరించాడు. మలయా, సుమాత్రా, జావా, ఇంకా వాటికి చేరువలో ఉన్న

ద్వీపాలు శ్రీవిజయరాజ్యంలో చేరినవే కాబట్టి అవి అన్నీ కూడా చోళచక్రవర్తికి లోబడ్డాయి. అయితే ఈ దూర ప్రాచ్యంలో చోళులు ప్రభుత్వం నడిపినట్లు చెప్పదగిన ఆధారాలు లేవు. శ్రీ విజయరాజు చోళచక్రవర్తికి సామంతుడుగా ఉండటానికి అంగీకరించినందువల్ల చక్రవర్తి అతని రాజ్యాన్ని అతనికే ఇచ్చి ఉంటాడు.

రాజేంద్రుని అంత్యకాలంలో చాళుక్యులశక్తి మళ్ళీ ప్రారంభమైనది. రెండవజయసింహుని వెనుక గద్దెనెక్కిన ప్రథమ సోమేశ్వరుడు (1042–68) వేంగిపై దండెత్తి చోళులను కవ్వించాడు. రాజాధిరాజు పశ్చిమచాళుక్యులను ఎదుర్కొనటానికి బయలుదేరి ఎక్కడికక్కడ విజయలక్ష్మిని చేపట్టుతూ చివరకు కల్యాణినికూడా ధ్వంసంచేశాడు. కాని సోమేశ్వరుడు త్వరలోనే గ్రుక్కత్రిప్పుకొని 1050వ సంవత్సరంలో వేంగిమీద తన అధికారం నిలబెట్టుకొని, చోళదేశం మీదకు సైన్యాన్ని పంపాడు. ఇంతలో అప్పుడే సింహాసనాధిష్ఠితుడైన రాజాధిరాజు 1052 వ సంవత్సరంలో కొప్పం యుద్ధభూమిలో సోమేశ్వరుణ్ణి ఎదుర్కొన్నాడు. యుద్ధంలో చోళులకే జయం లభించినా, రాజాధిరాజు వీరస్వర్గం అలంకరించాడు.

రాజాధిరాజు మరణానంతరం రెండవ రాజేంద్రుడూ, ఒకటవ వీరరాజేంద్రుడూ అధిరాజేంద్రుడూ ఒకరి తర్వాత ఒకరు చోళసామ్రాట్టులయినారు. రెండవ రాజేంద్రుడు (1052–64) ప్రథమ సోమేశ్వరుణ్ణి కూడల్ సంగమంవద్ద

ఓడించగా, ఒకటవ వీరరాజేంద్రుడు (1064–70) చాళుక్య దేశం మీద దండెత్తాడు. ఒకటవ వీరరాజేంద్రుడు ప్రథమ సోమేశ్వరుణ్ణి అయిదు పర్యాయాలు ఓడించినట్లు చోళ శాసనాలలో కనబడుతున్నది గానీ, ఇందులో సత్యం ఎంత వఱకున్నదో నిర్ణయించటానికి ఆధారాలు లేవు. విజయ వాడ వద్ద ఒక్కసారి చాళుక్యులను చోళులు జయించటం మాత్రం విస్పష్టంగా తెలుస్తున్నది. మహావీరుడైన ప్రథమ సోమేశ్వరుడు దీర్ఘవ్యాధి చేత చాలా బాధ పడుతూ 1068 వ సంవత్సరంలో తుంగభద్రానదిలో దూకి ప్రాణత్యాగం చేసి కొన్నాడు. అతను చోళులతో జరిగిన కొన్ని యుద్ధాలలో పరాజితుడై నప్పటికీ, మాళవ రాజైన భోజుణ్ణి ఓడించి, కోసల కళింగ దేశాలలో తన అధికారం వ్యాపింప జేశాడు.

ప్రథమ సోమేశ్వరుని అనంతరం అతనికుమారుడు ద్వితీయసోమేశ్వరుడు సింహాసనం ఎక్కాడు. కాని అతని తమ్ముడు విక్రమాదిత్యుడు అన్నకు ఎదురు తిరిగి, కొందఱు సామంతరాజులను కూడగట్టుకొని పోరు సాగించాడు. విక్రమా దిత్యుడు చోళచక్రవర్తి అయిన వీరరాజేంద్రునితో స్నేహం చేసికొన్నాడుకూడా. వీరరాజేంద్రుడు చాళుక్యరాజ్యంమీద దండెత్తాడు. విక్రమాదిత్యుడు వీరరాజేంద్రుని కొమార్తను వివాహమాడి చాళుక్యరాజ్యంలో దక్షిణార్ధానికి తన్ను యువ రాజుగా ప్రకటించుకొన్నాడు. కాని విక్రమాదిత్యుని మరణం (1070) తో పరిస్థితులు తాఱుమాఱైనాయి. అతను చాళుక్య

రాజ్యవ్యవహారాలు విజయవంతంగా పరిష్కరించుకోవటమే కాకుండా, సింహళంమీదనూ, కడారం మీదనుకూడా దండ యాత్రలుచేసి విజయంపొందాడు.

వీరరాజేంద్రుడు మరణించిన కొంతకాలానికి ఒకటవ కులోత్తుంగుడు (1070-1118) చోళచక్రవర్తి అయినాడు. ఇటు ఒకటవరాజేంద్రుని దౌహిత్రుడు కావటంచేతనూ, అటు ఒకటవ రాజేంద్రుని కూతురైన అమ్మంగదేవిని వివాహ మాడిన తూర్పుచాళుక్యరాజైన రాజరాజుకుమారుడు కావటం చేతనూ, అతను చోళసింహాసనానికీ తూర్పు చాళుక్య సింహాసనానికీ కూడా అధికారి అయినాడు. కులోత్తుం గుడు బలవంతుడైన చక్రవర్తి. అతని పరిపాలనా కాలంలో చోళుల ప్రాబల్యం వృద్ధిపొందింది. అయితే అతని కాలంలోనే సింహళం స్వాతంత్ర్యం ప్రకటించింది. కాని కులోత్తుంగుడు ఒకవివాహ సంబంధముతో సింహళరాజును ఆప్తుణ్ణిగాచేసికొని వైరంచెలరేగనీయక శాంతినే సాధించాడు. తర్వాత అతను పాండ్యులనూ చేరులనూ మళ్ళీజయించాడు. అంతేగాక వారిని ఎప్పుడూ అదుపులో ఉంచటానికి ఆరెండు రాజ్యాలలోనూ తన సైన్యాలను నిలవ ఉంచాడు. విక్రమా దిత్యుడు కొంతకాలం తన సోదరునితో, కులోత్తుంగునితో కూడా ఘర్షణపడ్డాడు. కాని 1076వ సంవత్సరంలో అన్న గారిని పట్టుకొని చెఱబెట్టి, రాజ్యమంతాతానే పాలించటం మొదలుపెట్టాడు. ఒకటవ కులోత్తుంగుడూ ఆఱవ విక్రమా

దిత్యుడూ సమకాలికులుగా దాదాపు అర్ధశతాబ్దం వరకూ రాజ్యాలేలుకొన్నారు. ఒకరిబలం ఒకరికి తెలుసు. అందుచేత పరస్పర శత్రుత్వానికి బదులు నిర్యుద్ధంగానే కాలం గడిపారు.

1076వ సంవత్సరంనుంచీ కులోత్తుంగుని కుమారులు వేంగికి రాజప్రతినిధులుగా ఉంటూవచ్చారు. 1097వ సంవత్సరంలో విక్రమచోళుడు రాజప్రతినిధిగా ఉండగా కొలనుసేనాని కళింగరాజైన అనంతవర్మ చోడగంగు తోడ్పాటుతో తిరుగుబాటు చేశాడు. విక్రమచోళుడు కొలను కళింగాలనూ రెంటినీ ఓడించి తిరిగి వేంగిలో చోళుల అధికారాన్ని నిలబెట్టాడు. తర్వాత 1110వ సంవత్సరంలో కళింగరాజు కప్పంసరిగా చెల్లించనందున కులోత్తుంగుని సైన్యాలు రెండవసారి కళింగంమీద దండెత్తాయి. ఈదండయాత్రను విజయోపేతంగా నిర్వహించిన కరుణాకరతొండైమాన్ పరాక్రమాతిశయాలు కళింగత్తుపరణి అనే ప్రసిద్ధకావ్యం వర్ణిస్తున్నది.

కులోత్తుంగుడు దూరప్రాచ్యంలో కూడా చోళుల ప్రతిష్ఠ నిలబెట్టాడు. ఇండోచీనాలోని కంబూజాతోనూ, బర్మాదేశంతోనూ, ఉత్తర భారతంలోని కనోజితోను కూడా అతనికి స్నేహ సంబంధాలుండేవి. నాగ పట్టణంలోని బౌద్ధ విహారాలకు సంబంధించిన వ్యవహారాలు పరిష్కరించవలసిందని కోరుతూ శ్రీవిజయరాజు అతని వద్దకు ఒక రాయబారిని పంపించాడు.

కులోత్తుంగుని చివటి రోజులలో ఎన్నో చిక్కులు బయలుదేరాయి. మైసూరు దేశంలో పదకొండవ శతాబ్దం ప్రారంభాన తలమెత్తిన హొయిసల వంశంలోని విష్ణువర్ధనుడు 1116 వ సంవత్సరంలో తళకాడులోని అదిగెమాన్ అనే చోళ రాజ ప్రతినిధిని తటిమివేసి గాంగవాడిలో చోళ సార్వభౌమత్వాన్ని అంత మొందించాడు. విష్ణువర్ధనుడు దక్షిణాన రామేశ్వరం వఱకూ దండయాత్ర సాగించినట్లు తెలుస్తున్నది. వేంగిలోని చోళసార్వభౌమత్వాన్ని కూలద్రోయడానికి సమయం కనిపెట్టుకొని ఉన్న ఆఱవ విక్రమాదిత్యుడు 1118 వ సంవత్సరంలో తన సేనానులను వేంగికి పంపి, అక్కడ చాళుక్యాధికారాన్ని నెలకొల్పాడు. ఈ రెండు దెబ్బల వల్లనూ కులోత్తుంగుని చివటి రోజులలో అతని ప్రతిష్ఠకు భంగం కలిగింది. కాని మొత్తంమీద కులోత్తుంగుడు చోళ సామ్రాజ్యాన్నతికీ, ప్రజల సుఖమయ జీవనానికీ చాల కృషిచేసి, కృతకృత్యుడైనాడని మాత్రం ఒప్పకోక తప్పదు.

పన్నెండవ శతాబ్దం పూర్వార్ధంలో పశ్చిమ చాళుక్యుల అధికారం అంతరించింది. 1126 వ సంవత్సరంలో విక్రమాదిత్యుడు మరణించిన తర్వాత అతని కుమారుడు తృతీయ సోమేశ్వరుడు శాంతి ప్రియుడు కావటం చేత వేంగిలో తనకు కల పలుకుబడి అంతా పోగొట్టుకొన్నాడు. హొయిసల విష్ణువర్ధనుడు చాళుక్యులకు ఎదురు తిరిగి వారి రాష్ట్రాలు కూడా కొన్ని ఆక్రమించు కొన్నాడు. తృతీయ సోమేశ్వరుని కుమారుల

కాలంలో చాళుక్య ప్రభుత్వం క్షీణించటం తటస్థించింది. కాక తీయులు ఒకప్రక్కనూ, కాలచుర్యులు ఒక ప్రక్కనూ ఇందుకు కారకులయినారు. చిట్టచివటి చాళుక్య రాజైన మూడవ తైలుడు మరణించగానే కాలచుర్య వంశీయుడైన బిజ్జలుడనే సేనాని చాళుక్య సామ్రాజ్యాన్ని కైవసం చేసికొని 1163 వ సంవత్సరంలో కల్యాణిలో సింహాసనం ఎక్కాడు.

కులోత్తుంగుని అనంతరం చోళసింహాసనం అధిష్ఠించిన ఒకటవ విక్రమచోళుడు ఆఱవ విక్రమాదిత్యుని మరణానంతరం వేంగిలో చోళుల అధికారాన్ని పునస్థాపితంచేసి, గాంగవాడిలో కొంతభాగంకూడా స్వాధీనం చేసికొన్నాడు. ఇంత జరిగినా కేంద్రప్రభుత్వాధికారం క్షీణించి, విప్లవాలు తలఎత్తూ బయలు దేరుతూవచ్చాయి. విక్రమచోళుని తరువాతవారు 13వశతాబ్ది ప్రారంభంలో కొంతకాలంవరకూ తమ రాజ్యాన్ని నిలుపుకో గలిగారుకానీ, పాండ్యదేశంలో వృద్ధిఅవుతూవచ్చిన తిరుగు బాట్లూ చోళులలోనే సాగిన అంతఃస్పర్థాలూ, అప్పుడేబయలు దేఱిన కాటకాలూ చోళప్రభుత్వాన్ని క్షీణింపజేసినవి. చిట్ట చివఱకు తృతీయరాజేంద్రుని పరిపాలన (1246–79)అంతమౌతూ వుండగా పాండ్యులు చోళరాజ్యాన్ని ఆక్రమించివేశారు.

చేరమాన్ పెరుమాళ్ అనంతరం కేరళం:- తొమ్మి దవశతాబ్దంలో చేరమాన్ పెరుమాళ్ రాజ్యమంతా ధర్మంగా పంచిపెట్టిన తరువాత కేరళదేశచరిత్ర యెలానడిచిందో తెలిసి కొనటానికి ఆధారాలులేవు. కేరళలోని వేర్వేఱు ప్రాంతా

లను వేర్వేరు రాజులు పాలించారు. 9వశతాబ్దంనుంచీ చేర రాజులను గురించీ, వారికి సమకాలికులైన వేనాడు పాలకు లను గురించీ అప్పుడప్పుడు చరిత్రలో వినబడుతూ ఉంటుంది. పెరుమాళ్ వంశంతరువాత మొట్టమొదట పరిపాలన చేసిన వాడు చేరరాజై ఉండవచ్చును. అయితే అతని ఆధిక్యాన్ని తక్కిన ప్రాంతాల ప్రభువులు అంగీకరించారో లేదో తెలియదు. కొంతమంది కొల్లం ప్రభువులు తాము చక్రవర్తులమని ప్రకటించుకొని ఉండటంచేత చేరరాజు కొల్లం రాజధానిగా పరిసరప్రాంతాలను పాలించి ఉండవచ్చునని ఊహించటానికి అవకాశం ఉన్నది. ప్రాచీనచేరరాజధాని అయిన మహోదయ పురంలోఉన్న ప్రభువు ఈకాలంలోగానీ, ఇటుతరువాతగానీ ఏమాత్రమైనా ప్రాముఖ్యం సంపాదించినట్లు నిదర్శనాలులేవు. కాని దక్షిణ కేరళదేశచరిత్రకు సంబంధించిన ఒక్క అంశంలో మాత్రం చాలాసామగ్రి ఉన్నది. దక్షిణ తిరువాన్కూరులో రాజ్యంచేసే వైనాడు ప్రభువు తరుచూ పాండ్యులదాడులను అటుపిమ్మట చోళులదాడులనూ ఎదుర్కోవలసి వచ్చేది. అప్పుడప్పుడు చేరచక్రవర్తి అతనికి సాయంచేశేవాడు.

9వశతాబ్దంలోని చేరరాజు స్థాణురవిని గురించీ, క్రైస్తవవర్తకులకు అతను వాణిజ్యసౌకర్యాలు కలిగించినట్లు తెలిపే కోట్టయమ్ శాసన ఫలకాలను గురించీ ఇదివరకే విన్నాము. స్థాణురవి 9వ శతాబ్దం చివరివరకూ రాజ్యం చేసినట్లు కనబడుతుంది. అతను ప్రథమాదిత్యునికిసమకాలికుడు.

అతని పుత్త్రికను ప్రథమాదిత్యుని కుమారుడైన ఒకటవ పరాంతకునికి ఇచ్చి వివాహం చేశాడు. స్థాణురవి అనంతరం విజయరాఘవ దేవుడే సింహాసనం ఎక్కినట్లు కనబడుతుంది. కోట్టయమ్ శాసన ఫలకాలు "కోయిలాధికారిగళ్" అనీ, అదే కాలంనాటి తిరువాత్తియూరు లోని కట్టడాలమీది శాసనాలు "కేరళరాజు" అనీ ఇతనిని పేర్కొంటున్నాయి. ఈ వంశానికి చెందిన కోడైరవీ, ఇందుకోడవర్మన్ వంటి రాజుల పేర్లు శాసనాలలో కనబడుతున్నాయి. అయితే స్థాణురవి తర్వాత రాజ్యం చేసిన వారిలో భాస్కరరవివర్మ (1047–1108) మాత్రంబాగా ప్రసిద్ధికెక్కాడు. వేనాడు ప్రభువులైన శ్రీవల్లభన్ కోడై ఒకటవ గోవర్ధనమార్తాండవర్మ వరుసగా అతనికి సమకాలికులు. కేరళానికి వలస వచ్చిన కొంతమందియూదులకు కొన్ని హక్కులు ప్రసాదించే సందర్భంలో భాస్కరరవివర్మ ఆఅంశాలను రాగిరేకులమీద వ్రాయించాడు. "అంజువణ్ణం" అనే పేరవర్తకసంఘంగా ఏర్పడ్డ ఇసుపురంబాన్ (జోసెఫ్‌రంబాన్) అతని అనుచరులూ ఈదానశాసనాల మూలాన ఒకగ్రామాన్నీ అందులో బండ్లరాకపోకలకు పన్నులు వసూలుచెయ్యటం, ఇరుపురబ్బనూ అతని సంతతివారూ పల్లకిఎక్కివెళ్ళటం మొదలైన 62 యాజమాన్యపు హక్కులనూ సంపాదించారు. ఈ "అంజువన్నం" గురించి ఎల్లిస్, గుండర్ట్, బర్నెల్ అనే ముగ్గురూ మూడురకాలుగా వ్యాఖ్యానిస్తున్నారు. నిజానికి వెంకయ్య చెప్పినట్లు ఇందులో అయదు జాతులున్నాయి. రెండు కోట్టయం శాసనఫలకాలవల్ల ఈఝవర్, తచ్చర్,

-వెల్లాలర్, నన్నార్, ఇంకొకటేదో మొత్తం అయిదు జాతుల వారు క్రైస్తవమతాన్ని స్వీకరించారని తెలుస్తున్నది. అయిదో జాతిపేరు శాసనంలో సరిగా కనబడటంలేదు. మొత్తంమీద ఈఅయిదుకులాలవారూ అంజువణ్ణాత్తార్ ఏర్పడటానికి కారణమైనారు. ఈదానశాసనానికి అయిదునాడుల సామంతులూ సాక్షులుగా ఉన్నట్లుకనబడుతున్నది.ఈఅయిదుగురుసాక్షులలో వేనాడు సామంతుడైన గోవర్ధనమార్తాండవర్మ ఒకడు. కేరళదేశంలో భాస్కరరవివర్మ సార్వభౌమత్వానికిఇదిఒకనిదర్శనం. అయితే కొందరు చరిత్రకారులు ఈదానశాసనం చరిత్రాత్మకత్వాన్ని గురించి అనవసరంగా అనుమానిస్తున్నారు. దక్షిణాన చంగనాశ్శేరిలోనూ, ఉత్తరాన వైనాడులోని తిరునెల్లెలోనూ మొదలుగా కేరళంలోని అనేకప్రాంతాలలో ఇంతవఱకూ త్రవ్వితీసిన వాటిలో భాస్కరరవివర్మ శాసనాలనేకం కనబడుతున్నాయనే విషయం జ్ఞాపకం పెట్టుకోవాలి.

11వశతాబ్దంలో ప్రథమరాజరాజుకాలంలోనూ, ప్రథమరాజేంద్రునికాలంలోనూ చోళసామ్రాజ్యం వేనాడుసహితంగా కేరళంలో చాలావఱకు వ్యాపించింది. రాజరాజు విళింజం పట్టుకోవటం అలాఉండగా, పరశురాముని దేశాన్నీ కళింగత్తుపరణినీ జయించినట్లూ, చేరదేశంలో చాదయం ఉత్సవాన్ని జరిపించినట్లూ తెలిపే తిరువాలంగాడు శాసనఫలకాలవల్ల కేరళం మీాద అతనికి సార్వభౌమత్వం ఉన్నట్లు చెప్పవలసివస్తున్నది. అయితే విళింజమ్‌ ఉత్తరాన ఉన్న చేరదేశం చోళుల ప్రత్యక్ష

పరిపాలనలోకి రాలేదు. చోళసార్వభౌమత్వం అక్కడ నెలకొన డానికి ముందు కొంత కథ జరిగింది. కొల్లంలోని చేరరాజు రాజరాజచక్రవర్తికి ఎదురుతిరిగాడు. తరవాత ప్రథమకులోత్తుం గుని క్రీ॥శ॥ (1070-1118) మీదకూడా తిరుగుబాటు చేశాడు. అయితే కులోత్తుంగుడు తనకు ఎదురుతిరిగిన పాండ్య కేరళ రాజులను లొంగదీసికొన్నట్లు అతని చిదంబరం శాసనాలు ఘోషిస్తున్నాయి. విక్రమచోళ ఉల, కళింగత్తూపరణి ఈవిజ యాలను మరింత వివరిస్తున్నాయి. పాండ్య కేరళ దేశాలకు రాకపోకలు జరిగే ప్రధాన మార్గాలలో కులోత్తుంగుని సేనా నివేశాలు ఉండటమే ఈ తిరుగుబాట్లకుకారణం. 1098వసంవత్స రంలో కొల్లంలో మరొక తిరుగుబాటు పుట్టింది. ఇందులో వేనాడు ప్రభువుకూడా పాల్గొన్నాడు. కాని "కొల్లం అలింద ఆండు" అనే నూతనశకాన్ని ప్రారంభించినవాడూ, కులోత్తుం గుని సేనానులలో సుప్రసిద్ధుడూ అయిన "నరలోకవీరుడు" అనే మహాపరాక్రమశాలి కొల్లం విధ్వంసంచేసి యీతిరుగు బాటును అణచివేశాడు.

ప్రథమకులోత్తుంగుని అనంతరం సింహాసనం ఎక్కిన విక్రమచోళుని కాలంలో పరాంతకపాండ్యుడు వేనాడుమీాద దండెత్తి తిరువనంతపురందాక వెళ్ళాడు. వేనాడు రాజునుఓడించి అతని కూతురిని వివాహమాడాడు. పరాంతకునివిజయాలను పేర్కొనే కన్యాకుమారిశాసనం వేనాడు ఒకవైపు చేర దేశంతోను మరొకవైపుకూపక దేశంతోనూ అభిన్నమైనదని చెప్తూతున్నది.

ఇందువల్ల చేరరాజు అధికారం ఎంత మేరకు ఉండేదో, వేనాడు ప్రభువు అధికారం ఎంతవరకు చెల్లుబడి అయ్యేదో నిర్ణయించటానికి వీలులేకుండాపోతున్నది. కూపకం అనేది కొల్లం పక్కనే వున్నది. చేరసామ్రాట్టు కూపకానికికూడా ప్రభువై ఉండవచ్చును. కులోత్తుంగునికి సమకాలికుడైన చేరరాజు రామన్ తిరువడి శ్రీ కులశేఖరచక్రవర్తిగళ్ వేనాడుప్రభువున్నూ చేరరాజున్నూ ఒకరే అనే టి. కె. వేలు పిళ్ళె సిద్ధాంతం అంగీకరించవగిందిగా కనబడదు. కొంతమంది వేనాడుప్రభువులు తాము కూపకచక్రవర్తులమని ప్రకటించుకోగా, వారికాలంలో చేరరాజ్యానికి ప్రత్యేకించి ఒకరాజు ఉండటంవల్ల ఆయన సిద్ధాంతం ఋజువుకాకపోతున్నది.

ఏదియేమైనా 12 వ శతాబ్దం ప్రారంభంలో వేనాడు ప్రభువుబలం హెచ్చింది. వీరకేరళుడు (1117 - 45) చోళ సార్వభౌమత్వాన్ని ధిక్కరించి నంచినాడులో స్వాతంత్ర్య పతాకం ఎగురవేశాడు. వీరకేరళుని తరువాతవారుకూడా పాండ్యులతో పోరాడవచ్చినప్పటికీ నంచినాడుమీద తమ అధికారాన్ని నిలుపుకోగలిగారు. 1275 వ సంవత్సరం తరువాత వేనాడురాజ్యమేలిన ఉదయమార్తాండవర్మ కొలంబ (కొల్లం) రాజని గోశాల శాసనం పేర్కొంటున్నది. దీనినిబట్టి ఆలోచిస్తే ఈ ఉదయమార్తాండవర్మ తనకు చక్రవర్తి అయిన చేరరాజును ఓడించి కొల్లం స్వాధీనపరచుకొని ఉండవచ్చునని గాని, చేరరాజుకూతురిని పెండ్లాడి మామగారికి ఇతర సంతాన

మేమీ లేనందువల్ల ఆయన అనంతరం ఆ రాజ్యానికికూడా అతనే అధిపతి అయిఉండవచ్చునని కాని అనుకోవలసివస్తుంది.

పరిపాలనా ప్రభుత్వం :— చోళచక్రవర్తులు రకరకాల ఉద్యోగులను నియమించి ప్రభుత్వయంత్రం ఎక్కడా కుంటుపడకుండా చూచారు. అయినప్పటికీ వారిపద్ధతి తొలిరాజుల పరిపాలనా పద్ధతికి పూర్తిగా భిన్నమైనదికాదు. కాలం గడచినకొద్దీసింహాసనంకోసం తగవులాటలు సాగినా, తండ్రి తరువాత కుమారుడే రాజుకావటం సర్వసమ్మతమైన ఆచారంగా ఉండేది. ఆఱవ విక్రమాదిత్యుడు అన్నగారితో యుద్ధంచెయ్యటం, ఉత్తమ చోళుడు తోబుట్టువు కుమారుణ్ణి హత్యచెయ్యటం, రాజ్య కాంక్షవల్ల పుట్టే దారుణ చర్యలకు ఉదాహరణాలు. తఱచూ జరిగే కుట్రలూ, ఇరుగుపొరుగురాజుల జోక్యాలూ, పరిస్థితులను మఱింత విషమింపజేసేవి. తూర్పు చాళుక్యరాజ్యంలో చెలరేకపనుల్ని లేవదియ్యటానికి పశ్చిమచాళుక్యులూ-చోళులు చేసిన ప్రయత్నాలు ఎడతెగని పోరాటాలకు కారణాలైనాయి.

రాజప్రతినిధులకూ రాయబారులకూ ప్రాముఖ్యం హెచ్చటంవల్లనూ, రాజ్యపుటాదాయాలు అభివృద్ధి కావటం వల్లనూ, రాజాస్థానాలు వివిధాలంకారాలతో తేజరిల్లుతూ లోకోత్తరమైన వైభవానికి పెట్టినదిపేరుగా ఉండేవి. పట్టాభిషేకాలు మొదలయిన రాజకుటుంబ సంబంధమైన ఉత్సవాలు విశేష ధనవ్యయంతో ఎంతోభారీఎత్తున జరిగేవి. రాజుకు అంగరక్షకులూ, అనుచరులూ ఎక్కువైనారు. వీటివల్ల

సామాన్య మనుష్యునికీ, చక్రవర్తికీ మధ్య పెద్దఅగాధం ఏర్పడ్డది. ప్రజాహోదంకంటె రాజానుగ్రహమే ముఖ్యంగా భావించే రాజోద్యోగులు ఈ అగాధాన్ని ఎంతమాత్రమూ తగ్గించలేకపోయారు.

మంత్రులే కాకుండా వేర్వేరు ప్రత్యేక విధులు నిర్వహించటానికి అసంఖ్యమైన ఉద్యోగి బృందం ఉండేది. ముఖ్యంగా చోళుల పరిపాలనా పద్ధతి సుశిక్షితమైన ఉద్యోగి సముదాయంమీద ఆధారపడి ఉండేది. నలుగురు ప్రధాన కార్యదర్శులూ, పన్నులు వసూలుచేసే రకరకాల ఉద్యోగులూ భూమికొలతలువగైరా రాసే ఉద్యోగులూ మొదలయిన వారు ఎందరో ఉండేవారని తెలుస్తున్నది. "ఓలై నాయగమ్" అనే ఉద్యోగి రాజుకు ఎంతో అంతరంగికుడని తోస్తుంది. ఇతను ఎప్పుడూ రాజసన్నిధానంలో ఉండి, రాజు ఎప్పుడు ఏమి ఆజ్ఞచేసినా దానిని తక్షణం అమలు జరిపించేవాడు. 'అధికారులు' అనే పేర ప్రత్యేక శాఖగా ఉన్న రాజాజ్ఞానిర్వాహకోద్యోగులకు ఆజ్ఞాపత్రాలు చేరే లోపుగానే వాటిని సరిచూచి పంపటానికి మరికొంతమంది ప్రత్యేకోద్యోగులుండేవారు. "ఓలై నాయగమ్" మాత్రమే కాక వాణిజ్య విషయమై రాజుకు సలహాలివ్వటానికి 'ఉడన్ కూట్టమ్' అనే పేర ఒక మంత్రివర్గం నిత్యమూ అందుబాటులో ఉండేది. భూమిపన్ను, లెక్కలు, ముఖ్యపత్రాలు, రవాణా మొదలయిన వాటికి వేర్వేరు శాఖలుండేవి. చోళశాసనాలలో కనబడే

"కరుమిగళ్" అనే సంకేతపదం ఉద్యోగిలోక మంతటికీ వర్తించే పదం. కాని చోళులకాలంనాటి ప్రభుత్వోద్యోగాలు ఈనాటి ఏయే ఉద్యోగాలవంటివో పోల్చి చెప్పటం కష్టం.

చోళచక్రవర్తులకు సమకాలికులయిన రాష్ట్రకూటులూ పశ్చిమ చాళుక్యులూ, తూర్పుచాళుక్యులూ, గాంగులూ, పాండ్యులూకూడా రకరకాల ఉద్యోగులను ఎందఱినో నియమించారుగానీ, చోళప్రభుత్వంవలె వారి ప్రభుత్వాలు అంత కట్టుదిట్టంగా ఉండలేదు. రాష్ట్రకూటప్రభుత్వంలో "మహా సంధి విగ్రహికులు" అంటే విదేశవ్యవహారాలు చూచే మంత్రులు ఉండేవారు. "భాండాగారికుడు" అనేపేర కోశాధికారిఉండేవాడు. "బలాధికృతుడు" "దండనాయకుడు, "మహా ప్రచండదండనాయకుడు" అనివేర్వేఱుహోదాలుగల సైన్యాధిపతులుండేవారు. కల్యాణీ, వేంగీ చాళుక్యప్రభుత్వాలలోని ఉద్యోగులపదవులు రాష్ట్రకూట ప్రభుత్వోద్యోగుల పదవులనే పోలిఉన్నాయి. మహాసంధివిగ్రహికపదవి అన్ని రాజ్యాలలోను ఉన్నది. బహుశః ఈ "మహాసంధివిగ్రహిక" పదవి గుప్తుల పరిపాలనాపద్ధతిననుసరించి ఏర్పడి ఉంటుంది. సేనాపతి, అధికారులు (ప్రభుత్వాజ్ఞలు అమలు జరిపే ఉద్యోగులు), విషయపతి(జిల్లాఅధికారి), గ్రామకూట (గ్రామాధికారి) ఇత్యాదులు శాసనాలలో కనబడుతున్న కొన్ని ఉద్యోగనామాలు. గాంగ శాసనాలు "రాయసూత్రాధికారి" (రాజలేఖకుడు) "రహస్యాధికుడు" (ఆంతరంగిక కార్యదర్శి), "లేఖకుడు" (అవసరపత్రి)

రక్షకుడు), "నిధికాయుడు" (కోశాధికారి), "పాదియాయుడు" (రాజభవనరక్షకుడు) మొదలయిన కొందరు ఉద్యోగులను పేర్కొంటున్నాయి. పశ్చిమచాళుక్య రాజభవనంలో మణేవార్గడే (రాజగృహరక్షకుడు) భానేశవార్గడే (మహానసాధ్యక్షుడు) అనే ఉద్యోగులు ఉండేవారు. మనకు లభించిన శాసనాదికాలలో ఈవివరాలు కనబడకపోయినా, తూర్పుచాళుక్య ప్రభుత్వంలోకూడా ఇటువంటి ఉద్యోగులు ఉండి ఉంటారని ఊహించవచ్చును. ప్రాచ్య (తూర్పు) చాళుక్యరాజోద్యోగులలో "కటకాధీశుడు" (రాజవసతిగృహపర్యవేక్షకుడు) అనే ఉద్యోగికూడా ఉన్నట్లు మాత్రం తెలుస్తున్నది.

దక్కను రాజ్యాలలోనూ అత్యంత దక్షిణప్రభుత్వాలలోనూకూడా "దండనాయకుడు" అనే ఉద్యోగిఉన్నట్లు శాసనాలలో కనబడుతున్నది. సాధారణంగా ఈపదం సైనికోద్యోగికి వర్తించేదిగా కనబడుతున్నా ఇతరోద్యోగులకుకూడావర్తిస్తుందని అనేక సందర్భాలనుబట్టి ఊహించవలసివస్తున్నది. సైనికోద్యోగులలోనేకాక ఆయుధప్రయోగంతో నిమిత్తంలేని ఇతరోద్యోగులలోకూడా ఒకతరగతికి చెందినవారి కందరికీ ఈ "దండనాయకుడు" అనే పదం సామాన్యవ్యవహారంలో ఉండేది. దక్కనురాజ్యాలలో ఉద్యోగుల్ని పేర్కొనటం ఉత్తరభారతపద్ధతినీ, సంస్కృతభాషాసిద్ధంగానూ జరుగుతూ ఉండగా, చోళశాసనాలలో ఆపేర్లన్నీ దేశ్యాలుగా ఉండటం ముఖ్యంగా గమనించదగ్గవిషయం.

అయితే ఉద్యోగులసంఖ్యా, ప్రభుత్వశాఖలసంఖ్యా పెరిగితే ప్రభుత్వానికి ఖర్చుకూడా విశేషంగా ఉండవచ్చునుగదా! ప్రభుత్వానికి ఎప్పుడున్నూ ప్రధానమైనఆదాయం భూమిపన్ను. ప్రతిగ్రామమున్నూ వస్తురూపంలోగానీ, ధనరూపంలో గానీ ప్రభుత్వభాగం సమకూర్చి రాజోద్యోగులకు చెల్లించేది. భూమి అంతా సక్రమంగా కొలిచి, హద్దులు నిర్ణయించి, భూసారాన్ని బట్టి పన్ను నిర్ణయించటం జరిగేది. ఈసర్వేపని ఒక్క చోళ సామ్రాజ్యంలోనేగాక కన్నడ, తెలుగు రాజ్యాలల్లో కూడా జరిగేది. భూమిని కొలవటానికి వేర్వేరు పొడవుల కొలబద్దలు ఉపయోగించటం ఉండేదని శాసనాలవల్ల తెలుస్తున్నది. సేద్యమయే భూమి పల్లమూ మెట్టూ అని ముఖ్యంగా రెండు తరగతులుగా ఉండేది, పల్లపుభూములకు పన్ను విధించేటప్పుడు భూసారమూ, అందులో వేసే పైరూ, దానికి కల నీటివసతీ మొదలయినవన్నీ విచారించేవారు. అయితే శిస్తుప్రమాణం ఏవిధంగా ఉండేదో తెలిసికొనటానికి అవకాశాలు తక్కువ. ప్రథమరాజరాజచోళుని కొన్ని శాసనాలనుబట్టిపంటలో మూడవ వంతు దాకా శిస్తు వసూలు జరుగు తున్నట్లు కనబడుతుంది, కాని పంటలో ఆఱవవంతుదాకాకూడా శిస్తు తగ్గినట్లు ఇతరులశాసనాలవల్ల తెలుస్తున్నది. తరువాతకాలంలో విజయనగరచక్రవర్తులు పంటలో మూడవవంతుదాకా శిస్తు పెంచినా, మనువూ మాధవాచార్యుడూ నిర్ణయించినట్లుసాధారణంగా ఆఱవవంతుమాత్రమే కర్ణాటాంధ్రరాజులు వసూలు

చేసేవారు మొత్తంమీద దక్షిణభారతంలో భూమిశిస్తుపంటలో ఆఱవవంతు దగ్గఱనుంచి, మూడవవంతుదాకా వసూలవుతూ ఉండేదనిమాత్రం స్పష్టపడుతున్నది. అన్ని రాజ్యాలలోనూ చక్రవర్తులు కొందరు వ్యక్తులకుగానీ, కొన్ని సంస్థలకుగానీ భూమిశిస్తులేకుండా చెయ్యటమున్నూ ఉండేది. దేవాలయ భూములకూ బ్రాహ్మణాగ్రహారాలకూ, కొంతమంది బ్రాహ్మణులకూ కవులకూ, పీఠులకూ ఇచ్చిన ఈనాములకూ శిస్తు ఉండేదికాదు.

వృత్తిపన్నూ, ఇంటిపన్నూ, చరాస్తిపన్నూ, ఎగుమతి దిగుమతులమీదపన్నూ, రహదారిపన్నూ, జరిమానాలూ, పెండ్లిండ్లవంటి కార్యకలాపాలమీదపన్నూ ప్రభుత్వానికి ఇతర విధాల ఆదాయానికి ఆధారాలు. ఇవేకాక, గనులూ, అడవులు, ఉప్పుకొటార్లూకూడా ప్రభుత్వానికి ఆదాయం తెచ్చిపెట్టేవి. ఒకటవకులోత్తుంగుడు రహదారి పన్ను లెన్నో రద్దు చేసిప్రజల అభిమానాన్ని చూఱగొన్నాడు. దీనిని బట్టి విచారిస్తే .ఈ రహదారి పన్నులనేవి అసంఖ్యాకాలుగానూ, దుర్భరాలు గానూ ఉండేవని తోస్తుంది. కన్నడదేశంవిషయం ప్రస్తావిస్తూ వంటచెఱకూ, ఎండుగడ్డీ మొదలుగాగల సమస్త వస్తువుల మీదనూ ఎలా పన్నులుండేవో యల్. రైస్ విశదీకరించాడు. ఆకాలంలో దక్షిణభారతంలోని రాజులందఱూ ఇన్ని రకాలు గానూ ధనం సమకూర్చేవారు. భూమిపన్నూ, ఆస్తిపన్నూ వృత్తిపన్నూ, అమ్మకపుపన్నూ అన్ని దక్షిణరాజ్యాలలోనూ ముఖ్యమైన ఆదాయమార్గాలుగా ఉండేవి.

కొన్నిరకాల వృత్తులపన్నులు ఏవిధంగా నిర్ణయించటం జరిగేదో తప్పక తెలిసికొనదగిన విషయం. కుమ్మరివృత్తికీ అతను ఉపయోగించే చక్రానికీ కూడా కలిపి రెండు పన్నులు వసూలు చేసేవారు. చాకలి బట్టలు ఉతికే అాతిబండకున్నూ, మంగలికత్తికిన్నీకూడా పన్ను వెయ్యటం ఉండేది. కలాలీ తాడిచెట్టు ఎక్కటానికి ఉపయోగించే నిచ్చెనకూ, వేశ్యలు వాడే అద్దాలకూ కూడా ప్రత్యేకంగా పన్నులు విధించేవారు.

కొన్నికొన్ని నేరాలకు న్యాయస్థానాలు విధించే జరిమానాలు కూడా ప్రభుత్వానికి ఒక ఆదాయంగా ఉండేవి. అభియోగాలు విచారించి తీర్పులు చెప్పటమూ, జరిమానాలు వసూలు చెయ్యటమూ స్థానికనాయకుడుకానీ, స్థానికపరిషత్తుగానీ చెయ్యవలసిన పనులు. కన్నడదేశంలో ఇటువంటి సందర్భాలలో నలుగురూ కలసి ఎన్నుకొన్న వయోవృద్ధుడు ఈ అధికారాలు చలాయించేవారు. చాలా నేరాలకు, చిట్టచివరకు నరహత్యలకు కూడా జరిమానాలుగానీ, దేవాలయాలకు కానుకలు ఇవ్వటంగానీ శిక్షలుగా ఉండేవనేది గుర్తుపెట్టుకోదగ్గ విశేషం. ఒక రాజోద్యోగిని చిత్రవధచేసిన దోషికి కూడా ద్వితీయరాజేంద్రుడు స్థానిక దేవాలయంలో దీపారాధననిమిత్తం 96 గొఱ్ఱెలను కానుకగా ఇయ్యవలసిందనిమాత్రమే ఆజ్ఞాపించాడు.

కొన్నికొన్ని దారుణాలైన అపరాధాలకు శిరశ్ఛేదము, ఏనుగుచేత త్రొక్కించి చంపటమూ వంటి కఠినశిక్షలు విధించటం ఉన్నప్పటికీ న్యాయవిచారణపద్ధతి ప్రజలకు మరీ లోకు

వగా ఉన్నట్లే కనబడుతుంది. సాధారణంగా గ్రామసభలు గానీ, పంచాయతీలుగానీ న్యాయవిచారణ చేసేవి. అయితే అక్కడ అన్యాయం జరిగిందని తోస్తే రాజువద్దకు వెళ్ళవచ్చును. రాజుతీర్పుకుమాత్రం తిరుగులేదు. అతనే ప్రధానన్యాయమూర్తి. రాజధానిలోను, పట్టణాలలోనూకూడా న్యాయమూర్తులుండే వారు. వీరు రాజుకుబదులుగా న్యాయవిచారణ చేసేవారు. స్థానికవ్యవహారాలలో దేవాలయధర్మకర్తలూ, ఊరి పంచాయతీలూకూడా తగవులు పరిష్కరించటం ఉండేది. అయితే ఈరకరకాల న్యాయస్థానాల అధికారాల పరిమితులుమాత్రం స్పష్టంగా తెలిసికొనటానికి అవకాశాలు లేవు.

పెరియపురాణంలో సుందరమూర్తిపై వచ్చిన అభియోగాన్ని పరిశీలించిన పద్ధతినిబట్టి చూస్తే న్యాయవిచారణ తొందరలేగానూ నిష్పక్షపాతంగానూ కూడా జరిగేదని తోస్తుంది. పత్రమూలకమైన సాక్ష్యానికి ప్రాముఖ్యం ఉండేది. సరిఅయిన సాక్ష్యం లేనప్పుడు సత్యం తెలిసి కొనటానికి అగ్ని పరీక్షలవంటివి కూడా జరుగుతూఉండేవి. కాని దక్షిణ భారతరాజ్యాలన్నింటి లోనూ కూడా, అపరాధిని శిక్షించవలసి నప్పుడు మానవప్రాణానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చి న్యాయస్థానాలు కారుణ్యం మోతాదు ఎక్కువై దోషులకులోకువగా ఉండేవని మాత్రం చెప్పక తప్పదు. సాధారణంగా అన్ని అపరాధాలకూ జరిమానాలు విధించటమే జరిగేదనీ, దొంగతనం, వంచనం అనే వాటికి మాత్రమే మరణ శిక్ష ఉండేదనీ, గాంగ

చోళ చాళుక్య రాజుల శాసనాలెన్నింటిలోనో కనబడుతున్నది. తనదికాని కుక్కను తెచ్చి కట్టివేసికొన్నందుకు ఒక సేనానిని న్యాయమూర్తులు విచారించి, అతనిగ్రృహం తగుల బెట్టించి నట్లున్నూ, అతని ఆస్తిని ప్రభుత్వం స్వాధీన పఱచు కొన్న ట్లున్నూ గాంగ శాసనం ఒకటి ఘోషిస్తున్నది.

స్థానిక ప్రభుత్వం:- అతిప్రాచీనకాలంలో మాదిరి గానే ప్రభుత్వ నిర్వహణానికి వీలుగా రాజ్యాలు కొన్నికొన్ని భాగాలుగా విభజించటం ఉండేది. ఈకాలంనాటి చోళ సామ్రాజ్యంలోనూ, తూర్పు చాళుక్యుల రాజ్యంలోనూ బృహత్తమ విభాగానికి "మండలం" అనిపేరు ఉండేది. చోళ రాజ్యంలో మండలాన్ని రెండు భాగాలుగా విభజించారు. ఆఅర్ధమండలానికి "వళనాడు" అని పేరు. ఈవళనాడులో మళ్ళీ "నాడులు" అని చిన్నచిన్న భాగాలుండేవి. ఈనాడులనే "కుఱ్ఱంలు" "కుట్టంలు" అని కూడా అంటారు. తక్కిన దక్షిణభారతంలో మాత్రం ప్రాంతవిభజనా, వాటిపేర్లూ 6, 7 శతాబ్దాలలో మాదిరిగానే వుండేవి. అలాగే రాష్ట్రపరిపాలన కూడా రాజకుటుంబంలోని వ్యక్తికిగానీ, ప్రాముఖ్యంకల నాయ కునికికానీ ఒప్పగించేవారు.

ఈయుగంలోని విశేష ప్రాముఖ్యమున్నది గ్రామ స్వపరి పాలన. గ్రామాలు రెండురకాలుగా వుండేవి. బ్రహ్మదేయ మనేది మొదటిరకం. చోళదేశంలో "ఊరు" అనీ కన్నడ దేశంలో "గ్రామం" అనీ రెండవరకానికి పేరు. తమిళదేశం

లోని స్థానికసంస్థలను గురించి సమగ్రంగా తెలుస్తున్నదికానీ, అటువంటి సంస్థలు దక్కనులోకూడా ఉన్నాయో లేవో తెలియదు. అతి ప్రాచీనకాలంలోవలెనే బ్రహ్మదేయానికి (బ్రాహ్మణగ్రామానికి) మహాసభ (దక్కనులో "మహాజన") ఉండేది. క్రీ॥శ॥10వ శతాబ్దంనుంచీ ఈమహాసభ స్థానిక స్వపరిపాలనకు బలమైన సాధనంగా అభివృద్ధి చెందింది. తీర్పులు అమలు జరపటానికి "ఏరివారియమ్" (వనసంఘం) "పొన్ వారియమ్" (సువర్ణసంఘం) వంటి వేర్వేరు సంఘాలుండేవి. సంఘనిర్మాణపద్ధతి గమనించదగ్గది. 30 కుటుంబాలు(పేటలు)గా విభజించబడ్డ గ్రామంలో ఒక్కొక్కకుటుంబం వయస్సూ, ప్రవర్తనా, విద్యా, ఆస్తి మొదలయిన యోగ్యతలనుబట్టి ఒక్కొక్క అభ్యర్థి పేరు సూచించాలి. కుటుంబాలు పేర్కొన్న ఈఅభ్యర్థులజాబితాలోనుంచీ అవసరమైనంతమందిని మాత్రం లాటరీపద్ధతిగా ఎన్నుకోవటం జరిగేది. ఈ పేర్లుసూచించటమూ, లాటరీపద్ధతీచాలా ప్రశంసనీయంగా ఉండేది. ఎందువల్లనంటే అపమార్గాలద్వారా సభ్యత్వం సంపాదించటానికి అవకాశం లేదు. అన్ని బ్రహ్మదేయాలలోనూ ఇదే పద్ధతిని సంఘాలు ఏర్పరచడం ఉన్నదోలేదో తెలియదుగానీ, తమిళ మళయాళ దేశాలలోనూ, కన్నడ తెలుగు దేశాలలోనూ బ్రహ్మదేయాలకు మహాసభలుమాత్రం వుండేవి. పదోశతాబ్దంనుంచి పదునాలుగో శతాబ్దంవరకూ దక్షిణభారతంలో బ్రహ్మదేయాలకు సువర్ణయుగం అనటంలో సందేహంలేదు.

రెండో రకం గ్రామాన్ని "ఊరు" లేక "బ్రహ్మదేయేతర గ్రామం" అనేవారు. దక్కనులో బ్రహ్మదేయేతర గ్రామానికి "గ్రామం" అనికూడా పేరుఉండేది. మొత్తం దేశంలో ఇటు వంటి గ్రామాలే ఎక్కువగా ఉన్నప్పటికీ ఈగ్రామ సభలను గురించి అంతగా తెలియటంలేదు. "ఊరు" సభకుకూడా "ఊరు" అనే పేరు. "ఊరు"నుగూర్చి కల శాసనాధారాలనుబట్టి ఇక్కడి పరిషత్తులో అస్పృశ్యులుతప్ప మిగిలిన వారంతా ఉండేవారని భావించవచ్చును. గ్రామస్థులందరికీ సర్వసాధారణమైన సమస్యలను ఈసభ పరిష్కరించేది. కొన్నికొన్ని వ్యవహారాలు స్వతంత్రంగా పరిష్కరించటమూ, కొంతవరకు న్యాయవిచారణ చెయ్యటమూ "ఊరు" నిర్వహించేది. ఊరు". తీర్పులను అమలు జరపటానికి కార్యాచరణసంఘం ఒకటివేరే ఉండేది. దీనికి "గణం" "ఆళుంగణం" "ఊర్"-ఆళువార్ గళ్, అని నామాంతరాలు, ఉన్నాయి. "ఊరుసలో""తండల్' (పర్యవేక్షకుడు) 'నియాయత్తార్' (న్యాయాధికారి) 'కళాగ్' (నాయకుడు) అని ఉద్యోగులుండేవారు.

10, 11వ శతాబ్దాలనాటి తిరువాన్కూరు శాసనాలు కూడా బ్రహ్మదేయాలకు అనుబంధాలుగాఉండే మహాసభల విధి నిర్వహణ చాకచక్యాన్ని ప్రశంసిస్తున్నాయి. నాడుల పరిషత్తులు నిర్వహించిన కార్యకలాపాలు కూడా వీటితోసమానంగా గుర్తించదగ్గవే. తరై పరిషత్తులకు "తరై కుట్టాలు" అనీ నాడుల పరిషత్తులకు 'నాట్టుకూట్టాలు' అనీ పేర్లు. అంతా

ఇదేవిధంగా కేరళంలోకూడా సర్వత్రా స్థానిక పరిపాలన సాగింది. కేరళం అంతటికీ కలిపి ఒకజాతీయపరిషత్తు ఉండేది. ఇది పన్నెండేండ్లకొకసారిమాత్రమే "మామాంకమ్" ఉత్సవ సమయాన 'తిరునావై'లోసమావేశమయ్యేది. ఈసమావేశంలో నాయర్ జాతివారు అధికంగా పాల్గొని దేశసమస్యలనూ జాతి సమస్యలనూ చర్చించి పరిష్కరించేవారు. "అయిదువందలు" "ఆరువందలు" "అయిదువేలు" సంఖ్యగా సభ్యులుకలనాయర్ సంఘాలు ఉండేవని శాసనాలు చెప్పుతున్నాయి. తప్పకుండా ఈసంఘాలే "నాట్టుకూట్టాలు" అయి ఉండవచ్చును.

సైనికశిక్షణం అత్యవసరమని భావించిన నాయర్లు రాజు సంపూర్ణపర్యవేక్షణక్రింద గ్రామరక్షక దళాలను ఏర్పరిచారు. 'కళరి' (వ్యాయామకళాశాల) కేరళంలో అతిపురాతనమూ సుప్రసిద్ధమూ అయిన సంస్థ. మొట్టమొదట 'కళరి'లో చదువూ చెప్పేవారు, సైనికశిక్షణమూ, ఇచ్చేవారు. నంబూద్రులు ప్రాముఖ్యం సంపాదించినతర్వాత 'కళరి' సైనికశిక్షణాలయాలుగా మాత్రమే పనిచేశాయి. ప్రతియువకుడూ 'కళరి'లో శిక్షణపొందటం అవసరం అని ప్రజలు భావించేవారు. ఇందు వలన ముఖ్యంగా నాయర్లందరూ యుద్ధవీరులైనారు. "పూర్వ కాలపు నాయర్లుచాలామందిస్పార్టావీరులవంటివారు; ప్రభుత్వానికి ప్రేమపాత్రులయిన మహావీరులు" అని ఒకయూరోపియన్ రచయిత ప్రశంసిస్తున్నాడు. సైన్య నిర్వాహణంకోసం "నాడు" కొన్ని "దేశాలు"గా విభజించబడ్డది. ఈదేశాలకూ నాడు

లకూ అధిపతులయిన నాయర్ నాయకులు తమ అధికారంలోని ప్రాంతంలో శాంతిభద్రతలు నెలకొల్పి, రాజుకు అవసరమై నప్పుడు తమవద్దనున్న సేనలను పంపేవారు.

యథార్థానికి నాయర్లు చక్రవర్తికి అవసరమైనప్పుడు తోడ్పడుతూ ఉండే సామంతరాజులే అనవచ్చును. సైనికులుగా పనిచేయటమే కాకుండా ప్రతిగ్రామంలోనూ "కారణవన్లు" (కుటుంబపు పెద్దలు) అండబూ నాయకుని పొలాలలో సేద్యపు పనులు సరిగాజరిగేటట్లు చూచేవారు. ఇందుకుగాను వారికి పంటలో కొంతప్రతిఫలం ముట్టేది. తరైకూట్టాలు, నాట్టుకూట్టాల ద్వారా నాయర్లు రాజు నిరంకుశుడుగా వ్యవహరించకుండా చూచేవారు. ఈసభలకు చాలాఅధికారంఉన్నట్లు కనబడుతుంది. రక్షకభటశాఖా సంబంధంగానూ, న్యాయశాఖా పరిపాలనా శాఖా సంబంధంగానూకూడా వీటికి అధికారాలుండేవి. కేరళో త్పత్తిలో కనబడే వివరాలలాఉండగా, విదేశయాత్రికులు చేసిన ప్రశంసలుఈసభలప్రాభవాతిశయాలను తేటతెల్లంచేస్తున్నాయి.

"గ్రామాధిపతులు" లేక "దేశవాళీలు" అనిపేర్లుగల గ్రామాధికారులకు దేవాలయభూములు సేద్యం చేయించి, రాబడి జాగ్రత్త చెయ్యటం, సైనికసమీకరణం చెయ్యటం, గ్రామస్థులలో కలిగే చిన్నచిన్న తగవులు పరిష్కరించటం మొదలయినవి ముఖ్యవిధులుగా ఉండేవి. గ్రామంలో దేశ వాళీకి ఎటువంటి అధికారమూ, హక్కులూ ఉండేవో "నాడు వాళీ" (నాడు అధిపతి)కి నాడులో అటువంటి అధికారమూ,




1 దేవగిరి
2 ఎలిఫెంట
3 అహమద్ నగరము
4 చక్కరకోట
5 పూరి
6 కళ్యాణి
7 మాల్కెట్టు
8 మాస్కి
9 అయిహొళె
10 పట్టదకల్
11 బాదామి
12 గుల్బర్గా
13 వరంగలు
14 ధాన్యకటకము
15 వేంగి
16 ఏలూరు
17 ద్రాక్షారామము
18 పిఠాపురము
19 విశాఖపట్టణము
20 విజయనగరము
21 రాయచూరు
22 విజయవాడ
23 నందలూరు
24 ద్వారసముద్రము
25 గంగపాడి
26 తలైక్కాడు (తల్లికోట)
27 కంచి
28 గంగయకొండచోడపురం
29 తిరుచినాపల్లి
30 ఉరయూరు
31 తంజావూరు
32 మధుర
33 రామేశ్వరము
34 కోటారు
35 కన్యాకుమారి

క్రీ॥ శ॥ 1100 – దక్షిణ భారత దేశము

హక్కులూ, ఉండేవి. అతను నాడు మొత్తానికి రక్షకభటులు ముఖ్యాధికారీ, న్యాయశాఖాధికారి మాత్రమే కాక ప్రజలనుంచి శిస్తులు వసూలుచేసే ముఖ్య కరగ్రాహిగాకూడా ఉండేవాడు.

ఒక్క వేనాడులోతప్ప మిగిలిన కేరళదేశంలో చాలా వఱకు భూమిశిస్తు ప్రభుత్వాదాయంలో ఒకభాగంగా వుండేది కాదు. ఇది చాలా ముఖ్యమైన విషయం. దీనికికారణం భూమి నంబూద్రుల సొత్తుఅన్న విశ్వాసమే. కాబట్టి రాజులకు ఎగుమతి దిగుమతులమీద పన్నులూ, అపరాధులకు విధించిన జరిమానాలూ మొదలయినవే ఆదాయానికి ఆధారాలుగా ఉండేవి. అత్యవసర సమయాలలో ప్రత్యేకపుపన్నులు విధించటమున్నూ ఉండేది. ఇందువల్ల సహజంగా ప్రజలలో రాజుపట్ల తిరస్కారమూ, రాజు ప్రజలను ఓడించటమూ సంభవించేవి. అయితే రాజుకు మార్గోపదేశకులయిన బ్రాహ్మణులూ, సేనాధిపతులయిన నాయర్లూ, గ్రామసభలు మొదలయినవీ కలుగజేసికొనటంతో పరిస్థితులు అదుపులోకి వచ్చేవి.

మధ్యయుగంనాటి కేరళరాజ్యాంగంలో దేవాలయాలకు (దేవస్వాలకు) చాలా ప్రాముఖ్యం వచ్చింది. సుప్రసిద్ధ దేవస్వాలన్నింటికీ ధర్మకర్తలైన బ్రాహ్మణుల పర్యవేక్షణలో వాటి వాటి ఆస్తి పరిమితులలో సర్వాధికారాలూ వుండేవి. దేవాలయపు ఆవరణంలోపలా, దానికి సంబంధించిన భూముల లోపలా దేవాలయ నిర్వహణ సంఘమే సర్వతంత్ర స్వతంత్ర ప్రభుత్వంగా వ్యవహరించేది. తమ ఆధిపత్యంకల ప్రాంతంలో

తమకు ఎదురుతిరిగినవారినందఱినీ శిక్షించేహక్కు ధర్మకర్త లకు వుండేదని వైక్కం దేవాలయంలోని ప్రాచీన లేఖలను బట్టి విశదమౌతున్నది. దేవాలయ ఆధిపత్యం ఉన్నప్రాంతంలో దౌర్జన్యానికి పూనుకొన్న రాజులుకూడా శిక్షార్హులే.

7, 8వ శతాబ్దాలలోనే దక్షిణభారతంలో స్వపరిపాలనా పరిషత్తులూ, సంఘాలూ ఉన్నట్లు ఇదివఱకే తెలిసికొన్నాము. ఇవి 14వ శతాబ్దంవఱకూ అభివృద్ధిచెందుతూఉన్నట్లు స్పష్ట మైన సాక్ష్యంవున్నది. చేతిపనులవారి సంఘాలూ, వర్తక సంఘాలు ఎంతో బలపడ్డాయి. కాని యీకాలంలో చేతిపనుల వారి సంఘాలు ప్రత్యేకంగా వేర్వేఱు కులసంఘాలుగా మార్పుచెందాయి. సాలెవారూ, తిలకులులూ. (నూనె గానుగ ఆడేవారు) తోట మాలులూ, ఱాళ్లు పగులగొట్టేవారూ, కమసాలులూ, త్రాళ్లుపేనేవారూ, బుట్టలల్లేవారూ, చాప లల్లేవారూ, కలాలీలూ మొదలయిన చేతిపనులవారి సంఘాల ప్రసక్తి శాసనాలలో కనబడుతున్నది. ఈచేతిపనులవారి సంఘాలు పట్టణాలనుంచి చుట్టుపట్టుల పల్లెటూళ్లకు కూడా వ్యాపించాయి. దేవాలయాలకు కానుకలు సమకూర్చటం వంటి సాంఘిక కార్యకలాపాలు కూడా ఇవి నిర్వర్తిస్తూ ఉండేవి.

కాని చేతి పనుల వారి సంఘాల కంటె వర్తక సంఘాలు చాలా కట్టుదిట్టంగా నడిచేవి. నగర పరిపాలనలో ఇవి ఎంతో ప్రాముఖ్యం వహించేవి. వైశ్యజాతిగా పరిగణింపబడే శ్రేష్ఠులే అధిక సంఖ్యలో ఉన్నా ఈ సంఘాలలో సభ్యత్వానికి జాతి

భేదం ఆటంకంగా ఉండేది కాదు. బ్రాహ్మణులూ, ముస్లిములూ కూడా వీటిలో సభ్యులుగా ఉండేవారని తెలుస్తున్నది. దక్షిణ భారతంలోని ఈకాలాన "మణిగ్రామం" 'అయ్యావోల్' అనే రెండురకాల వర్తక సంఘాలు తలెత్తాయి. అవి ఒక్క దక్షిణ భారతం అంతటానే కాకుండా సముద్రంమీద కూడా తూర్పున మలయా, సయాం, సుమాత్రా, బర్మా, సింహళాలతో వ్యాపారం చేసేవి. అయ్యావోల్ సంస్థ కేంద్రస్థానం బీజపూరు జిల్లాలోని ఐహోలు. "నానాదేశియార్" అనేపేరు స్వదేశేతర ప్రాంతాలలో ఈసంఘాలకుకల వ్యాపారసంబంధాలవలన ఏర్పడిందని ఊహించవచ్చును. ఈవర్తకసంఘాలకు కొన్ని నిర్దిష్టవిధులు నిర్వర్తించటానికి "నగరాలు" అనే ప్రత్యేక పరిషత్తులుండేవి. అయితే తమిళదేశంలోని వర్తకసంఘాలతో పోల్చిచూస్తే దక్కనువర్తకసంఘాలకు ఎక్కువ స్వాతంత్రత ఉన్నట్లు కనిపించదు. దీనికి కారణం రాజోద్యోగులు వీటిని అడుగడుగునా తనిఖీలు చేస్తూ వుండటమే.

**సాంఘిక జీవనం:-** ఈకాలంలోని సంఘగమనంలో కొట్టవచ్చినట్లు కనిపించేవి ఉపజాతులు పెరగటమూ, కులపు కట్టుబాట్లు మితిమీరటమూనూ. ఇప్పటినుంచే సైకోలులూ, చెట్టులూ, కమ్మలులూ, రథకారులూ, పట్టినవన్లూవంటి కులాల పేర్లేకాక కుడిచేతికులాలూ, ఎడమచేతికులాలూ అనే విడ్డూరపు విభాగాలు కూడా వినబడుతూ వచ్చాయి. కులాలలో ఇటువంటి రెండుప్రధానవిభాగాలు ఒకటవరాజేంద్రుని కాలంలో

ప్రప్రథమంగా బయలుదేరాయి. మూడవకులోత్తుంగుడు సాంఘిక వివాదాలను చక్కబఱచటానికి యత్నించినట్లు శాసనాలలో కనబడుతున్నది. ఈకాలంనాటి 'చోళన్ పూర్వపట్టినమ్' అనే గ్రంథం (అముద్రితం) రాజు చేసిన మార్పులను చక్కగా విశదీకరిస్తున్నది. ఇది కాంచీపురంలో లభించిన ఒక చోళరాజ తామ్రశాసనంలోని విషయాలనే ఉల్లేఖిస్తూ సామ్రాజ్యంలోని కొన్నిప్రాంతాలలో సంఘమూ, ప్రభుత్వమూ ఎలా నడిచిందీ వర్ణిస్తున్నది. ఈశాసనం వెల్లాలులూ, కైకోలులూ, చెట్టులూ అనే మూడుకులాలనే పేర్కొన్నది. జనసంఖ్య అత్యధికంగా ఉన్న ప్రాంతాలనుంచి ఈమూడుకులాలవారినీ రాజు కాంచీపురానికి రప్పించినట్లుగూడా చెప్పుతున్నది. ఈశాసననిర్మాత మూడవకులోత్తుంగుడే అని చెప్పవచ్చును. "పూర్వపట్టెయం" అనే గ్రంథం 'కస్తూరిరంగచెట్టి' 'వెణ్ణై నల్లూర్ సడెయప్పముదలి' అనే యిద్దఱునాయకులను పేర్కొంటున్నది. వీరికిద్దరికీ మూడవకులోత్తుంగచోడునితో సాన్నిహిత్యం ఉన్నట్లు ఇతరశాసనాలవల్ల తెలుస్తున్నది. 'కరూరు' 'పేరూరు' 'మోచకూ'ర్లలో ఒక శాసనంప్రతులు లభించాయి. కమ్మాలూర్లకు మహారాజు ప్రసాదించదలచిన కొన్ని హక్కులు ఈశాసనం పేర్కొంటున్నది. ఆశాసనం లిఖితమైన నాటినుంచీ కమ్మాలూర్ల యిండ్లలో తటస్థించే శుభాశుభకార్యాలు (పెండ్లి, చావులు) రెంటికిన్నీ జంటబాకాలు ఊదవచ్చుననీ, మద్దెల మ్రోగించవచ్చుననీ, పాదుకలు ధరించవచ్చుననీ, ఇంటిగోడలకు వెల్లవేసికోవచ్చుననీ ప్రభువు అనుమతించినట్లున్నది.

ఈకాలంనుంచీ 'ముదలియార్' అని ప్రసిద్ధి కెక్కిన వెల్లాలకులంపేరు విశదంగా కనబడుతున్నది. భవానికుడాల్లో దొరికిన క్రీ. శ. 1010 వ సంవత్సరంప్రాంతపు శాసనాలలో ఈ కులంపేరు తొలిసారిగా కనిపించింది. కాని మూడవ కులోత్తుంగుని కాలంనుంచీ ఈకులానికి ప్రాముఖ్యం హెచ్చినట్లు గోచరిస్తుంది. ఇటుతర్వాతకాలంలో పాండ్య-చోళరాజ్యాలు రెంటిలోను ముదలియార్లు మంత్రులేగాక పరిపాలకులుగాకూడా ఉంటూ వచ్చారు. మూడవజటావర్మపాండ్యుని కాలంనాటి "తారామంగళం" ముదలియార్లూ, నాంజిల్‌నాడులోని "అరుకియపాండ్యపుర" నివాసి అయిన పెరియపీట్టు ముదలియారూ ఇందుకు ఉదాహరణాలుగా చెప్పదగినవారు. కొంగు దేశంలో వొడ్డకూ, వేల్లాలర్లకూ కలిగిన తగవులాటను ఒక చోళరాజు పరిష్కరించాడు. 9వశతాబ్దంమధ్య కొంగుదేశాన్ని జయించిన ఒకటవ ఆదిత్య-చోళునికాలంలో ఇది తటస్థించి ఉంటుందని రూఢిగా చెప్పవచ్చును. "కొంగు"లో వెల్లాలు స్థిరపడటమూ, దానివెంటనే తటస్థించిన సాంఘికనియమనిబంధనలూ గురించి చెప్పే పూర్వకథలు వృత్తులు ఆధారంగా ఉపజాతులు ఎలాఏర్పడ్డాయో తేటతెల్లంచేస్తాయి. కోయంబత్తూరు జిల్లాలో ఇప్పటికీచెప్పుకొనే పూర్వకథ ఒకటి అక్కడ చిరకాలంగా నివసిస్తున్న వొడ్డకున్నూ, క్రొత్తగా అడుగుపెట్టిన వెల్లాలులకున్నూ ఆనాడు కలిగిన సంఘర్షణను గురించిచెప్పుతున్నది. మొట్టమొదటిలో ఈప్రాంతానికి పాలకులైన గాంగ

రాజులు తమ రాచఱికాన్ని బలపఱచుకొనటానికి చాలామంది. వొడ్డారు జాతివారినిఇక్కడికిరప్పించి స్థిరనివాసాలు కల్పించారు. అటుతర్వాతవచ్చిన వెల్లాల కుటుంబాలకు తమమంగళ్ళు నౌకరి చేయటానికి వొడ్డర్లు అనుమతించనందున వెల్లాలులు తమలో నుంచే మంగలి, చాకలి, కలాలి డోలువాయించటం అనే వృత్తులకు కొన్ని కుటుంబాలను ప్రత్యేకించుకొన్నారు. ఆవిధంగా వెల్లాల, మంగలి, చాకలి, చెట్టి, పెరయ అని పంచ జాతులు క్రొత్తగా ఏర్పడ్డాయి. దక్షిణభారతంఅంతటా ఇదేపద్ధతిని ఉపజాతులు ఏర్పడకపోయినా ఏదోవిధంగా ఏర్పడిఉంటాయని ఊహించవచ్చును.

ఉపజాతుల విస్తరణమూ కులాలమధ్య అడ్డుగోడలూ చోళచక్రవర్తుల కాలంనుంచే ప్రారంభమైనాయి. వృత్తులేగాక, కులపుకట్టుబాట్లూ, నిత్యజీవితవిధానాలు, ఆయాకులాల ప్రతినిధివర్గాలను సమావేశపఱచి నిర్ణయించటం జరిగింది. పంక్తి భోజనాలలో కేటాయింపులూ దేవాలయంలోపలికి ఏకులంవారు ఎంతవరకు వెళ్ళవచ్చుననేదీ, సంఘసమావేశాలలో ఏకులానికి ఏస్థానం ఇయ్యవచ్చుననేదీ మొదలయిన వాటిలో స్పష్టమయిన నిర్ణయాలుజరిగాయి. కొన్నిజాతులలోహక్కులూ,సౌకర్యాలు మొదలయిన వాటినిగురించి తగాదాలు అప్పుడప్పుడు బయలు దేరినా, ప్రతికులంవారున్నూ కులపుపెద్దల నిర్ణయాలకు కట్టుబడి ఉండేవారు. సంఘవ్యవస్థకు ప్రాతిపదికంగావున్న కులాన్ని బట్టే జీవనోపాధిన్ని జరిగిపోయేది.

తక్కువజాతులస్థితి శాశ్వతంగా అధోగతి పాలైనదనే విషయంకాదనరానిది. వారు తమతమ వృత్తులనే అంటిపెట్టుకొనే ఉండేవారన్నమాట యథార్థమే అయినా, దీనినిబట్టి వారి జీవితం సుఖవంతంగావున్నదని చెప్పటానికి ఆధారంలేదు. విద్యాగంధమేలేకుండా, సుఖశాంతులకు దూరమైపోయి, నీచవృత్తులపాలై, సంఘంలో గౌరవం అసలే పూజ్యమై అతి కష్టంతో బ్రతుకులు తెల్లవార్చుకొనేవారు. చాలామంది తక్కువజాతులవారు భూస్వాములకు పాలేరుతనం చేసేవారు. వీరికీ బానిసలకూ ఎక్కువ తేడాలేదు. అస్పృశ్యత పరాకాష్ఠ పొందింది. సంఘమనే నిచ్చెనలో అట్టడుగుమెట్టునవుండే పెరయలు కొన్నికొన్ని కులాల యిండ్లలోని శుభాశుభకార్యాలలో భేరీవాద్యానికికూడా పనికివచ్చేవారుకారు. ఇందువల్ల బయలుదేరే తగవులను రాజోద్యోగులు పరిష్కరించేవారు. గంగయ్య అనే రాజోద్యోగి ఇటువంటి ఒకతగవు పరిష్కరిస్తూ ఏయింటిలోనైనా జరిగే శుభాశుభకార్యాలన్నింటికిన్నీ ఒక "పడక్కు"ధాన్యమూ, ఒకకోడీ ప్రతిఫలంగా తీసికొని పెరయ మాత్రమే డోలువాయించాలని తీర్పుచెప్పాడు. రామనాథపురంలో ఈతీర్పు లిఖితరూపాన సుస్థిరమైంది. దీనినిబట్టి తరచు బయలుదేరుతూవుండే సాంఘిక వివాదాలను రాజోద్యోగులు పరిష్కరిస్తూవుండేవారని గ్రహించవచ్చును. కొంగునాడులో వెల్లాలులయిండ్లలో వృత్తిచేసే పెరయులను అదేకులంలోని పెరయలకంటె వేఱుగాచూస్తూ "కొంగుపెరయ"లని వారిని

ప్రత్యేకించారు. కొంగుపెరయులు ఇప్పటికిన్నీ ఉన్నారు. తండ్రికి అంత్యక్రియలు చేయటానికి పెద్దకుమారుడే అర్హుడైనట్లు, వెల్లాలుల ఇండ్లలో చనిపోయినవారికి అంత్యక్రియలు జరపటానికి ఈ కొంగుపెరయులే అర్హులు. వెల్లాలచెట్టి, వెల్లాలనాడార్, వెల్లాలచండాల ఇత్యాది జాతుల ఉత్పత్తినిబట్టి ఉపజాతులనేవి ఎలా పెరిగిందీ యిదివరకే గమనించాము. వెల్లాలులలో వర్తకమవలంబించిన శాఖ వెల్లాలచెట్టి అనే జాతిగానూ, కల్లుగీసే కుటుంబాలు వెల్లాలనాడార్ అనే జాతిగానూ, చండాలురలో నుంచి వెల్లాలులలో కలసిన కుటుంబాలు వెల్లాల చండాలజాతిగానూ ఏర్పడటం జరిగింది. ఈవిభేదాలు తలయెత్తిన కొద్దికాలంలోనే ఉపజాతులమధ్యకూడా పరస్పరసంబంధ బాంధవ్యాలకు అవకాశంలేని తీవ్రమైన పట్టింపులు బయలుదేరాయి.

సంఘుసౌకర్యాలకోసమున్నూ, అంతకంటెకూడా తాత్కాలిక పరిస్థితుల పరిష్కారంకోసమున్నూ ఏర్పడ్డవర్ణవ్యవస్థ అచిరకాలంలోనే ప్రజలు అనేక విభాగాలుగా చీలిపోవటానికి కారణమైనది. జాతులలోనూ, ఉపజాతులలోనూ ఆధిక్యంకోసం పుట్టిన పెనగులాటలు తీవ్రమై నిర్విరామంగా సాగుతూ వచ్చాయి. ఒక్కొక్క కులమున్నూ తన ఆధిక్యం నిర్వివాదం చేసికొనటానికి, పురాణప్రమాణం సాధించటానికి ప్రయత్నాలు సాగించింది. తక్కువజాతులవారు తమకు బ్రాహ్మణులతోగానీ, క్షత్రియులతోగానీ పురాతనబాంధవ్యం వున్నట్లు నిరూపించుకొని తద్వారా సంఘులో ఆధిక్యం తెచ్చుకొనటా

నికి యత్నించారు. ఇడంగై తెగలవారు తాము అగ్నికుండం లోనుంచి యుత్పత్తి అయినవారి సంతతివారమని ఒక పురాణ గాథ తీసికొనివచ్చారు. ఈపురాణగాథ ఉత్పత్తికి సంబంధించిన ప్రసక్తి మూడవ కులోత్తుంగుని కాలంనాటి ఒక శిలాశాసనంలో కనబడుతున్నది. ఇడంగైలకు ప్రత్యేకంగా ఈకాలంలో కొమ్ముబాకా, ఊదే హక్కులు ఇవ్వటం జరిగింది. ఇలా వర్ణవ్యవస్థలో తీవ్రమైన కట్టుబాట్లూ భిన్నజాతులమధ్య వైషమ్యమూ పెచ్చు పెరగటానికి ఇది నాంది అయింది.

దీనితోబాటు శోచనీయమైనది స్త్రీలకు సంఘంలోగల గౌరవానికి పతనం కలగటం. వారు కేవలం ఇంటిలోనే కాలం గడపవలసినవారైనారు. అగ్రకులాలలోని స్త్రీలు అరుదుగా మాత్రమే గడపదాటేవారు. దేవాలయంలో భగవత్సందర్శనం చెయ్యటానికిగానీ, ఉత్సవాలు మొదలైనవి చూడటానికిగానీ ఎప్పుడైనా బయటికి వచ్చేవారు. నడిమి తరగతి కుటుంబాలలో స్త్రీలకు ఇంతకన్న కొంచెం స్వాతంత్ర్యం ఉండేది. అయితే వారైనా తమ వీధిదాటి అవతలికి సాధారణంగా వెళ్ళేవారుకారు. తక్కువజాతులలో తప్పితే తక్కిన కులాలలో బాల్యవివాహాలు చెయ్యటం ఇప్పటినుంచే పరిపాటి అయింది. వితంతువులు కఠిన నిర్బంధాలకు గురిఅయినారు. ప్రాచీనకాలంలోకంటె కొంతవరకు తగ్గినా "సతి" నియమం ఈ కాలానికిన్నీ సాధారణంగా ఆచారంలో ఉండేది. ఈ కాలంలో జరిగిన సతీసహగమనాలు కొన్ని చరిత్రకెక్కాయి.

సుందర చోళుని (956-73) రాణి వానవన్ మహాదేవి పతితో సహగమనం చెయ్యటం సుప్రసిద్ధమైనది. 13 వ శతాబ్దం చివర వెన్నీసు నగరం నుంచి ఈ దేశానికి వచ్చిన మార్కోపోలో అనే యాత్రికుడు "సతి" అప్పటికిన్నీ ప్రబలంగా ఉన్నట్లు వ్రాశాడు,

7 వ శతాబ్దం ప్రాంతాన తమిళనాడులో దేవదాసీ పద్ధతి తలయెత్తింది. ఒకటవ రాజరాజ చోళుడు దేవాలయ నిర్వహణలో దేవదాసీ పద్ధతికూడా అత్యవసరమని భావించి ఆ ఆచారాన్ని స్థిరపరిచాడు. ఇదే కాలంలో దక్కను లోని దేవాలయాలలో గూడా దేవదాసీ నియామకం జరిగింది. యథార్థానికి దక్షిణ భారతం అంతటా దేవాలయంలోని స్వామి పరివారంలో దేవదాసీ జనం కూడా ముఖ్యాంగమైనది. ఈ దేవదాసీ వృత్తి చేపట్టిన స్త్రీలు నృత్య సంగీత కళలలో ఆటితేరి, భగవద్భక్తికీ, పవిత్రతకూ ప్రసిద్ధి గాంచి ఉండేవారు. కొందరు మాత్రం రాజునో ఏ ప్రభుత్వోద్యోగినో చేపట్టేవారు. తర్వాత దేవదాసీజాతి అంతా ఈ క్రొత్త వృత్తికి అలవాటు పడ్డది.

దక్షిణభారత చరిత్రలో మధ్యయుగంలో దేవాలయం చాలా ముఖ్యమైన సంస్థగా ఉండేది. ప్రజల మతంలోగానీ సాంఘిక ఆర్థిక పరిస్థితులలోగానీ, సంస్కృతీ సంబంధమైన విషయాలలో గానీ, చివరకు రాజకీయ జీవితంలో గానీ దేవాలయాల ప్రాధాన్యమే హెచ్చు. బ్రాహ్మణులే గాక తక్కిన

జాతులవారు కూడా అనేక విధాల దేవాలయంతో సంబంధం పెట్టుకొనేవారు. స్థానిక భూస్వాములలో దేవుడే ప్రధాన భూస్వామి. దేవాలయంలో ఎందఱో నౌకర్లుఉండేవారు. వెచ్చాలు మొదలుగా సమస్త వస్తువులూ కొనటమూ, బీదలకు సంతర్పణలూ, వివిధ దానాలూ చెయ్యటంలో ధర్మకర్తృత్వం వహించటమూ మొదలయిన పనుల వల్ల ప్రజల ఆర్థిక జీవితంలో కూడా దేవాలయం ప్రాబల్యం వహించింది. తంజావూరులోని దేవాలయంలో రకరకాల నౌకరీల కోసం 609 మంది పఱకూ కూడానియమితులై ఉండినట్లు ఒకటవ రాజరాజు శాసనాలవల్ల తెలుస్తున్నది. కోలారు జిల్లాలోని అదే కాలంనాటి ఒక శాసనం అక్కడి ఒక దేవాలయంలో 52 కుటుంబాలవారు నౌకరీచేసి జీవిస్తున్నట్లు తెలుపు తున్నది. ఇంతేకాక ఆ దేవాలయం సంగీతం, నాట్యం, శిల్పం, చిత్రలేఖనం, వర్ణచిత్రకల్పన, అనే ప్రాచీన కళలను సజీవంగా నిలిపింది. దేవాలయాలలో వేద శాస్త్రాలే గాక తేవరం, తిరుప్పదియం, తిరుప్పలాండు, తిరువాయ్‌మ్మొళి వంటి భక్తి ప్రధాన రచనలు కూడా పఠిస్తూ ఉండటం ఇప్పటినుంచే ప్రారంభ మైనది. వేదాలలో, పురాణాలలో ఇతిహాసాలలో అత్యధిక పాండిత్యం సంపాదించ గోరే వారికి దక్షిణభారతంలోని అనేక దేవాలయాలూ, మఠాలూ తగిన ప్రోత్సాహమూ, సౌకర్యాలూ కలుగ జేసేవి. అయితే ఈ సాహాయ్య సంపత్తి ముఖ్యంగా అర్చక జాతికే జరుగుతూ వచ్చేది. కాని యితరులకు కూడా అవకాశాలు కల్పించటం లేక పోలేదు.

కేరళంలో దేవాలయాలమీద నంబూద్రుల ఆధిపత్యమూ, తద్వారా ప్రజల సాంఘికరాజకీయజీవితాల మీద కూడా ప్రాబల్యం వహించటమూ 11 వ శతాబ్దంలో పరిపూర్తి అయింది. ఇంతవఱకున్నూ నాయర్లు సైనికోద్యోగులుగానే ఉంటూ ఉన్నారు. నంబూద్రుల మాదిరిగానే నాయర్లు కూడా బలవంతులైన భూస్వాములు. దక్షిణభారతంలో తక్కిన దేశాలలోకంటె కేరళంలో కులపు కట్టుబాట్లు మఱీ బిగువుగా ఉండేవి. అయితే తమిళనాడులోఉన్నట్లుగా కేరళంలో శూద్రుల మధ్య ఎక్కువ ఉపజాతులు పుట్టలేదు. వృత్తిప్రాతిపదికంగా ఏర్పడ్డ వడ్రంగులూ, సాలెలూ వంటి కులాలుమాత్రమే ఉండేవి సింహాళంతో చోళులకు సంబంధం ఏర్పడ్డతర్వాత సింహాళం నుంచి 10 వ శతాబ్దంప్రాంతంలో కేరళానికి వచ్చినవారే 'ఇఝూవా' ర్లని ప్రతీతి, కాని తమిళగ్రంథాలుమాత్రం ఇఝూవార్లు కేరళానికి 10వ శతాబ్దంకంటె ఇంకా ఎంతోముందు వచ్చినట్లు చెప్తున్నాయి. ప్రధానవృత్తి కల్లుగీత కావటం చేత సంఘంలో వీరికి తక్కువజాతిగా పరిగణన వచ్చింది. 'తివార్' అనే పేర వీరు అస్పృశ్యజాతిగా ఉండేవారు. కాని పెరయలూ పులయలూ, చెరుమలూ అనే అంత్యజాతులవారిస్థితి ఇంతకన్న కూడా శోచనీయం. వీరికి సంఘంలో ఒక్కహక్కుగానీ, ఒక్క సదుపాయంగానీ లేదు. వెనుక గమనించినట్లుగా కేరళచరిత్రలో ఇది ముఖ్యంగా గుర్తించవలసిన విషయం. తల్లికే ఆ స్త్రీమీద ఆధిపత్యం ఉండటం కేరళసంఘవ్యవస్థలో మఱొక ముఖ

విశేషం. అయితే కేరళంలోని ఈఅసాధారణాచారం ఎప్పుడు ఏవిధంగా ఏర్పడ్డదీ, లేక ఎక్కడనుంచి దిగుమతి అయిందీ అనే ప్రశ్నలకు అనేకులు అనేకవిధాల అభిప్రాయాలు తెలుపుతున్నారు. కొంతమందినాయర్లు ఈ దేశంలోని పూర్వీకుల సంతతి వారే అనీ, కుటుంబయాజమాన్యం తల్లిదే అయి ఉండటం పురాతనమైన సంప్రదాయమే అనీ భావిస్తున్నారు. దేవతాస్త్రీలను పూజించటం సాధారణాచారంగా ఉండే సింధులోయ నాగరకతాకర్తలకున్నూ సంబంధం ఉన్నట్లు నిరూపించటానికి కొంతమంది ప్రయత్నిస్తున్నారు. ఇంకా కొంతమంది మధ్యధరాప్రాంతంనుంచి వచ్చి హిందూదేశపశ్చిమతీరాన వలస లేర్పఱచుకొన్నవారి తాలూకువారే కేరళానికి వచ్చిఉంటారనీ నైరీలనే ప్రాచీన కేరళవాసులు వారే అనీ మధ్యధరా ప్రాంతంలో తల్లికే కుటుంబాధిపత్యం ఉండేదనీ, ఆ ఆచారం నైరీలద్వారా కేరళానికి దిగుమతి అయిఉంటుందనీ భావిస్తున్నారు. మఱికొందఱు తల్లిదే ఇంటిపెద్దఱికం కావటం కేరళంలోని ప్రాచీనజాతులలో కనబడుతూ ఉండటంవల్ల మొట్టమొదట 'నాగులు' అను జాతివారే యిటీవల నాయర్లు అయినారనీ, వీరు మొదట మంచినాగరకతకలవారై ఉండి, తర్వాత తర్వాత పరిస్థితుల ప్రాబల్యం వల్ల ఈఆచారాన్ని అవలంబించి ఉంటారనీ అభిప్రాయపడుతున్నారు. ఇంటిలోని పెద్దకుమారుడు మాత్రమే స్వజాతిస్త్రీని వివాహం చేసికోవచ్చుననే వింత ఆచారంకల నంబూద్రులతో నాయర్లకు గల సాహచర్యంవల్ల

నంబూద్రులు నాయరుస్త్రీలను వివాహం చేసికొనటమనే ఆచారం పుట్టింది. అయితే ఈనాయరుస్త్రీలు భర్తలతో అత్త వారియింట్లకు వెళ్ళటానికి వీలులేకపోయినందువల్ల, తమకు తామే ఇంటిపెద్దలు కావలసి వచ్చింది. ఈవిధంగా నాయర్లలో కుటుంబయాజమాన్యం తల్లిదే కావటం తప్పనిసరి అయింది. తరువాత ఈఝనర్లూ, చెరుమలూ వంటి ఇతరులు కూడా నాయర్ల ఈఆచారాన్ని అనుకరించారు.

## సారస్వతం

సంస్కృతము:- దక్షిణభారతం అంతటా కూడా మఠాలలో గాని, ఘటికాలలో గానీ, రాజాస్థానాలలో గానీ సంస్కృతాన్ని అభిమానిస్తూ వచ్చారు. ఈయుగంలో వెలు వడిన వాఙ్మయం గణించదగ్గదే. నాటకాలల్లో ఒకటవ కులశేఖ రుడు (935 – 55) అనే కేంళరాజురచించిన 'తపతీసంవరణం' 'సుభద్రాధనంజయం' అనేవి చెప్పకోదగినవి. 13 వ శతాబ్దం చివరికాలంలో ఓరుగల్లు ప్రభువైన ప్రతాపరుద్రుని ఆశ్రితు డైన విద్యానాథుడు తనప్రభువుకీర్తిని ప్రధానలక్ష్యంగా చేసికొని 'ప్రతాపరుద్రయశోభూషణం' అనే గ్రంథాన్ని రచించాడు. సరిగా ఇదే లక్ష్యంతో కళింగరాజైన రెండవనరసింహుని ఆశ్రి తుడైన విద్యాధరుడు 'ఏకావళి' రచించాడు. వీటినిగురించి నిజం చెప్పాలంటే సాహిత్యపు మెఱుగు అంతగా లేనివి అని చెప్పాలి. కొంత అపరిపక్వతా కొంత కృత్రిమతా వీటి విలువ

తగ్గటానికి కారణాలు. ఈయుగంలో అనేక భక్తిప్రధానాలైన గీతాలేకాక నూతనపద్ధతిలో బయలుదేరిన కావ్యాలు కూడా సుప్రసిద్ధాలైనాయి. అవి శ్లేషప్రధానాలైనవి. తృతీయసోమేశ్వరుని ఆస్థానకవి విద్యామాధవుడు 'పార్వతీరుక్మిణీయం' అనే ద్వ్యర్థికావ్యాన్ని రచించాడు. ఇది ఒక అర్థంలో పార్వతీపరమేశ్వరకల్యాణాన్ని, రెండవ అర్థంలో రుక్మిణీకృష్ణుల కల్యాణాన్ని వర్ణిస్తున్నది. కన్నదేవుని (1182 – 97) ఆస్థానకవి మాధవభట్టు 'రాఘవపాండవీయం' ఇలాగే ద్వ్యర్థికావ్యంగా రచించాడు. ఇది రామాయణమహాభారతకథలు రెండూ అర్థభేదంతో వివరిస్తున్నది. ఈరెండుద్వ్యర్థికావ్యాలూ సారస్వతదృష్ట్యా విలువగలవే అయినా ఉత్పాద్యాలుమాత్రం కావు.

పద్య గద్యాత్మకమైన చంపూ కావ్యం ఇదే యుగంలో బయలుదేరింది. రాష్ట్రకూట రాజైన మూడవ ఇంద్రుని సమకాలికుడు త్రివిక్రమ కవి 10 వ శతాబ్దంలోనే నల దమయంతుల ప్రసిద్ధ కథ ఇతివృత్తంగా "నలచంపువు" రచించాడు. ఈ కావ్యంలోని పద్య శైలి ఎక్కువ ఆకర్షణీయం కాక పోయినా నవీన పద్ధతిలో బయలు దేరినది కాబట్టి ఇంపుగానే ఉంటుంది. రాష్ట్రకూట రాజైన మూడవ ఇంద్రుని సామంత రాజు ప్రోత్సాహంతో సోమదేవసూరి అనే జైన కవి కూడా ఒక చంపువు రచించాడు. ఈ కావ్యంపేరు "యశోతిలక చంపువు" దీనిలో కవి అవంతిలోని యశోధర చరిత్ర వర్ణిస్తూ అనేక జైన సిద్ధాంతాలను కూడా నిపుణతతో ప్రవేశ పెట్టాడు. 11 వ

శతాబ్దంలోని బిల్హణుని "విక్రమాంక చరిత్ర" ఈ యుగంలో బయలు దేఱిన చరిత్రోపయుక్త రచనలలో చెప్పదగినది. ఇది చాళుక్యరాజైన ఆఱవ విక్రమాదిత్యుని జీవితాన్నీ అతని విజయ పరంపరలను విశదంగా వర్ణించే 18 సర్గాల కావ్యం. ఈ కవి శైలి లలితంగానూ ఆకర్షణీయంగానూ ఉంటుంది, అయితే తఱచుగా సుదీర్ఘ వర్ణనలు ఉండటంచేత కథాగమనానికి కొంత అవరోధం కలుగుతూ ఉంటుంది. అంతేగాక కథానాయకుని పట్ల ఉన్న అభిమానంచేత కవి చరిత్ర చెప్పటంలో కొంత పక్షపాతం కూడా వహించాడు.

చాళుక్య దేశంలో రెండు సంగీతశాస్త్ర గ్రంథాలు బయలుదేఱినాయి. పశ్చిమచాళుక్యరాజు జగదేక మల్లుడు (1138 — 50) 'సంగీతచూడామణి' రచించాడు. 'హరపాల దేవుడు' అనే ఒక చాళుక్యరాజవంశస్థుడు నృత్యసంగీతకళలు రెండూ వివరించే 'సంగీతసుధాకరం' రచించాడు. అయితే ఇతని చరిత్ర మన కేమీ తెలియదు.

రాజనీతిసంబంధమైనవాఙ్మయాన్ని చాళుక్యులు ఎంతో అభివృద్ధి చేశారు. ఆఱవ విక్రమాదిత్యుని ఆస్థానపండితుడు యాజ్ఞవల్క్య స్మృతికి 'మితాక్షర' అనే ప్రసిద్ధ వ్యాఖ్యాన గ్రంథాన్ని రచించాడు. దక్షిణభారతంలోనేకాక, ఉత్తరభారతంలో అనేకప్రాంతాలలో కూడా న్యాయవిచారణలో ఇది ఒక ప్రమాణగ్రంథంగా ఉన్నది. విజ్ఞానేశ్వరుని శిష్యుడు నారాయణుడు 'వ్యవహారశిరోమణి' కర్త. ఈవ్యవహారశిరోమణి

రాజ్యాంగవిధానంమీద స్వతంత్రమైన రచన. అయితే ఇది సమగ్రంగా ఎక్కడా లభించటం లేదు. కొద్దిభాగం మాత్రమే లభ్యమైనది. 12 వ శతాబ్దంప్రారంభంలో కొంకణంలోని సిల్హారాకు అధిపతి అయిన ఒకటవ అపరాదిత్యుడు కూడా యాజ్ఞవల్క్యస్మృతిని సమీక్షించాడు. ఇతను చాలావఱకు చొరవ చేసి ఇందులో స్వతంత్రమైన అభిప్రాయాలు కొన్ని ప్రకటించాడు. ఇదేకాలంలో ప్రభుత్వపద్ధతిక మీమాంసాసిద్ధాంతాలు కూడా సమన్వయించి వరదరాజు రచించిన 'వ్యవహార నిర్ణయం' అనేగ్రంథం బయలుపడ్డది. ఈ యుగంనాటి మఱొక ప్రసిద్ధన్యాయగ్రంథం స్మృతిచంద్రిక. ఇది న్యాయశాస్త్ర విషయాల నన్నిటినీ సంక్షిప్తంగా పరామర్శిస్తున్నది. ఇక నిఘంటు రచనా విషయంలోకూడా కొంతప్రయత్నం జరిగింది. 12వ శతాబ్దమధ్యలో కర్ణాటక దేశస్థుడైన ధనంజయుడు 'నామమాల' అనేపేర ఒకనిఘంటువు శ్లోకరూపాన రచించాడు, దీనిలో సుమారురెండు వందలశ్లోకా లున్నాయి. ఇతను ఏకార్థంకల పర్యాయ పదాలన్నీ ఇందులో సంగ్రహించటం జరిగింది.

ఈయుగంలో విరివిగా బయలుదేఱినవి ఆధ్యాత్మిక గ్రంథాలు. ద్వైతాద్వైతవిశిష్టాద్వైతమతాలు మూడింటిలోనూ నిష్ణాతులయిన వ్యాఖ్యాతలు బయలుదేరారు. శంకరుడు, రామానుజుడు, మాధవుడు అనే ఆచార్యత్రయం ఆధ్యాత్మికరంగంలో చేసినకృషి మనము ఇదివఱకే గమనించాము. వేదాలకూ, ఉపనిషత్తులకూవీరు రచించిన భాష్యాలపైన

ఉన్నతశ్రేణిలో అనేకవ్యాఖ్యానాలు సంస్కృతభాషలో ఉద యించాయి.

తత్త్వమార్గాలమీద ఇంకా రచనలుచేసినవారిలో వరద రాజుఒకడు. ఈయన దక్షిణభారతంలో న్యాయశాస్త్రం రచిం చినవారిలో ప్రప్రథముడనీ 12 వ శతాబ్దంనాటివాడనీ మనము ఇదివఱకే తెలిసికొన్నాము. ఈయన "తార్కికరక్ష" అనే మఱొక గ్రంథాన్నీ, ఉదయనుని 'కుసుమాంజలి' కి వ్యాఖ్యాన గ్రంథాన్నీ రచించాడు. ఈసమయంలోనే అపరకరుడు భాసరా వజ్ఞుని "న్యాయసారం" అనే గ్రంథానికీ, యాజ్ఞవల్క్యస్మృతికీ చక్కని వ్యాఖ్యానాలు చేశాడు. పూర్వమీమాంసాశాస్త్రజ్ఞ లైన రచయితలు కూడా వారి ఆధ్యాత్మికదృష్టిని వివరిస్తూ సంస్కృతంలో కొన్ని గ్రంథాలు రచించారు. ఈవిధంగా 19వ శతాబ్దం మొదలుకొని 14 వ శతాబ్దం వఱకూ నాటక, భక్తిగీత చారిత్రిక, కవితా, ధర్మశాస్త్రశాఖలన్నింటిలోను సంస్కృత వాఙ్మయాభివృద్ధికి దక్షిణభారతం చాలాకృషిచేసింది. అద్వైతం ద్వైతం, విశిష్టాద్వైతం అనే త్రిమతాలవారూ రచించిన ఆధ్యాత్మిక గ్రంథాలు ఈనాటి సంస్కృతవాఙ్మయంలో అతి ముఖ్యమైనవి.

**తమిళం:-** తమిళవాఙ్మయం చోళచక్రవర్తులకాలంలో చాలా ఉచ్చస్థితి అందుకొన్నది. రాజులు తమిళాన్ని బాగా అభిమానించారు. సారస్వతకృషికి రాజాస్థానాలు కేంద్రాలుగా ఉండేవి. ప్రభుత్వం శక్తిమంతమై, ప్రజలు సిరిసంపదలతో తుల

దూగుతూ, భక్తిఉద్యమంప్రభావంవల్ల గాఢమైన మతాభిమానం కూడా కలసి రావటంచేత సారస్వత విషయంలో అమోఘమైన కృషి జరగటానికి అవకాశం కలిగింది.

ఈయుగంలో వెలువడిన సాహిత్యంలో మతప్రధానాలైన ఇతిహాసాలూ, పురాణాలూ ముందుచెప్పదగినవి. 10 వ శతాబ్దం ప్రారంభంలో 'జీవకచింతామణి' అనే ఇతిహాసం ఉదయించింది. ఇది తమిళసాహిత్యంలో ప్రసిద్ధికెక్కిన పంచకావ్యాలలో ఒకటి. జైనులు శృంగారరసప్రధానమైన కవిత్వం చెప్పగలరా అనే ప్రశ్నకు సమాధానంగా 'తిరుత్తక్కదేవర్' అనే జైనభక్తుడు దీనిని శృంగారమయంగా రచించాడని ప్రసిద్ధి. ఏది ధ్యేమైనా కవి తన లక్ష్యసాధనలో కృతకృత్యుడైనాడు. ఈ కావ్యంలోని కథానాయకుడు వట్టి రసికుడు మాత్రమే గాక గొప్ప జైనభక్తుడు కూడా. ఈగ్రంథకర్తమాత్రం కావటానికి గృహస్థుడే అయినా పరివ్రాజకత్వాన్నే వరించి అందుకు తగినట్లుగా జీవించికూడా ఇటువంటి కావ్యం రచించటం సాధారణ విషయం కాదు. ఇతని శైలి అలంకారభూయిష్ఠంగా ఉన్నా చాలా చక్కగా ఉంటుంది. ఇతని యీరచన కవులలో నూతనోత్సాహాన్ని రగుల్కొల్పి, కంబన్ వంటి మహాకవికి ఆదర్శకావ్య మైనదని ప్రసిద్ధి.

తమిళ సాహిత్య చరిత్రలో 12 వ శతాబ్దం చాలా ప్రాముఖ్యం వహించింది. సుప్రసిద్ధుడైన కంబమహాకవి ఈ శతాబ్దంవాడే. ఇతని రామాయణం మూలానికి మక్కికి మక్కీ

అనువాదం కాకపోగా, స్వతంత్రప్రతిభకూ, శిల్పసౌందర్యానికీ వన్నెకెక్కింది. ఇన్నివందల సంవత్సరాలనుంచీ తమిళదేశంలోని ప్రతి నగరంలోనూ, ప్రతి గ్రామంలోనూ కంబరామాయణం నిత్యమూ, వింటూ ఉన్నారంటే ఆశ్చర్యం లేదు. 14 వ శతాబ్దంఅంత్యంవఱకూ కన్నడదేశంలోని హాసన్ వంటి దూర ప్రాంతాలలో కూడా కంబరామాయణం చదివి అర్థంచెప్పే వారు వంశపారంపర్యంగా ఉండేవారు. ఆమహాకవిని అతిదారుణంగా విమర్శించేవారు కూడా అతని కవితాప్రాభవాన్ని మాత్రం కాదనలేరు. 'వ్యవసాయకళను ప్రశంసించే 'ఏరెళుపదు' నమ్మాళ్వారును కీర్తించే 'శడగోపరందాది' అనే రెండు పద్యకావ్యాలున్నూ అతని రచనలే అంటారుకాని వాటిల్లో రామాయణంలోని కవితాసంపత్తి కనబడనే కనబడదు.

మతసంబంధమైన ఇతిహాసాలు మాత్రమే కాక, వెనుకటి యుగంలోమాదిరిగానే ఈ యుగంలోకూడా భక్తిప్రధానమైన వాఙ్మయం అనేక రూపాలలో బయలుదేఱింది. 10 వ శతాబ్దం నుంచీ ప్రారంభమైన యుగంలో లెక్కలేనన్ని దేవాలయాలు కట్టటం జరిగింది. దీనితోబాటు కొన్ని దేవాలయాలలోని దేవతలనుగూర్చి స్తుతిగీతాలున్నూ ఉదయించాయి. తిరువైశైప్పాలోని పాటలు చిదంబర దేవాలయంలోని స్వామిని గూర్చినవే కాని, అందఱూ అనుకొంటున్నట్లు తంజావూరు దేవాలయంలోని దేవుణ్ణిగూర్చినవి కావు. తిరువైశైప్పా గీతాలనేవి వేర్వేఱు దేవా

లయాలకు సంబంధించినవీ, వేర్వేరు రచయితలు రచించినవీ ఉన్నాయి. 11 వ శతాబ్ది పూర్వార్థంలో జీవించిన "కరూర్ తేవగార్" తన కాలం నాటి అనేక దేవాలయాలలోని దేవతలను గూర్చి పాటలు వ్రాశాడు. శైవభక్త కవుల వాఙ్మయాన్ని గూర్చి బహుశః 11 వ శతాబ్దం తొలుత జీవించిన నంబిఆండార్ నంబి కొంత పరిశోధన జరిపాడు. మొదటినుంచీ తనకాలంవరకూ బయలుదేరిన శైవ భక్తుల పట్టిక ఒకటి ఏర్పరచు కొని ఆ యా భక్తకవుల రచనలను అన్నింటినీ పది సంపుటాలుగా సమకూర్చాడు.

ఈ యుగం నాటి భక్తి ప్రధాన రచనలలో "పెరియ పురాణం" గొప్ప గ్రంథం. ఇందులో చాలా భాగం చరిత్ర కందని పురాణాంశాలతోనే నిండి ఉన్నా కవిత్వం ప్రశంసనీయం. యథార్థ భక్తిని వర్ణిస్తున్న ఈ పెరియ పురాణం తమిళనాడులో "పంచమవేదం" అని భావించ బడుతున్నది. కంబరామాయణం మాదిరిగానే ఇదిన్నీ తమిళులకు ప్రత్యేకించి మున్నా విడువకుండా చదవ వలసిన గ్రంథం. తమిళ శైవుల జీవితాల మీదా, భావాల మీదా కూడా పెరియ పురాణం ప్రభావం తరతరాలుగా ప్రసరిస్తున్నది.

దక్షిణభారతంలోని కొందరు వైష్ణవ భక్తులూ, ఆచార్యులూ సంస్కృతంలో రచనలు సాగించినా, తక్కిన వారందరూ తమిళాన్నే చేపట్టారు. ఈ యుగంలో ముఖ్యంగా గుర్తించ వలసిన మార్పు ఒకటి ఉన్నది. తమిళాన్నీ సంస్కృ

తాన్నీ మిశ్రమంచేసి "మణిప్రవాళం" అనే నూతన శైలిని సృష్టించటానికి ప్రయత్నం జరిగింది. నాచ్చియార్, నంపిళ్లై పెరియవాచార్ పిళ్లై వంటి వ్యాఖ్యాతలు ఈ నూతన శైలిని ప్రారంభించారు. అయితే ఇందులో శబ్దాడంబరమూ, కృత్రిమత్వమూ విశేషంగా ఉన్నట్లు కనిపిస్తుంది. కాని రామానుజ స్తుతి పరాయణమైన "రామానుజనూట్రందాది" అనే పద్య శతకం సులభమైన తమిళంలో భక్తిరసం వెల్లి విరిసినట్లు ఉంటుంది.

ఈనాటి సాంఘిక పరిస్థితులను చిత్రించే గ్రంథాలలో ఒకటవ కులోత్తుంగుని కాలంలోనూ, అతని కుమారునికాలం లోనూ కవిరాజపీఠాన్ని అధిష్ఠించిన జయంకొండార్ రచించిన "కళింగత్తుపరణి" సుప్రసిద్ధమైనది. "పరణీలు"అనిసంజ్ఞగల వీర రసప్రధాన కావ్యాలలో అత్యుత్తమమైన ఈకావ్యం కులోత్తుంగునికీ కళింగులకూ జరిగిన యుద్ధఘట్టాలను కన్నుల గట్టినట్లు వర్ణిస్తున్నది. ఈకవి శైలీ, శిల్పమూ మెచ్చుకోదగినవి. వర్ణనలు అతివిశదంగానూ సహజంగానూకూడాఉంటాయి. ఇతని తర్వాత విక్రమచోళ ద్వితీయకులోత్తుంగ, ద్వితీయ రాజరాజులు ముగ్గురిప్రభుత్వంలోనూ కవిరాజుగా ఉన్నవాడు "ఒట్టకూత్తర్". ఇతను చాలాపద్యకావ్యాలు రచించాడు. వీటిలో ముఖ్యమైనది "ఉలా" అనేది. తనను పోషించిన ముగ్గురు రాజులనూ అభివర్ణించటానికే ఇతను ఈకావ్యం రచించాడు. "జయంకొండార్" మాదిరిగానే ఇతనుకూడా

విక్రమచోళుని కళింగయుద్ధాన్ని అభివర్ణిస్తూ ఒకపరణి రచించాడు. ఇదేకాక ద్వితీయకులోత్తుంగుని బాల్య చరిత్ర ముఖ్యంగా 'పిళ్లై త్తమిళ్' అనే కావ్యంకూడా రచించాడు. ఇది యితని రచనలన్నింటిలోనూ సుప్రసిద్ధమైనది. సాహిత్యదృష్ట్యాచూస్తే ఉత్కృష్ట కక్ష్యలో చేరదగిన ఎన్నో కావ్యాలు ఇతని రచనలే అని చెప్పుకోనటంకూడాకద్దు.

ఈకాలపు గ్రంథాలలో కవిత్వంమీదనూ, ఛందస్సు మీదనూ బయలుదేరిన గ్రంథాలు ఒకముఖ్యభాగంగా ఉన్నాయి. వీటిలో చాలాభాగం జైనవిద్వాంసుల రచనలే అనేవిషయం గమనించదగ్గది. 10వశతాబ్దంఅంత్యంలో "అమిత సాగరు"డనేజైనయోగి తమిళపద్యలక్షణంమీద "యాప్పరుంకళమ్" "యాప్పరుంకళక్కారికై "అని రెండుగ్రంథాలురచించాడు దండిమహాకవి రచితమైన "కావ్యాదర్శం" ఆధారంగా బయలు దేరిన "దండ్యలంకారం" అనే మహాగ్రంథం అలంకార శాస్త్రంలో ఒకముఖ్యలక్షణ గ్రంథం. ఉంగవీర పండితుడనే జైనుడు "నేమినాథు"డనే తీర్థంకరుని స్మృతిచిహ్నంగా "నేమినాథ"మనే గ్రంథాన్ని రచించాడు. ఇది తమిళవాఙ్మయంలో భాషాభాగ నిర్ణయాన్నిగూర్చిన వ్యాకరణగ్రంథం. ఈరచయిత మరొకరచనగూడా చేశాడు. అది ఒక ఛందోగ్రంథం. దానిపేరు వెణ్ బాప్పాటయల్. "పవణంది" అనే ఒక ఇంకొక జైనుడు తమిళవ్యాకరణ సంగ్రహంగా "నన్నూల్" అనే ప్రసిద్ధ వ్యాకరణ గ్రంథాన్ని రచించాడు. పవణంది గుణ

వీర పండితులిద్దఱూ తృతీయ కులోత్తుంగునికి సమకాలికులు. 11 వ శతాబ్దంనాటి బుద్ధమిత్రుడనే బౌద్ధ రచయిత తమిళ వ్యాకరణమూ, వచన శైలీ విభేదాలు వివరిస్తూ "వీరసోళ్యం" అనే గ్రంథం రచించాడు. తమిళ సంస్కృతాలు రెండూ, చక్కగా చదువుకున్న విద్వాంసుడు గనుక అతను ఉభయ వ్యాకరణ పద్ధతులూ అందులో సమన్వయించడానికి కృషిచేసి నట్లు కనబడుతుంది.

తమిళవాఙ్మయానికి చోళులు కల్పించిన సువర్ణయుగం అనేకవ్యాఖ్యాతలకు కూడా ఆలవాలమైనది. తొల్కాప్పియం అనే ప్రాచీనవ్యాకరణానికి 'ఇళంపూరనర్' చక్కనివ్యాఖ్యానం చేశాడు. 'తొల్కాప్పియం' లోని కొన్ని భాగాలను వ్యాఖ్యా నించిన సేనావరయర్, పేరాసిరియర్ నచ్చినార్కినియర్ అనే వారందఱూ ఈ యుగంలోనివారే. 'సిలప్పదికారం' వ్యాఖ్యాత అయిన 'అది యార్కునల్లార్' 'కురళ్'కూ 'పైరై పదాల్' కూ ప్రసిద్ధ వ్యాఖ్యానాలు రచించిన పరిమేళరఘు కరే అనే వారిద్దఱూ ఈ యుగంలో పుట్టినవారే. వారి అభిప్రాయాలన్నీ ఆమోదించదగినవి అయినా, కాకపోయినా వారి రచనలలో సమగ్రమైన పాండిత్యమూ, నైపుణ్యమూ ప్రతిఫలిస్తున్నాయి.

కన్నడం:- నవీనకర్ణాటసాహిత్యం 10 వ శతాబ్దంలో పంప (ఆదిపంప) మహాకవితో ప్రారంభమైనదని చెప్పవచ్చును. రాష్ట్రకూటప్రభువైన తృతీయకృష్ణునికి సామంతుడైన ఒక

రాజుప్రోత్సాహంతో ఆమహాకవి ప్రథమజైనతీర్థంకరు జీవిత చరిత్ర 'ఆదిపురాణం' అనే పేర రచించాడు. 'పంపభారతం' అని ప్రసిద్ధిగాంచిన "విక్రమార్జునవిజయం" అతని రచనలన్నింటిలోను ఉత్తమమైనది. అందులో ఆకవి మహాభారతకథలో ఒక భాగాన్ని జైనసాంప్రదాయానికి అనుగుణంగా తీర్చిదిద్దాడు. కన్నడకవులలో అత్యుత్తముడైన పంపమహాకవి భావనాబలానికిన్నీ లలితమైన భావావిష్కరణానికిన్నీ వాసి గన్నవాడు.

పొన్న, రన్న అనే యిద్దరు కవులున్నూ ఈ యుగంలోని వారే. 16 వ తీర్థంకరుని మహిమా విశేషాలను కీర్తించే "శాంతి పురాణం" అనేకావ్యం పొన్న రచనలలో మేలుతరమైనది. 'ద్వితీయతైలపు' డనే చాళుక్యరాజుయొక్క ఆస్థానకవి 'రన్న' రెండవతీర్థంకరుని చరిత్రను 'అజితపురాణం' అనే పేర గద్యపద్యాత్మకమైన చంపువుగా రచించాడు. అతను మహాభారతకథలో భీమదుర్యోధనులకు చివటిసారి జరిగిన యుద్ధాన్ని వర్ణిస్తూ 'గదాయుద్ధం' అనే చంపూకావ్యాన్ని కూడా రచించాడు. కన్నడసాహిత్యంలో చంపూకావ్యాలు చాలా త్వరగా బయలుదేరాయనే విషయం గుర్తించదగింది. కన్నడచంపువుల తర్వాతనే సంస్కృతంలో చంపూరచన సాగిందని కొందటి అభిప్రాయం.

కన్నడసాహిత్యంలో 20 వ శతాబ్దంనుంచీ కేవలం సంస్కృతప్రభావంచేతనే చంపువు ప్రాముఖ్యం లోకి వచ్చింది. సుప్రసిద్ధ సాహిత్య విమర్శకుడు ఒకటవనాగవర్మ బాణుని

సంస్కృతరచన ఆధారంగా 'కర్ణాటకకాదంబరి'ని రచించాడు 11 వ శతాబ్దంలో చాళుక్యుల మంత్రి అయిన దుర్గసింహుడు 'పంచతంత్రం, చంపువుగా అనువదించాడు. అయితే శబ్దాలం కారాలమీద అతనికి గల వ్యామోహం వల్ల రసస్ఫూర్తి విషయంలో అంతగా శ్రద్ధ వహించలేక పోయాడు. ఇదే సమ యంలో చంద్రరాజు 'మదనతిలక' అనే చంపూకావ్యం రచిం చాడు. ఇది సంభాషణపద్ధతిలో నడచిన శృంగారకావ్యం. 13వ శతాబ్దం ప్రారంభంలో అభినవపంప బిరుదాంకితుడైన నాగచం ద్రుడు మల్లినాథపురాణం అనే చంపువు రచించగా, ఆశతాబ్దం మధ్యకాలంలో కర్ణపర్యుడు 22 వ తీర్థంకరుని చరిత్ర 'నేమినాథ పురాణం' అనే పేర చంపువుగా రచించాడు.

ఈయుగంలో 'చంపువు' ప్రాముఖ్యంలోకి వచ్చినా కావ్యాలన్నీ యిదేపద్ధతిలో లేవు. హిందూమతములోని అనేక పురాణగాథలు జైనసంప్రదాయానుగుణంగా రచించటం జరి గింది. ఆవిధంగా పంపకవి మాత్రమేగాక, మల్లినాథపురాణ చంపువు రచించిన నాగచంద్రుడు కూడా రామాయణకథను జైనమతవిహితంగా 'రామచంద్రచరితం' అనే పేర రచించాడు కథానాయకుడైన రాముడు కవికథనంప్రకారం జైనపరివ్రాజ కుడై నిర్వాణం పొందుతాడు. ప్రాచీనకర్ణాటవాఙ్మయచరి త్రలో జైనరచయితల ప్రాబల్యం గమనించదగింది. కవి లోకంలో మణిపూసలుగా చెప్పదగిన పంప పొన్న రన్నలు ముగ్గురూ జైనులే. రన్నకవిని తొలుత పోషించినవారిలో ఒక

డైన చావుండార్యుడు అనేక జైనపురాణగాథలను పరిగ్రహించి క్రీ. శ. 798 వ సంవత్సరములో 'చావుండార్యపురాణం' అనే పెద్ద గద్యగ్రంథం రచించాడు. 12 వ శతాబ్దంలో 'సమ్యపరీక్ష' అనే జైనమతోత్కృష్టాపరాయణమైన మహాగ్రంథాన్ని రచించిన బ్రహ్మశివుడుకూడా జైనుడే.

మతప్రాధాన్యంకల రచనలు చేసినవారిలో మఱొక శాఖ వీరశైవవర్గం. వీరి రచనలు చాలావఱకు గద్యాత్మకాలే. 12 వ శతాబ్దంలో బసవేశ్వరుడూ, అతని సమకాలికులైన వీరశైవులూ తమ మత సిద్ధాంతాలు సామాన్యప్రజలకు సులభంగా బోధపడటంకోసం విశేషమైన వచనసారస్వతాన్ని సృష్టించారు. 13 వ శతాబ్దానికి వచనవాఙ్మయం చాలా అభివృద్ధి అయింది. అనేకకర్ణాటరచయితలు కన్నడగద్యవాఙ్మయానికి ఎంతో సేవ చేశారు. ఈ గద్యరచనచేసినవారిలో కొందరు స్త్రీలుకూడా ఉన్నారు. వీరశైవులలో కొందఱు గొప్ప కవులు కూడా ఉన్నారు. హరీశ్వరహరిహరుడు 13వ శతాబ్దపు కవి. ఇతను హొయిసలరాజైన ఒకటవనరసింహునికి సమకాలికుడు. ఇతను హంపీవిరూపాక్ష స్తుతిపరంగా నూఱు పద్యాలున్నూ, పార్వతీపరమేశ్వరుల కల్యాణాన్ని అభివర్ణిస్తూ 'గిరిజాకల్యాణ' మనే చంపువున్నూ, శివభక్తులచరిత్రలుకల 'శివగణదారగళెగళ' అనే కావ్యాన్నీ రచించాడు. తన చివరి రచనలో ఇతను కన్నడ ఛందస్సులో (రగళె) అనే ఛందస్సును ప్రవేశపెట్టాడు. ఇతని తోబుట్టువుకుమారుడు 'రాఘవాంకుడు' 'హరిచంద్రకావ్యం' రచిం

చాడు. దీనిలోకొన్ని వ్యాకరణదోషాలుకనిపిస్తున్నా పద్యరచన చక్కగా ఉన్నది. కన్నడకావ్యంలో శతపది అనే ఛందస్సును తొలిసారి వాడినవాడు ఇతనే. కవితాసృష్టిలో అత్యంతాసక్తి గల ఈకవి 'సోమనాథచరితం' 'హరిహరమహాత్మ్యం' అనే మరి రెండు కావ్యాలను లింగాయతభక్తుల మహిమావిశేషాలు కీర్తిస్తూ రచించాడు. 'కెరెయపద్మరసు' అనే కవికూడా ఒకటవ నరసింహుని సమకాలికుడే. ఇతను శైవమతసిద్ధాంతప్రబోధకంగా 'దీక్షాబోధ' అనేగ్రంథాన్ని గురుశిష్యసంవాదరూపంలో రచించినవాడు.

మత ప్రధానాలైన రచనలే కాకుండా రకరకాల సాహిత్య విమర్శాత్మక గ్రంథాలు కూడా ఈ కాలంలో బయలు దేరాయి. 12 వ శతాబ్దంలోని వైయ్యాకరణులలో సుప్రసిద్ధుడైన నాగవర్మ కన్నడ వ్యాకరణాన్నీ, అలంకార శాస్త్రాన్నీ పరామర్శిస్తూ "కావ్యాలోకనం" అనే గ్రంథాన్ని రచించాడు. అటు తర్వాత ప్రత్యేకంగా వ్యాకరణాన్నే పరిగ్రహించి"కర్ణాటక భాషాభూషణం" అనే గ్రంథాన్ని కూడా రచించాడు. ఇందులో ఉదాహరణాలన్నీ కన్నడ వాఙ్మయంలోనివే అయినా వ్యాకరణ సూత్రాలు వగైరా సంస్కృతంలోనే ఉండటం ఒక విశేషం. ఇవేకాక నాగవర్మ వస్తుకోశం అనే చిన్ననిఘంటువునుకూడా రచించాడు. ఇందులో అతను సంస్కృతపదాలకు సరిఅయిన కన్నడపదాలను నిర్దేశించాడు. 1150 వ సంవత్సరం ప్రాంతాన ఒక తెలుగు చోళరాజవంశ

స్థుడు దండి "కావ్యాదర్శం" ఆధారంగా కావ్యలక్షణాదికాలు వివరిస్తూ ఒకగ్రంథం వ్రాశాడు. అతనిపేరనే అది "ఉదయాదిత్యాలంకారం" అని ప్రసిద్ధికెక్కింది.

ప్రాచీన కర్ణాట రచయితలు కొన్ని ఇతర శాస్త్ర గ్రంథాలుకూడా రచించటం గమనార్హమైన విషయం. 11వ శతాబ్దం మధ్యభాగంలో శ్రీధరాచార్యుని "జాతకతిలకం" బయలుదేరింది. కన్నడంలో మొట్టమొదటి జ్యోతిష్యగ్రంథం ఇదే. దీనితర్వాత క్రమంగా కొన్ని శాస్త్రగ్రంథాలు బయలుదేరాయి. 12వ శతాబ్ది ప్రారంభంలో కీర్తివర్మ అనే రచయిత "గోవైద్యం" రచించాడు. ఇది కేవలం అనుభవానికి సరిపోకపోయినా, పశువైద్యమూ, మంత్రతంత్రాలూ సమ్మిళితమైన అద్భుతగ్రంథం. 12వ శతాబ్దం చివరిభాగంలో రాజాదిత్యుడు గణితశాస్త్రం కావ్యరూపంలో రచించాడు. గణిత సూత్రాలూ, అభ్యాసాలూ సులభశైలిలో ఛందోబద్ధంగా కూర్చి "క్షేత్రగణితం", "లీలావతి", 'వ్యవహారగణితం' అనే గ్రంథాలు మూడు రచించాడు.

**తెలుగు:-** నేడు మనకు కనబడుతున్న తెలుగును ఈ రూపానికి తీసికొని వచ్చిన గౌరవం నన్నయ భట్టారకునిది. ఈ మహాకవి తూర్పుచాళుక్య రాజైన రాజరాజనరేంద్రుని (1019–61) ఆస్థానంలోనివాడు. మహాభారతాన్ని అనువదించటానికి పూనుకొని, రాజరాజుకాలంలో తటస్థించిన రాజకీయపు చిక్కులమూలాన భారతంలోని మొదటి రెండుపర్వాలున్నూ

మూడవపర్వంలో కొంతభాగమూ మాత్రమే అనువదించ గలిగాడు. నన్నయ రచనలో సంస్కృతపద బాహుళ్యం ఉన్న ప్పటికీ, శైలి ద్రాక్షాపాకమై గంగాప్రవాహంవలె సాగి పోతుంది. తెలుగులో మొట్టమొదటి వ్యాకరణంగా భావించ బడుతున్న ఆంధ్రశబ్దచింతామణి నన్నయ రచించినదే అని ప్రతీతి. ఇది శబ్దస్వరూపమూ, ఉపయోగ విధానమూ నిర్ణ యిస్తూ సలక్షణమైనభాష అభివృద్ధికావటానికి చాలా తోడ్ప డింది. భాషాస్వరూపనిర్ణేతగా నన్నయ "వాగనుశాసనుడు" అనే బిరుదానికి నిజంగా తగినవాడు. .

వేములవాడ భీమకవి నన్నయకు సమకాలికుడు. ఇతనిని గురించి ఎన్నో విచిత్రకథలు ప్రచారంలో ఉన్నాయి. అందు వలన ఇతని యథార్థ జీవితం ఎటువంటిదో తెలిసికొనటానికి అవ కాశాలులేవు అయితే కళింగరాజైన అనందవర్మచోడగంగు (క్రీ॥శ॥ 1078--1148) ఇతనిని ఆదరించి ఉండటం మాత్రం సత్యం కావచ్చును. కవిజనాశ్రయం అనే తెలుగు వ్యాకరణం ఇతని రచన. ద్రాక్షారామభీమేశ్వరస్వామికి సంబంధించినకథలు ఇతను "భీమేశ్వరపురాణం" అనే గ్రంథంగా రచించాడు. "రాఘవ పాండవీయం" అనే ద్వ్యర్థి కావ్యంకూడా ఇతను రచించినట్లు ప్రసిద్ధి. ఆకావ్యం ఆదినుంచి అంత్యంవరకూ ఒకవైపు రామా యణార్థమూ, మరొకవైపు భారతార్థమూ ఇస్తుంది. అయితే అది యింతవరకు లభించలేదు.

12వశతాబ్దంనుంచీ బలపడిన వీరశైవం తెలుగు సార స్వతానికి ఎంతో దోహదం చేసింది. వీరశైవులు తమమతాధి

క్యాన్ని చాటించి ఇతరమతాలను ఖండించటానికి ఎన్నో రచనలు చేశారు. వీరశైవకవులలో ఉత్తమశ్రేణికి చెందిన మల్లికార్జున పండితుడు తెలుగు చోడరాజైన నన్నెచోడుని గురువు. ఈ పండితుని "శివతత్త్వసారం" వీరశైవ సిద్ధాంతాలను ప్రకటించే 500 పద్యాల గ్రంథం. నన్నెచోడుడు తనకాలంలో ప్రచారంలో ఉన్న శైవవాఙ్మయాన్నీ సంస్కృతకుమారసంభవాన్నీ ఆధారం చేసికొని తెలుగు కుమారసంభవం రచించాడు. ఇతని రచనలో అచ్చ కన్నడపదాలను విరివిగా వాడటమూ, కన్నడఛందస్సు కూడా ఉపయోగించటమూ గమనించదగ్గవి. కొంతమంది విమర్శకులు ఇతని కుమారసంభవం తెలుగుకావ్యాలలో ఉత్తమమైనదని అభిప్రాయపడుతున్నారు కానీ, ఇతనిభాష వ్యాకరణసూత్రాలను అతిక్రమించినదనీ, ఇతను ప్రయోగించిన శబ్దాలుకొన్ని అతిపురాతనాలని కానీ, అసలు తెలుగు పదాలే కావనికానీ, ఒప్పుకోక తప్పదు.

మళయాళం :- మళయాళం ప్రాచీన తమిళంనుంచి పుట్టినదే అని ఇప్పుడు అందరూ అంగీకరిస్తున్నారు. క్రీ॥శ॥14వ శతాబ్దం తర్వాతనే మళయాళ సాహిత్యం బయలుదేరినప్పటికీ, తమిళం నుంచి ప్రత్యేకశాఖగా ఇది ఎప్పుడు విడివడ్డదో నిర్ణయించటంఅసాధ్యం. క్రీస్తుశకం ప్రారంభంకావటానికిపూర్వమే తమిళభాష రెండురకాలుగా చీలిఉంటుందని చాలామంది అభిప్రాయం. వీటిలో ఒకటి "సెన్ తమిళం" ఇది గ్రాంథికమూ, స్వచ్ఛమూ అయినభాష. రెండవది "కొడుం తమిళం" ఇది

గ్రామ్యభాష. కొడుం తమిళం పశ్చిమతీరంలో వాడుకలో ఉండేది. "కరిన్ తమిళం" అనేది ఈకొడుం తమిళంనుంచి పుట్టిన మఱొక శాఖ. ఈ కరిన్ దమిళం నుంచే మళయాళభాష అభివృద్ధి అయింది. ఈ పరిణామం హఠాత్తుగా తటస్థించింది కాక చాలాకాలంతీసికొన్నది. క్రీ॥శ॥ 5వశతాబ్దం ప్రాంతాన ఈ పరిణామం ప్రారంభమైనదని కొందరు చరిత్రకారులు వ్రాస్తున్నారు.

క్రీ॥శ॥ 8వశతాబ్దంలోనే మళయాళభాషలో సారస్వతం ఉదయించింది. ఇది పాటలరూపంలో ఉన్నవి. ఈపాటలు దేశమంతటా వాడుకలో ఉన్నవి. వీటిలో బ్రాహ్మణిప్పాట్టు, శాస్తాప్పాట్టు,ఓణప్పాట్టు,విల్లడిచాన్ ప్పాట్టు, తిరువాతిరై ప్పాట్టు మొదలయిన రకరకాల పాటలున్నవి. ఇవి అన్నీ అసలు అఱవ పాటలే. అయితే కాలక్రమాన వీటిలో కొన్ని చేర్పులూ, మార్పులూ జరిగి ఈరూపంతాల్చాయి.

కొన్నిరకాల పాటలు నాటకధోరణిలో ఉన్నాయి. "సిలప్పదికారం" అంతటి ప్రాచీనమైన "శాక్కియార్ కూత్తు" "కూడిఆట్టు" అనే రూపాంతరం ధరించింది. ఇది అప్పటికి ప్రారంభమైన నాటకపద్ధతికి దోహదం చేసింది. కులశేఖర ఆళ్వార్ ఆస్థానకవి అయిన "తుళ్ళల్" ఈరకం కవిత్వానికి మార్గదర్శకాలైన గ్రంథాలు రచించాడు. తోళన్ రచనలు పరికిస్తే మళయాళభాష అప్పుడప్పుడే ఒకప్రత్యేకతను సంపాదించుకొంటున్నట్లు గోచరిస్తుంది.

13 వ శతాబ్దం చివఱనో, 14 వ శతాబ్దం మొదటనో ఉదయించిన "రామచరితం"తో మళయాళంలో సలక్షణ రచన ప్రారంభమైనది. "రామచరితం"లో తమిళ శబ్ద ప్రాచుర్యం కనబడుతున్నప్పటికీ అది ప్రాచీనమళయాళంలో రచితమైన కావ్యమే. ఈ కాలంలోనే "సంబియార్ తమిళం" అనే పేరుగల శైలిలో కొన్ని వచనకావ్యాలు బయలు దేరాయి. అయితే ఈ శైలి ప్రాచీన మళయాళరూపమేతప్ప వేఱుగాదు. ఈ ప్రాచీన గద్య గ్రంధాలలో సంస్కృత తమిళ పదాలుమాత్రమే విశేషంగా ఉన్నాయి. ఈ యుగంలో కేవల కావ్యాలేగాక వైద్యమూ, ఖగోళశాస్త్రమూ, వేదాంతమూ వంటి శాస్త్రాలలోగూడా రచనలు సాగాయి.

వాస్తవానికి 14 వ శతాబ్దంనుంచీ మళయాళ వాఙ్మయంలో సంస్కృతభాషాముద్ర స్ఫుటంగా కనబడుతున్నది. దీనికి కారణం కేరళంలో నంబూద్రుల ప్రాబల్యం అన్ని రంగాలలోనూ వృద్ధిపొందటమే. "సంస్కృతభాష తన విశిష్టతనూ, పదజాలాన్నీ కవితాధోరణినీ, ఛందస్సునూ, అలంకార లక్షణాలనూ మళయాళానికి ఎంతోఎక్కువగా ప్రసాదించింది" అని ఒక భాషాశాస్త్రవేత్త అంటున్నాడు.

కళ :- ఈ యుగంలో చోళులు కళకు ఎంతైనా సేవ చేశారు. ఇది ప్రాచీన పల్లవకళ అనే లతకు పల్లవం అని చెప్ప వచ్చును. అయితే పెద్ద పెద్ద దేవాలయాలను నిర్మించటం ఈ యుగంలో సర్వసాధారణమైనది. సహ్యాద్రినుంచి సముద్రం

వఱకూ ఱాతి దేవాలయాలు నిర్మించినట్లు ప్రసిద్ధిగన్న ఒకటవ ఆదిత్యునినాటినుంచీ ఱాతి దేవాలయాలు నిర్మించటం జరుగుతూవచ్చింది. కాని ఒకటవ రాజరాజు దగ్గఱనుంచీ ఈ ఆలయాల పరిమాణం తగ్గిపోయింది.

చోళచక్రవర్తులకాలంలో (సుమారు క్రీ॥ శ॥ 850 – 1250 వ సం॥) రకరకాల పరిమాణాలుగల ఱాతి దేవాలయాలు ఒక్క చోళ దేశం అంతటా తలయెత్తటమేకాక, మైసూరులో ఆంధ్రప్రదేశంలోని ద్రాక్షారామంలో, ఇంకా ఎన్నోచోట్ల మొత్తం దక్షిణభారతం అంతటా అనేక ప్రాంతాలలోకూడా అదేవిధమైన శిల్పరచనకు ప్రాముఖ్యం ఇవ్వటం జరిగింది. చోళుల దేవాలయశిల్పంలోని ప్రాచీనపద్ధతికి నర్తమలై లోని విజయాలయ చోళేశ్వరాలయమూ, కన్ననూర్ లోని సుబ్రహ్మణ్యాలయమూ చూడదగ్గవి, సమచతురస్రమయిన ప్రాకారం లోపల వర్తులాకారపు గర్భగృహమూ, దానిమీదవిమానము, విమానంమీద అర్ధగోళాకారమైన శిఖరమూ, శిఖరంమీద గుండ్రని కలశమూ ఈపద్ధతిలో కనిపించే ప్రధాన లక్షణాలు.

ఒకటవ రాజరాజుకాలంనుంచీ దేవాలయశిల్పంలో క్రొత్త యుగం ప్రారంభమైనది. తంజావూరులోని బృహదీశ్వరాలయం ఈనవీనత ప్రతిబింబిస్తున్నది. ఈఆలయంలో విమానం గర్భగృహానికి రెండువందల అడుగులఎత్తున ఉన్నది. రకరకాల బొమ్మలరచనలోనూ ఒక క్రొత్తదనం కనిపిస్తున్నది. ఇక్కడి నందిగానీ, శివలింగంగానీ సామాన్యమైనవికావు. ఇవి ఎంత

పెద్దవైనా వీసమైనా సౌందర్యలోపం లేకుండా ఎంతో చక్కగా ఉన్నాయి. క్రీ॥శ॥ 1030వ సంవత్సరంలో గంగైకొండ చోళ పురంలో ఒకటవ రాజేంద్రుడు కట్టించిన దేవాలయమున్నూ ఇదే విధంగా ఉన్నది. తంజావూరు దేవాలయంలో విమాన నిర్మాణంలో కనబడే ఋజు రేఖలకుబదులు వక్ర రేఖలు కల్పించటము, కుడ్యాలమీద అందమైన చిత్రరచనతో వన్నె తేవటమూ, క్రొత్తగావచ్చిన మార్పులు. ఇటుతర్వాత ఒకవంద సంవత్సరాల వఱకూ వెలసిన దేవాలయాలన్నింటికీకూడా ఈ రెండు దేవాలయాలలోనూ కనిపిస్తున్న చోళపద్ధతిమాత్రమే ఒరవడిఅయినది.

చోళులకాలంలో ఱాతితోనూ, ఇతర లోహాలతోనూ శిల్పరచన చెయ్యటంలో పనితనం అత్యున్నతస్థితి అందుకొన్నది. అనేకమైన శిలావిగ్రహాలలోనూ, కంచువిగ్రహాలలోనూ, నటరాజు నాట్యభంగిమ ప్రదర్శించే విగ్రహాలు దక్షిణభారత శిల్పకళమూర్తీభవించినట్లున్నాయి. "నాట్యభంగిమలో పాదాలమధ్య అంతరం చాలా ఎక్కువగావున్నా విగ్రహం పట్టుదప్పక నిలిచినట్లే కనబడుతుంది." తిరునల్వేలిలో తిరువళీశ్వర దేవాలయంలో చక్కని శిలావిగ్రహాలెన్నో ఉన్నాయి. ఇవి అన్నీ ఒకటవ రాజరాజుకు వెనుకటివే. తంజావూరు గంగైకొండచోళపుర దేవాలయాలలోకూడా కళాదృష్ట్యా ఉత్తమమైన విగ్రహాలెన్నో ఉన్నాయి. దక్షిణభారతంలోని కంచువిగ్రహాలలో ఉత్తమమైనవన్నీ చోళులకాలంనాటివే. అనేక దేవాలయాలలో నటరాజవిగ్రహాలేకుండా ఇతరభంగిమలలోఉన్న శివవిగ్ర

హాలూ, విష్ణువు, లక్ష్మి, పార్వతి, హనుమంతుల విగ్రహాలూ కూడా ఉన్నాయి. "దక్షిణభారతంలోని వేర్వేరు ప్రాంతాలలో మనకు కనబడుతున్న చోళులకాలంనాటి కంచువిగ్రహాలు, పరిమాణంలోనూ,నాణెంలోనూకూడా మేటివై ఆనాడు లోహాలను పోతపోయటంలోని అద్భుత కౌశలానికి ప్రత్యక్ష నిదర్శనాలౌతున్నాయి."

చోళ శిల్పాలలో యథార్థ ప్రతికృతులు అరుదుగానే ఉన్నాయి. అయితే శ్రీనివాసనల్లూరువద్దవున్న కోరంగనాథ దేవాలయం కుడ్యాలమీదనూ, కుంభకోణంవద్దవున్న నాగేశ్వరాలయంలోనూ ఉన్నవి చాలా వాస్తవంగా ఉన్నాయి. దక్షిణభారతంలో యథార్థ ప్రతికృతినిర్మాణం ఒకటవ రాజరాజు భార్య అయిన చోళమహాదేవి ప్రతికృతితోనే ప్రారంభమైనట్లు కనబడుతున్నా, రాజరాజుకు ముందే ఈకళ చాలా అభివృద్ధి చెందింది.

తమిళదేశంలో వర్ణచిత్రరచన కూడా చాలాకాలం నుంచీ జరుగుతున్నట్లు కనబడుతున్నది. ఇటీవల తంజావూరు దేవాలయం గోడలమీద కనిపించిన చోళ వర్ణ చిత్ర రచన పల్లవులూ, పాండ్యులూ మొదట ప్రారంభించిన మార్గంలోనే కొనసాగింది. అయితే ఇక్కడి కళాకౌశలం అజంతా, వాతాపి ఎల్లోరాలలో కంటె తీసికట్టుగానే ఉన్నది.

కేరళంలో జాతిదేవాలయాలు అరుదు. కాని దారు శిల్పకళ చాలా అభివృద్ధి లోనికి వచ్చింది. ఈ కాలంనాటి

కేరళ దేవాలయాలలో పరిమాణాధిక్యంకానీ, విగ్రహాలు విశేషంగా ఉండటం కానీ కనిపించవు. కాని జాతితోనూ,లోహంతోనూ తయారైన విగ్రహాలు మాత్రం కళాదృష్టిలో మెచ్చదగినవే. దక్కనులో మైసూరులోని హొయిసల దేవాలయాలలో కళలో పరిపక్వస్థితికి వచ్చిన కొన్ని శిల్పాలు కల్యాణి చాళుక్యుల కాలంనాటివి. ఈ దేవాలయాలలోనికి దారులు ప్రక్కగా ఉండటం గమనించదగ్గవిశేషం. చాళుక్యులు కట్టించిన దేవాలయవిమానాలు అంచెలంచెల అంతరువులతో నునుపుగాఉన్నాయి. కడపటి చాళుక్యులు హొయిసలులకు సమకాలికులైన ప్రాచీనచాళుక్యులశిల్పపద్ధతినీ హొయిసలశిల్పపద్ధతినీ సమన్వితంచేసికొన్నారు. హొయిసల దేవాలయాలు మాత్రం ఎక్కువ ఆవరణ లేకపోయినా చాలా నేర్పుతో కట్టినట్లుంటాయి. ఇత్తగిలోని మహాదేవ మల్లికార్జునాలయాలలోనూ కుర్వర్తిలోని మల్లికార్జునాలయంలోనూ కనబడుతున్నట్లు దేవాలయ ప్రాకారకుడ్యాలను అత్యధికశిల్పాలతో అలంకరించటం కడపటి చాళుక్యుల ప్రత్యేకత.

మైసూరులో అందమైన హిందూ దేవాలయాలే కాక ఎన్నో జైన శిల్పాలు కూడా ఉన్నాయి. వీటిలో చాముండరాయ బసది (క్రీ. శ. 980) అతి సుందరమైనది. ఇది యిప్పుడున్న తీరునుబట్టి కేవలం చోళశిల్పకళానుకృతిగానే కనబడుతుంది. ప్రథమ తీర్థంకరుని కుమారుడైన గొమ్మటుని విగ్రహం 56 అడుగుల ఎత్తున ఉన్నది. ఇది నిజంగా ఒక అద్భుత సృష్టి. శ్రావణ బెల్గోలాలోనే 983వ సంవత్సరంలో నిర్మాణం

పూర్తిఅయిన ఈ విగ్రహమున్నూ, జైన దేవాలయం ఒకటిన్నీ పశ్చిమ దేశప్రభువైన నాలుగవరాజమల్లుని (974 – 85) మంత్రి చాముండరాయడు నిర్మింప జేశాడు. కాని దక్కనులో శిలాశిల్పాలు గానీ, ఇతర శిల్పాలుగానీ, నిర్మించటంలో అద్భుత సృష్టిఅంతా 9 వ శతాబ్దం అంత్యానికి కొంచెం ముందుగా జరిగినదే. కళాసంపత్తికి భాండాగారాలైన అజంతా, ఎల్లోరా, ఎలిఫెంటా, ఐహోలూలు, వాతాపి మొదలయిన చోట్ల జరిగిన శిల్పసృష్టి అంతా ఈ కాలంనాటిదే.

10 వ శతాబ్దం గడచినంతలోనే ఉత్తర భారతం లోని దేవాలయ నిర్మాణపద్ధతిని అనుసరించి కళింగ దేశంలో ముప్ఫైకిపైగా దేవాలయాలు నిర్మించటం జరిగింది. వీటిలో పూరీలోని జగన్నాథాలయమూ, కోణార్కులోని సూర్యదేవాలయమూ చెప్పదగ్గవి. కళింగదేశపు రాతిశిల్పాలనిర్మాణభేదాలనుబట్టి మూడుతరగతులుగా విభజించవచ్చును. మొదటి తరగతి శిల్పాలు ప్రాచీన చాళుక్యపద్ధతిని అనుసరించి క్రీ॥శ॥ 750–900 సంవత్సరాలమధ్య సృష్టించబడ్డవి. భువనేశ్వరంలోని పరమేశ్వరాలయం ఈ తరగతికి చెందినదే. 44 అడుగులు ఎత్తు ఉన్న ఈ శిఖరం చాలా దళసరిగాఉండి శిల్పకళా ప్రాథమికదశకు చిహ్నంగా ఉన్నది. నాటి శిల్పులు ఇక్కడ పెద్ద పెద్ద రాతిబండలను స్వల్పమైన సిమెంటుతో అతికిస్తూ ఒకదాని మీద ఒకటి పేర్చి పెట్టారు. భువనేశ్వరంలోని లింగరాజాలయంలోనూ, పూరీలోని జగన్నాథాలయంలోనూ కూడా

శిల్ప నిర్మాణంలోని రెండవ దశ (900–1000) లక్షణాలు కని పిస్తాయి. ఇప్పటి దేవాలయాలు మొదటి వాటి కంటె పెద్దవి మాత్రమే కాక, వీటిలోపల ఎన్నో చిన్న చిన్న గుళ్లు కూడా ఉన్నాయి. చూచితీరవలసిన ఉన్నత శిఖరం నిర్మాణం ఒకటి ఈ రెండవ దశలోని ప్రత్యేకత. మూడవదీ చిట్టచివ రిదీ అయిన దశ (క్రీ. శ. 1100–1250) యందు దేవాలయ పరి మాణం అంత ఎక్కువా తక్కువా కాక ఒకసాధారణ పరిమితికి వచ్చింది. కోణార్కలో నరసింహదేవుడు (1238–64) కట్టించిన చక్కని సూర్యదేవాలయమున్నూ భువనేశ్వరంలోని ఇతర దేవాలయాలున్నూ ఈతృతీయదశ నాటివే. పన్నెండు పెద్ద చక్రాలుగల సూర్యదేవుని రథాన్ని సప్తాశ్వాలు క్రిందికిలాగి కొని వస్తున్నట్లు శిల్పులు అతి విచిత్రంగానూ సుందరంగానూ సూర్యదేవాలయాన్ని నిర్మించారు. గోడలమీదిచిత్రరచనఎంతో మనోహరంగాఉన్నది. ఇందులోకొన్నిచిత్రాలు అసభ్యశృంగార స్ఫోరకాలుగా ఉండటం గమనార్హం. వాస్తవానికి ఈయుగా నికి చెందిన అనేక దేవాలయాల మీద ఇటువంటి అసభ్యశిల్ప రచన కనబడుతూనే ఉన్నది. దేవతార్చన జరిగే పవిత్రస్థలా లలో ఇటువంటి బొమ్మలు ఉండటానికి ఎన్నో సమాధానాలు వినబడతాయి. బహుశః ఇది హిందూమతంమీద తాంత్రిక మహాయానం ముద్రకావచ్చును. మొట్టమొదట దేవాలయా లపై ఇటువంటి అసభ్య శిల్పరచనకు కళింగమే దారితీసింది. అటుతర్వాత ఇది దేశం అంతటా వ్యాపించింది.

12, 13 శతాబ్దాలలో దక్కను వాయవ్యప్రాంతాన దేవాలయ నిర్మాణంలో ఒక నూతనపద్ధతి బయలుదేరింది. ఇది నాటి దక్షిణభారతసంప్రదాయంకంటె ఉత్తరభారత సంప్రదాయాన్నే అధికంగాఅనుకరించింది. శిఖరంపైన అలంకారాలు అధికంకావటం ఇందులోని ముఖ్యవిశేషం. శిఖరం మట్టంనుంచి అన్నివైపులా దానిని బలపరచటానికి లోపలి భాగంలో శిఖరాకారంలోనే ఎన్నో ఊతలు కల్పించారు.

# నవమ ప్రకరణం

## సముద్రాలుదాటిన దక్షిణభారత సంస్కృతి

ప్రాచీన కాలం నుంచీ తూర్పు దేశాలతో దక్షిణభారతం నౌకావాణిజ్యం ఎంత చురుకుగా సాగించిందీ మనము గమనించే ఉన్నాము. దీనివల్ల కాలక్రమాన ఆయా దేశాలలో వలసలేర్పఱచుకోవటం సంభవించింది. దూరప్రాచ్యంలో దక్షిణభారత సంస్కృతి వ్యాపించినదనటానికి తగిన నిదర్శనాలు బర్మా, మలయా, సుమత్రా, జావా, బోర్నియో, సయాం (థాయ్‌లాండు) ఫ్యూనన్, కాంబూజ, చంపాలలో కనబడుతున్నాయి. వీటిలో ప్రతి దేశంతోనూ దక్షిణభారతానికి కల సంబంధం ఎటువంటిదో ఒక్కసారి పరికిస్తే ఈ ప్రాంతాలలో దాక్షిణాత్య సంస్కృతి ఎంత వఱకు విస్తరించిందీ గ్రహించవచ్చును.

బర్మా:- క్రీ॥శ॥ 1వశతాబ్దం బర్మాతో దక్షిణహిందూ దేశానికి వాణిజ్యసంబంధం ఉన్నట్లు పెరిప్లస్ గ్రంథకర్త టాలెమీకూడా పేర్కొన్నారు. అయితే ఈవాణిజ్యసంబంధం ఎప్పటినుంచీ ప్రారంభమైనదో నిశ్చయంగా చెప్పటానికి ఆధారాలు లేవు. బర్మాలో మాన్ జాతి ప్రజలు "తెలైంగు" లని కూడా వ్యవహారం ఉండేది. దీనినిబట్టి ఈప్రజలు తెలంగాణాకు సంబంధించిన వారేమో అని ఊహించవలసి వస్తున్నది, తెలంగాణా నుండి కొంతమంది బర్మాకు వలస వెళ్లి ఉండ

వచ్చును. దిగువ బర్మాలో క్రీ. శ. 543 నాడు 'తాటన్'నగరం నిర్మించు కొన్న వారు తెలింగులే అని ప్రతీతి. ఇది యెంత వఱకు నిజమో తేల్చటానికి ఆధారాలు లేవు.

మావుంగన్ గ్రామంలో దొఱకిన బంగారు రేకుల మీాది శాసనలిపి క్రీ. శ. 5, 6 శతాబ్దాలనాటి దక్షిణభారతలిపిగా స్పష్టంగా కనబడుతున్నది. ఇదేకాక మఱొక గ్రామంలోని స్తూపంమీాద చెక్కిన అక్షరాలు తెలుగుకన్నడలిపిలో ఉన్నవి. ఈలిపి దక్షిణభారతంలో కనబడిన కాదంబపల్లవశాసనాలలోని లిపికి చాలా సన్నిహితంగా కనబడుతున్నది. ఈస్తూపంమీాద ఆనాటికి అక్కడ రాజ్యంచేస్తున్న శ్రీప్రభువర్మపేరుకూడా ఉన్నది. ఈ'వర్మ' అనే పదం కేవలం భారతీయమే. అనేక సమాధుల మీాద సూర్యవిక్రమ, హరివిక్రమ, సింహవిక్రమ ఇత్యాదులైన పేర్లు కనబడుతున్నాయి. ఇవి సంస్కృతసమ్మిళిత తమైన పాళీరూపంలో ఉన్నాయి. ప్రాచీనబర్మాదేశంలో ఏ రాజుకున్నా పేరుచివర వర్మ అని కానీ, వర్మన్ అనీ కానీ ఉన్నట్లు కనబడటం లేదు. మాన్ భాషలలో భారతీయభాషలకు చెందినశబ్దాలు ఎన్నో ఉన్నాయి. ప్రోమ్‌రాజధానిఅయిన శ్రీ క్షేత్రానికి 'వనవాసి' అనే నామాంతరం ఉన్నది. కాదంబుల రాజధానిపేరు కూడా ఇదే.

బర్మాలోని దేవాలయాల నెన్నింటినో దక్షిణభారత శిల్పులే నిర్మించి ఉంటారని ఊహించటానికి తగిన కారణాలు స్కాట్ పేర్కొన్నాడు. "ఎన్నో విగ్రహాలూ, వాటి భంగి

మలూ దక్షిణభారతీయూలే” అని అని అతను అంటున్నాడు. పాగన్‌లో అక్కడ నానాదేశవర్తకులు ఒక విష్ణుదేవాలయాన్ని నిర్మించినట్లు తమిళగ్రంథస్థమైన విషయంవల్ల తమిళులక్కడ ముందుగా నెలకొన్నట్లు తోస్తున్నది. 13 వ శతాబ్దంలో ఆ దేవాలయానికే ఒక మలబారువర్తకుడు కొంత దానంచెయ్యటం ఈఊహను బలపరుస్తున్నది. ఇందువల్ల బర్మాదేశానికీ దక్షిణభారతానికీ కనీసం 5వ శతాబ్దంనుంచి అయినా దృఢమైన సంబంధం ఏర్పడిందని ధ్రువపడుతున్నది.

**మలయా:**— మలయాలోచాలాముందుగానే దక్షిణభారతీయులు వలసలేర్పఱచుకొన్నట్లు కనబడుతుంది. క్వాలా సేవిన్నింగ్ గ్రామంలో దాక్షిణాత్యసంప్రదాయంలో సంస్కృతభాషలో చెక్కినశాసనాలు లభించాయి. ఇవి క్రీ. శ. 6 వ శతాబ్దంనాటివి కాగా, 'కేడా' లో 4 వ శతాబ్దంనాటి శాసనాలు రెండున్నూ 'లిగార్' లో క్రీ. శ. 775 వ సంవత్సరంనాటి శాసనం ఒకటీ కూడా కనిపించాయి. వియెంగ్‌స్రా దేవాలయంలోని ఇతరవిగ్రహాలతోబాటు విష్ణువిగ్రహం ఒకటీ శివుని భైరవాకృతివిగ్రహం ఒకటీ (రెండూ తాతివిగ్రహాలే) కనబడుతున్నాయి. ఈవిగ్రహాలలో ముఖలక్షణాలు తప్ప తక్కినవన్నీ దక్షిణభారతీయసంప్రదాయసిద్ధంగానే ఉన్నాయి. టూక్వాపాలోని కొన్ని శిల్పాలను వర్ణిస్తూ 'లేజన్ క్వైర్' ఇలాఅన్నాడు: “రకరకాల భంగిమలు గల ఈబొమ్మలలోని ప్రత్యంగనిర్మాణమూ, అఖండమైన అలంకార విధానమూ శరీరపు వంపు

సొంపులూ ప్రాచీన భారత ద్రావిడశిల్పాలను జ్ఞాపకంచేస్తూ, వాటికి చాలా సన్నిహితంగా ఉన్నాయి."

ఇంతే కాక టాక్వాపాలో 8 వ శతాబ్దంనాటి తమిళ శాసనం ఒకటి కనబడుతున్నది. ఇది 'అవని నరనమ్' అనే తటాకాన్ని నిర్మించినవిషయం వివరిస్తున్నది. అవనినరనఅనే నామాంతరం కల మూడవనందివర్మ (క్రీ. శ. 826–50) అనే పల్లవ రాజుపేర దీనిని నిర్మించారు. ఈ మూడవనందివర్మ తాను 'నంగూరు' రాజునని చెప్పుకొన్నాడు. ఈశాసనంలో మరొక విషయం కూడా గమనించదగినది ఉన్నది. ఇక్కడ ఆనాడు నివసిస్తున్న 'మణిగ్రామం' అనే తమిళవర్తకసంఘం ఈ తటాకానికి యాజమాన్యం వహించినదట!

మలయాచరిత్రలో దక్షిణభారతం చాలా ప్రాముఖ్యం వహించినట్లూ, ఆనాటి సంస్కృతి ఎంతో గొప్పదైనట్లూ, రూఢిచెయ్యటానికి తగిన ఆధారాలు ఇప్పటికీ కనబడుతూనే ఉన్నాయి. మలయాభాషలో ఆకు, వివాహం, తాకట్టు, జంట, ఛాకలి అనే అర్థాలిచ్చే కొన్నిపదాలయినా కేవలం తమిళ భాషలోనుంచి వచ్చినవే. సంస్కృతంలోని (శ్రీ) అనే పదమే మలయా భాషలో 'చిరి' అయింది. మలయాలోని ముస్లిం రాజ్యాలలో ఇప్పటికిన్నీ ఇది వాడుకలో ఉన్నది.

సుమత్రా :— సుమత్రాలో క్రీ.శ. 1వ శతాబ్దంలోనో, 2వ శతాబ్దంలోనో హిందువులు వలసలేర్పఱుచుకొన్నారు. సుమ

త్రాలోని సింబ్రింగ్ ప్రజలలో కొన్ని జాతుల పేర్లు దక్షిణభారత పద్ధతిలో ఉన్నాయి. చోళియ, పాండియ, మెలియాల, పెలవి (పల్లవ) టేకంగ్ (తెక్కణం) ఇటువంటి పేర్లు. ఈ పేర్లు ఎప్పుడు ఇక్కడి వాడుకలోకి వచ్చాయో చెప్పలేముకానీ 8 వ శతాబ్దానికి ముందుగానే ఇది సంభవమై ఉంటుందని చెప్పవచ్చును.

7 వ శతాబ్దం నుంచీ ఈ ద్వీపంలో శ్రీవిజయ రాజ్యానికి ప్రాముఖ్యం వచ్చింది. బౌద్ధ మతస్థుడైన శ్రీజయనాగ్యాసు డనే రాజు సుమత్రా లోని చాలా భాగమూ, దానికి చేరువనే ఉన్న యాంగ్కా ద్వీపమూ కూడా జయించి శ్రీవిజయానికి మంచి కీర్తి తెచ్చినట్లు శాసనాల వల్ల తెలుస్తున్నది. 8 వ శతాబ్దంఅంత్యానికి శ్రీవిజయసామ్రాజ్యం శైలేంద్ర సామ్రాజ్యం అయింది. ఇది దక్షిణ ద్వీపాలలోనే గాక మలయా కాంబోడియాలలో కూడా వ్యాపించింది. 9 వ శతాబ్దంలో కాంబోడియా జావాలు స్వతంత్రాలు అయినప్పటికీ 10 వ శతాబ్దం చివరి వరకూ శైలేంద్ర రాజులు బలవంతులు గానే ఉన్నారు. వీరు మొదట చోళులతో మైత్రి చేశారు. క్రీ. శ. 1006 వ సంవత్సరంలో మారవిజయోత్తుంగ వర్మన్ అనే శైలేంద్ర చక్రవర్తి ఒక బౌద్ధ విహారం కూడా కట్టించాడు. కాని యే కారణం వల్లనో చోళ చక్రవర్తి రాజేంద్రుడు శైలేంద్రులతో ఘోరయుద్ధం చేసి సుమత్రా మలయాలను స్వాధీనం చేసికొన్నాడు. 11 వ శతాబ్దం అంతటా ఉభయ రాజ్యాలకూ పోరు సాగుతూనే ఉన్నది. శైలేంద్ర చక్రవర్తులు మహాయాన

మతస్థులు. వీరికి మలయాతో స్నేహ సంబంధాలు ఉన్నాయి. సుమత్రాలో హిందూసంస్కృతి చాలా కాలం వర్ధిల్లింది. ఇది క్రీస్తుశకం తొలి శతాబ్దాలలో ప్రారంభమై ఒక వెయ్యి సంవత్సరాలపాటు అక్కడ నిలబడి ఉన్నది. సుమత్రా సంస్కృతి వంగ సంస్కృతితో గానీ, మరే ఉత్తర భారత సంస్కృతితో గానీ ఎక్కువ సంబంధం లేకుండా, తమిళ సంస్కృతితోనే గాఢంగా సంబంధించి ఉన్నదనటంలో సందేహం లేదు.

జావా :- దక్షిణభారతీయులు జావాలో చిరకాలం క్రిందటనే ప్రవేశించారు. వీరి రాకకు పూర్వమే వెలసిన ఇండోనీషియన్ నాగరకతకూ వీరి దక్షిణభారత నాగరకతకూ ఈ ద్వీపంలో కలయిక ఏర్పడిన చిహ్నాలు కనుపిస్తున్నవి.

గ్రామస్థులకు పరిపాలనా నిర్వాహణంలో అవకాశం కల్పించటమూ, గ్రామస్వపరిపాలనా పద్ధతీ దక్షిణభారత సంప్రదాయానికి అనుగుణంగానే ఉన్నాయి. క్రీ. శ. 132 వ సంవత్సరంనాటి చైనీయుల వ్రాతలలో ఆనాడు జావాను పాలిస్తున్న దేవవర్మ అనే రాజు పేరు కూడా కనబడుతున్నది. దీనిని బట్టి హిందువులు ఇక్కడికి వలస రావటం అంతకు ముందే జరిగి ఉంటుందని ఊహించ వలసి వస్తున్నది. జావా దేశ చరిత్రలో మధ్యయుగంలోని ముఖ్య సంఘటనలలో కళింగ దేశంనుంచి జావాకు క్రీ. శ. 2 వ శతాబ్దంలో 20000 కుటుంబాలు వలసవచ్చినట్లు కనబడుతున్నది. అంతమంది ప్రజలు ఒక్కసారి ఎందుచేత వలస వెళ్లవలసి వచ్చిందో తెలియటం లేదు.

కాని వీరందఱూ పట్టణాలూ మహానగరాలూ నిర్మించినట్లున్నూ ద్వీపంలోని ఆదిమ వాసులకు వాణిజ్య పరిశ్రమలతో సహా నాగరకతనూ, లలితకళలనూ, నేర్పినట్లున్నూ తెలుస్తున్నది. మఱొక సందర్భంలో మలబారుతీరంనుంచి 5000మంది భారతీయులు ఆఱుపెద్ద ఓడలతోనూ, వంద చిన్న పడవలతోనూ ఈ ద్వీపానికి వచ్చారట. ఈకథలు నిజమైనా, అబద్ధమైనా ఇండో-జావాసంస్కృతి ఎలాఉత్పత్తిఅయినదీ ఊహించటానికి మాత్రం తోడ్పడతాయి.

జావా శిలాశాసనాల లిపి వేంగీ పల్లవలిపి. అదిన్నీ క్రీ. శ. 5 వ శతాబ్దం మధ్య కాలం నాటిదిగా కనబడుతున్నది. పూర్ణవర్మన్ అనే రాజు ఒక పెద్ద కాలువ త్రవ్వించినట్లున్నూ దాని ప్రారంభోత్సవం నాడు బ్రాహ్మణులకు వెయ్యి గోవులను దానం చేసినట్లున్నూ తెలుగు శిలాశాసనం వల్ల తెలుస్తున్నది. నెలపొడుపే మాసాదిగా లెక్కించే ఆచారమున్నూ శాసనాలలో కనబడుతున్నది. దీనినిబట్టి దక్షిణభారత పంచాంగమే ఇక్కడా ఆనాడు వ్యవహారంలో ఉన్నట్లు స్పష్టపడుతున్నది.

క్రీ. శ. 414 వ సంవత్సరంలో ఇక్కడికి వచ్చిన ఫాహియాను ద్వీపంలో కొంత మంది బౌద్ధులున్నప్పటికీ బ్రాహ్మణ మతమే ఉచ్చస్థితిలో ఉన్నట్లు గుర్తించాడు, కాని త్వరలో కాశ్మీర దేశవాసి అయిన గుణవర్మ అనే బౌద్ధుడు జావా రాజుకు బౌద్ధమత దీక్ష యిచ్చినందువల్ల తూర్పుజావాలో బౌద్ధం వ్యాపించింది. జావా మధ్య భాగంలోనూ పశ్చిమ

భాగంలోనూ హిందూమతమే నిలిచి ఉండి క్రీ. శ. 8 వ శతాబ్దంలో క్రొత్తహిందూరాజ్యం ఒకటి తల మెత్తింది. క్రీ. శ. 730 వ సంవత్సరం నాటి సంజయరాజు శాసనం ఆరాజు శైవుడనీ, ఒక శివలింగం ప్రతిష్ఠించాడనీ, దక్షిణభారతంతో అతనికి స్నేహసంబంధాలున్నవనీ, స్పష్టంగాచెప్పుతున్నది. క్రీ.శ. 760వ సంవత్సరంనాటి శాసనం ఒకటి అగస్త్యాలయం దానిలోని అగస్త్య విగ్రహం గురించి చెప్పుతున్నది.

క్రీ. శ. 778 వ సంవత్సరంనుంచి 879 వ సంవత్సరం వరకూ జావా శైలేంద్రుల క్రిందికి వచ్చింది. ఈ కాలంలో ఇక్కడ కళ ఎంతో అభివృద్ధి పొందింది. బోరోబదూరు ప్రపంచాద్భుతమైన బౌద్ధస్తూపం ఈ కాలం నాటిదే. వి. ఎ. స్మిత్ అన్నట్లు "పల్లవ చోళ శిల్పకళ జావా శిల్పకళకు చాలా సన్నిహితంగా ఉన్నది". ఈ అద్భుతమైన మానవ ప్రతిభా విజయం పరికిస్తే దక్షిణభారతవర్ష ప్రభావం జావా మీద ప్రసరించినట్లు విశదమౌతున్నది. ఇంతేగాక శైలేంద్రుల చక్రవర్తిత్వం పతనమైన తర్వాత ప్రాచీన శైవరాజ వంశం అధికారంలోకి వచ్చింది. క్రీ. శ. 879-927 సంవత్సరాల మధ్య బోరోబదూరు కట్టడం పద్ధతినే అనేక హిందూ దేవాలయాలు నిర్మించటం జరిగింది. ప్రాంబనం లోని లోరాజాంగ్రాంగ్ దేవాలయం చాలా గొప్పది. ఇది మధ్య జావాలోని ఇండో జావా కళాభివృద్ధిని చాటుతున్నది.

12 వ శతాబ్దంలో తూర్పుజావాలో కదిరిరాజ్యం బయలుదేరింది. దాని రాజులు హిందూమతస్థులై సంస్కృత

సారస్వతాన్ని బాగా ప్రోత్సహించారు. జావాచరిత్రలో 12 వ శతాబ్దం ముఖ్యమైనది. రెండుశతాబ్దాల తరువాత ఏర్పడనున్న సువర్ణయుగానికి ఈశతాబ్దంలో దోహదం జరిగింది. ప్రాచీన హిందూమతపద్ధతులు పునాదిగా 14వశతాబ్దంలో జావాజాతీయ సంస్కృతి అత్యున్నతి పొందింది.

బోర్నియో :— బోర్నియోలో కనబడిన క్రీ.శ. 4వశతాబ్దంనాటి శాసనాల వల్ల అంతకు పూర్వమే అక్కడ హిందూ మతం నెలకొన్నట్లు తెలుస్తున్నది. ఈశాసనాలలో ఉపయోగించబడిన సంస్కృతభాషా, లిపీ, విషయమూ అన్నీకూడా హైందవాలే. అందులోనూ దక్షిణభారతీయులుగానే కనబడుతున్నాయి. "బ్రాహ్మణాధికారమూ, కర్మకాండ అంతటిలోనూ బ్రాహ్మణసమ్మతమైన పద్ధతులూ ఇక్కడ వ్యాప్తిలో ఉండేవని ఈశాసనాలవల్ల తెలుస్తున్నాయి. తూర్పుబోర్నియోలోని ఒక శిథిలదేవాలయం (కలపతోనే కట్టిన గుడి) లో 4 వ శతాబ్దానికి చెందిన శివబుద్ధశిలావిగ్రహాలు కనబడుతున్నాయి.

సయాం :— పాంగ్‌టక్ గ్రామంలో దొరికిన గ్రీసోరోమను దీపం భారతీయదీపికమాదిరిగా ఉన్నది. బుద్ధవిగ్రహం అమరావతీసంప్రదాయంలోఉన్నది. వీటినిబట్టి క్రీస్తుశకం ప్రారంభంలోనే దక్షిణభారతీయులు ఇక్కడికి వలస వచ్చి ఉంటారని ఊహించవచ్చును. ఇక్కడ భూగర్భంనుంచి బయటపడ్డ వస్తుసామగ్రివల్ల 6 వ శతాబ్దంలో ఎప్పుడో ఈవలసరాజ్యం గుప్తుల ఆధిపత్యంక్రిందికి వచ్చినట్లు తెలుస్తున్నది. శ్రీదేబ్

లోనూ ఇంకా దానికి ఉత్తరానా ఉన్న అనేకవిగ్రహాలున్నూ 5 వ శతాబ్దానికో 6 వ శతాబ్దానికో చెందిన ఒక శాసనపు ఖండమున్నూ దక్షిణభారతసంప్రదాయంలో ఉన్నాయి. ఇక్కడి శిల్పాలలో యక్షిణీవిగ్రహం ఒకటీ, విఱిగిన నంది ఒకటీ మాత్రమేగాక యింకా యెన్నో మన దేశంలోని శిల్పాలవంటివి ఉన్నాయి.

క్రీ. శ. 6 — 13 శతాబ్దాలమధ్య వెలసిన ప్రతిదేవాలయం ముఖభాగంలోనూ బ్రహ్మ, శివుడు, విష్ణువు, ఇంద్రుడు అనే హిందూదేవతల విగ్రహాలు ఉన్నాయి. మొదట కొంచెమో, గొప్పో స్వాతంత్ర్యంకల హిందువుల వలసరాజ్యాలు ఇక్కడ బయలుదేఱినట్లు కనబడుతుంది. పరస్పరస్నేహబాంధవ్యాలవల్ల ఈరాజ్యాలలో కొన్ని బాగా బలపడ్డాయి. కొన్ని సందర్భాలలో ద్వీపంలోని ప్రాచీనజాతులు హిందువులతో కలిసిపోయినట్లు కనబడుతున్నది. నేటి చంటాబన్‌కు తూర్పున మూడుమైళ్ళ దూరాన ప్రాచీనహిందువుల నివాసాల గుర్తులు కనబడేచోట కొన్ని సంస్కృతశాసనఖండాలు కనబడ్డాయి.

కాంబోడియాలో మాదిరిగానే సయాములోకూడా రాజాస్థానాలలో బ్రాహ్మణులు ఉండేవారు. బాంగ్‌కాక్‌లో ఇటీవల ప్రజాస్వామ్యప్రభుత్వం ఏర్పడేవఱకున్నూ ఈఆచారం ఉన్నది. 1821 వ సంవత్సరంలో ఇక్కడికి వచ్చిన క్రాఫోర్డుతో ఒక బ్రాహ్మణుడు సయాముకు వచ్చిన తమపూర్వునికి తాను అయిదవతరంవాణ్ణి అనీ, తమ పూర్వులు రామేశ్వర నివాసులనీ

చెప్పారు. అయితే కొంతమంది బ్రాహ్మణులు తాము కాశీ నుంచి వచ్చినవారమని చెప్పుకొంటున్నారు. బహుశః ఇవి రెండున్నూ యథార్థాలే కావచ్చును. ఉత్తరభారతంనుంచీ, దక్షిణభారతంనుంచీకూడా ఇక్కడికి బ్రాహ్మణులు వచ్చి ఉండవచ్చును.

ఫూనన్ - చెన్లాలు — ఇటీవల కాంభోజదేశం (కాంబోడియా) గా పరిణమించిన భూభాగంలో పూర్వం రెండు రాజ్యాలుండేవి. క్రీ. శ. 245వ సంవత్సరంలో ఫూనన్‌కు వచ్చిన ఒక చైనాదేశపు రచయిత ఫూనన్‌లో ప్రవేశించిన భూతప్రేతారాధనాసంప్రదాయాన్ని పరికించి, బ్రాహ్మణులు అక్కడికి వచ్చి తమ మతాన్ని ప్రచారంచేసి ఉంటారని విశ్వసించాడు. కౌండిన్యుడు అనే దక్షిణదేశపు బ్రాహ్మణునికి నాగి సోమ స్త్రీతో సంబంధంవల్ల ఫూనన్ రాజవంశ మేర్పడినట్లు ఒక గాథ ప్రచారంలో ఉన్నది. చెన్లారాజవంశోత్పత్తికిన్నీ ఇటువంటి కథ ఉన్నది.

చైనాదేశస్థుల వ్రాతలనుబట్టి క్రీ. శ. 4వ శతాబ్దం అంత్యంలో కౌండిన్యుడు ఇక్కడికి వచ్చినట్లున్నూ హిందూదేశపు సంప్రదాయాలకు తగ్గట్లుగా అన్ని సంస్థలనూ సంస్కరించినట్లున్నూ ఆ సంస్కారాలతో ద్వీపంలో పూర్తిగా హిందూమతం వ్యాపింపజేసినట్లున్నూ తోస్తున్నది. కౌండిన్యుని తర్వాత ప్రభుత్వానికి వచ్చిన జయవర్మ రుద్రవర్మ మొదలయినవారు చైనాకు రాయబారుల్ని పంపారు. జయవర్మ రాణిశాసనం ఒకటీ, ఆమె కుమారుని శాసనం ఒకటీ కనబడు

తున్నాయి. వీటి లిపి క్రీ. శ. 5 వ శతాబ్దంనాటి దక్షిణభారత శాసనాల లిపిని పోలి ఉన్నది.

ఫూనన్‌లోని ప్రాచీన హిందూరాజ్యకాలం నాటి శిల్ప కళ పరికిస్తే జూదు, సోమసూత్రం (ముకరాకారంలోఉండి నీటిని చిమ్మే యంత్రం) అనే రెండు శిల్పాలు దక్షిణభారత శిల్పాలే అనవచ్చును. ఇక్కడ కనబడే శివలింగాలూ, విష్ణువిగ్రహాలూ, గంధం తీసే సానలూ, 5,6 శతాబ్దాల నాటివిగా ఉన్నాయి.

కంబూజ:- ఇప్పుడు కంబోడియాగా ప్రసిద్ధమైన కంబూజ ఒకప్పుడు ఫూనన్‌కు సామంతరాజ్యంగా ఉండేది. కంబూజ రాజవంశపు మూలపురుషుడు కంబూ మహర్షి సంతతి వాడట! దక్షిణభారతంలోనూ, దాని వలసరాజ్యాలలోనూ ప్రభుత్వంచేసిన రాజవంశాల ఉత్పత్తికి సంబంధించిన కథలన్నీ ఇటువంటివే. ఫూనన్‌లో మాదిరిగానే కంబూజలో కూడా హిందువుల వలస క్రీ. శ. 1 వ శతాబ్దంలోనే తటస్థించినట్లు కన బడుతున్నది. శైవమూ, వైష్ణవమూ ఇక్కడ స్థిరపడి అభి వృద్ధి పొందాయి. క్రీ. శ. 590 వ సంవత్సరం ప్రాంతంలో తన సోదరుడైన చిత్రసేనుని తోడ్పాటుతో భావవర్మ ఫూనన్ దేశపు అధికారాన్ని త్రోసి రాజని, కంబూజరాజ్యాన్ని స్వతంత్రం చేశాడు. భావవర్మ చిత్రసేనుల శాసనాలు 7 వ శతాబ్ది ప్రారంభంనాటి దక్షిణ భారతంలోని పల్లవ శాసనా లను పోలిఉన్నాయి. భావవర్మ శైవ మతాన్ని దృఢంగా విశ్వసించినవాడు. ఇతను నాలుగు శివాలయాలను కట్టించటమే

కాక, అనేక దేవాలయాలలో శివలింగాలను ప్రతిష్ఠించాడు. రామాయణం, మహాభారతం, పురాణాలూ మొదలయిన హైందవ పవిత్ర గ్రంథాలు చదివించటమూ జరుగుతూవచ్చింది. మహేంద్రవర్మ అనే బిరుదనామంతో భావవర్మ వెనుక సింహాసనం ఎక్కిన అతని సోదరుని కాలంలో పొరుగున ఉన్న చంపా దేశపు హిందూరాజ్యంతో స్నేహసంబంధాలు ఏర్పడ్డాయి. మహేంద్రవర్మ తర్వాత రాజైన ఈశానవర్మ శాసనాలు కూడా దక్షిణభారత శాసనాలను పోలిఉన్నాయి. శక వర్షాలు 548, 549 (క్రీ. శ. 626,627)లలోని అతని రెండు శాసనాలలో ఆచార్య విద్యావిశేషుడు అనే పండితుని ప్రసక్తి ఉన్నది. మహారాజు ఈ పండితుణ్ణి ఆధ్యాత్మిక కార్యకలాపాలు పర్యవేక్షణ చెయ్యటానికి నియమించాడు. విద్యావిశేషుడు ఒక దేవాలయాన్ని కట్టించి దానిలో ఒక శివలింగమూ, హరిహరనాథ విగ్రహమూ ప్రతిష్ఠించాడు. ఈ యుగంలో ఇండోచీనాలో శివ విష్ణువులను లేక హరి హర స్వామిని ఆరాధించటం ముఖ్యమైన ఆచార మైనట్లు ఈ శిల్పాలనుబట్టీ శాసనాలనుబట్టీ తెలియవస్తున్నది. ఈశానవర్మ పరిపాలనాకాలంలో వైదికకర్మ కలాపానికీ బ్రాహ్మణాశ్రమాలకూ చాలా ప్రోత్సాహంకలిగింది.

క్రీ. శ. 604 వ సంవత్సరంనాటి ఒక శాసనంలో యోగాన్నిగురించీ, శైవమతంలోని పాశుపతదీక్షను గురించీ ప్రసక్తి ఉండటం గమనించదగ్గది. ముందుగా ఫూనన్‌లోనూ, అటు తర్వాత కంబూజరాజ్యంలోనూ పాశుపతవ్రతస్థులకు ప్రాధాన్య

ఉండేవని శాసనాలవల్ల తెలియవస్తూనే ఉన్నది. [illegible] జయవర్మశాసనం (క్రీ. శ. [illegible]) [illegible] ([illegible]) శైవ మతానికి కేంద్రాలని ప్రకటిస్తున్నాయి. తూర్పు [illegible] ప్రాంతాల సంస్కృతిలో దక్షిణభారత ప్రభావం [illegible] ఎక్కువగా ఉన్నట్లు [illegible] నిరంతరంగా [illegible] [illegible] [illegible] [illegible]. [illegible] పల్లవరాజులు, గంగరాజులు [illegible] [illegible] శాసనాలు చెప్పకపోయినా [illegible] దక్షిణ [illegible] ప్రభావం ఆ ద్వీపాలపై పరోక్షంగానైనా ప్రత్యక్షంగానే ప్రసరించిందని స్పష్టమౌతున్నది. ఈ పరరాజ్యాలలోని హిందూనాయకులు మాత్రం దేశ సంస్కృతిని ఎన్నడూ నశింపనివ్వకుండా కాపాడుతూ వచ్చారు.

కంబూజ దేశాన్ని పాలించిన [illegible] రాజులలో ఒకడైన రెండవ సూర్యవర్మ (క్రీ॥శ॥ 1112–52సం॥) ఆధిపత్యాన అంగ్‌కోర్ వాట్ దేవాలయ నిర్మాణం ప్రారంభమైనది. ఇది చాల పెద్దది. రకరకాల చిత్రాలతో పురాణగాథలనూ, హరివంశ కథనూ ప్రదర్శిస్తూ దక్షిణభారత సంప్రదాయానుగుణంగా ఈ విగ్రహాలనూ నిర్మించారు. అంగ్‌కోర్ వాట్ దేవాలయం లోని శిల్పకళ బోరోబదూర్‌లోకంటేకూడా ఉన్నతమైన ఆధ్యాత్మికపథంలో సాగింది.

ఖ్మేర్ అనే ప్రాచీన కంబూజవాసులు తిరిగి బలపడటంతో తలయెత్తిన బౌద్ధమతం హిందూమతంలోని దేవతలను క్రమక్రమంగా అంగీకరించి తనలో కలుపుకొన్నది. అటు

తర్వాత ప్రాచీన హిందూమతాచారాలు సామాన్యప్రజలలోకంటె పైతరగతుల ప్రజలలో ఎక్కువగా స్థిరపడ్డాయి. ఫ్నమ్‌పెన్హ్‌లో రాజాస్థానాలలో ఉండే బ్రాహ్మణులు ఆనాటి కిన్నీ రాజోద్యోగులచేత ప్రమాణాలు చేయించటంలోనూ ఇతరోత్సవాలలోనూ ప్రాముఖ్యం వహిస్తూనే ఉన్నారు. ఆయా సందర్భాలలో వారు చేసే ప్రార్థనలు సంస్కృత సమ్మిళితాలై దక్షిణభారత గ్రంథ లిపిలో ఉండేవి. క్రమేణాఅంతా నిర్వివాదంగా హైందవమయిపోయినప్పటికీ చిట్టచివరకు హిందువులున్నూ ఖ్మేర్లున్నూ ఏకజాతిగా కలిసి పోయి ఖ్మేర్ సంస్కృతికి దోహదం చేశారు.

చంప:- కంబోడియాకు తూర్పున ఉన్న "దక్షిణ అన్నాం" అనేదే వెనుకటి చంపా రాజ్యం. ఇక్కడ హిందువుల వలస క్రీ. శ. 2 వ శతాబ్దానికి ముందే ప్రారంభ మైనది. ఈ "చంప" అనే పేరు ఉత్తరభారతంలోని అంగదేశ రాజధాని పేర వచ్చినదే అని అంటున్నారు కానీ "చంప" అనే నామాంతరం కల కావేరీ పట్టణం (ప్రాచీన చోళ రాజధాని) పేరనే ఈ పేరు పుట్టిందని భావించటం అసమంజసం కాదు. చంపాప్రాంతంలో దొరికిన ప్రాచీన శాసనం ఒకటి దక్షిణభారత లిపిలోనేఉండటం ఈ ఊహను బలపరుస్తున్నది. క్రీ. శ. 350 సం॥ ప్రాంతాన రాజ్యంచేసిన భద్రవర్మనాటి ప్రాచీన శాసనాలు ఇందుకు తగిన ఉదాహరణాలు. ఈ శాసనాలలోని కొన్ని విశిష్టమైన నుడికారాలు తెలుగు భాషకు చేరువగా ఉండటం

చేత మొట్టమొదట ఇక్కడికి వలస వచ్చిన వారు ఆంధ్రదేశం నుంచి వచ్చినవారే అని ఊహించ వలసివస్తున్నది. డాంగ్ డ్యూయాంగ్‌లోని బుద్ధవిగ్రహం అమరావతీశిల్పపద్ధతిలో ఉన్నది. ఈ డాంగ్‌డ్యూయాంగ్ ప్రాంతానికి అమరావతి అనే పేరు ఉండటం కూడా గమనించవలసిన విషయం. భద్రవర్మ 'ధర్మ మహారాజు' అనే బిరుదం వహించాడు. (వర్మ అనే పదంగురించిన విచారణ అలా ఉండగా) దక్షిణభారతంలోని పల్లవ రాజులూ, కాదంబరాజులూ ఇదే బిరుదం వహించారు. అందుచేత ఇది దక్షిణభారతంనుంచి ఎరవుతీసికొన్నదే అని చెప్పవచ్చును. భద్రవర్మ గొప్ప శివభక్తుడు. ఇతడు మిజాన్‌లో ఒక శివాలయాన్ని కట్టించాడు. చంపారాజులకు చైనావారితో తరుచూ యుద్ధాలు జరిగేవి. 8 వ శతాబ్దంనుంచీ శైలేంద్రులు కూడా చంపమీద దండయాత్రలు సాగించారు. కాని ఆరియే నైట్ల దండయాత్రలు మాటిమాటికీ భయంకరంగా సాగాయి. చివరకు క్రీ. శ. 1318 వ సంవత్సరంలో చంపారాజ్యం వారి పాలై పోయింది.

ఒక వెయ్యి సంవత్సరాలకు పైగా చంపారాజ్యం హిందువుల యేలుబడిలో ఉన్నది. హిందూసంస్కృతీ, హిందూమతమూ ఈసీమలో వేళ్ళు నాటుకొన్నవి. శైవం ఇక్కడి ప్రధానమతం. ముఖలింగరూపమూ, నటరాజ విగ్రహమూ ప్రసిద్ధికి వచ్చాయి. కడపటిదశలో వైష్ణవం రాజాశ్రయం సంపాదించింది. రాజులున్నూ వైష్ణవులయినారు. బ్రహ్మ, హరి

హార విగ్రహాలూ, హాటిని ఆరాధించటమూ విశేషించగా బౌద్ధం హిందూమతానికి అణిగిమణిగి ఉన్నది. శాసనాలు చతుర్వేదాలూ, షట్శాస్త్రాలూ, 64 కళలూ, పురాణాలూ, ధర్మ శాస్త్రాలూ మొదలయిన సంస్కృత గ్రంథాలూ సంస్కృతి విశే షాలను పేర్కొంటున్నాయి. కేరళదేశంలో భగవతీపూజ సనాతనాచారంగా కనబడుతున్నది. ఈ అర్చనకు ఆదిపీఠమైన మలబారునుంచి ఇది యిక్కడకు వ్యాపించివుండవచ్చును. పోనగర్ లోని ఉమాభగవతి ఆలయం, కాలక్రమేణా నానామార్పులు పొందినా ఇప్పటికీ నిలిచే ఉన్నది. భగవతీపూజ ప్రారంభమైన నాటినుంచీ చంపా ప్రాచీనవాసులంతా బాలివారు పూజా సమయాలలో గంధం ధరించటం ఆచారమైనది. దక్షిణభార తంలో వలెనే యిక్కడకూడా మతగ్రంథాలను తాటిఆకుల మీద వ్రాసిపెట్టుకోవటముకూడా కలిగింది.

సింహళం:- క్రీ॥పూ॥ 5వశతాబ్దంలోనే సింహళంలో ఆర్యులకు ప్రాబల్యం కలిగింది. సింహళప్రజలభాష పాళీభాషకు సంబంధించినదే, క్రీ॥పూ॥ 2వశతాబ్దంలో ఎలారా అనేతమిళుడు కుట్రతో రాజ్యాధికారం చేజిక్కించుకొన్నాడు. కాని సింహళ రాజు మళ్ళీ రాజ్యం స్వాధీనం చేసికొన్నాడు. తర్వాత ఇద్దరి మధ్యనూ కొంతకాలం పోరాటం సాగింది. 8వశతాబ్దంనుంచీ పాండ్యచోళరాజులు సింహళంమీద దండయాత్రలు మొదలు పెట్టారు. దీనితో సింహళరాజులునూ దక్షిణభారతరాజకీ యాలతో సంబంధం కలిగించుకోవటం ప్రారంభించారు. ఒకటవ

రాజరాజు కాలంలో విజయబాహు తిరిగి దేశాన్ని జయించాడు. మూడవకులోత్తుంగుడు సింహళరాజులను కొన్ని సార్లు జయించి నట్లు ప్రకటించుకొన్నాడు. తమిళులపై బౌద్ధమత ప్రభావం చాలా ఎక్కువగానే ప్రసరించినా, దక్షిణభారతీయమైన సంస్కృతీసంపత్తికూడా వారి అభిమానాన్ని చూరగొన్నది. ప్రసిద్ధికెక్కిన చోళకాంస్య (కంచు) విగ్రహాలు సింహళంలో కూడా బయలుదేరాయి. పోలోనోరువాలో తమిళభక్తుల విగ్రహాలు చాలా అందమైనవి. ఇవి ఈనాటికికూడా ఉన్నాయి. ఇవి దక్షిణభారతంలోని వాటికంటెనూ మేల్తరమైనవని విజ్ఞులు భావిస్తున్నారు.

వలస స్వభావం :— కాబట్టి తూర్పుదేశాలలో భారతీయుల వలస రాజకీయమైనది కాదని స్పష్టపడుతున్నది. వలస వెళ్లినవారికి మాతృదేశపు ప్రభుత్వం యాజమాన్యం కానీ, తోడ్పాటు కానీ లేవు. చాలామంది వర్తకప్రధానులై వెళ్ళారు. కొందరు సుఖజీవనంకోసం వెళ్ళారు. వీరందఱూ తమ మత సంప్రదాయాలూ, సంఘనిబంధనలూ, సంస్కృతి సంపదా విసర్జించినవారుకారు. తాము వెళ్ళినచోట అనాగరకులుగా కనబడుతున్న ఆదిమజాతులతో స్నేహంచేసి, తమ నాగరకత వారికి ప్రసాదించారు. సుదూర దేశాలలో పరివ్యాప్తమైన భారతీయ సంస్కృతి ఆ యా దేశాలలోని ప్రాచీన సంస్కృతిని విధ్వంసం చెయ్యలేదు. పైపెచ్చు ఫలప్రదమైన భారతీయ సంబంధంవల్ల ఆ యా దేశాలలో అనేకవిధాలైన

సంస్కృతులు వర్ధిల్లి ఆసియాసంస్కృతిసంపద అనంతం అనిపిం చాయి. ఈవిధమైనవలసలలో మొదట వర్తకునికి, తర్వాతసాహసికునికి చివఱకు మతాచార్యునికి ప్రాముఖ్యం ఏర్పడ్డది. దక్కనులోనూ, దక్షిణదేశంలోనూ కూడా అనేకులు ఈ వలసలలో పాల్గొన్నారు. ఈ రంగంలో త్రోవచూపిన ఘనత ఆంధ్రులదే. తర్వాత తూర్పు పడమటి తీరాల తమిళ రాజ్యాలవారు ఆంధ్రులను అనుసరించారు. కాలాభ్రుల దండయాత్ర మూలాన క్రీ. శ 3 వ శతాబ్దంనుంచీ తమిళదేశంలో ఏర్పడ్డ అస్థిమితత్వమూ, పులకేశి వేంగిని జయించినతర్వాత ఆంధ్ర దేశంలోని అనిర్ణీత పరిస్థితీ, ఈ వలస ఉద్యమాలకు ప్రోత్సాహకరా లయినాయి. సముద్రాలు అధిగమించి ఇతర దేశాలలో సస్నేహంగా వర్ధిల్లిన దక్షిణ భారతీయ సంస్కృతి చరిత్రకు ఆసియాం చరిత్రలో చాలా ప్రాముఖ్యం ఉన్నది. దక్షిణ భారతంలో సాగుతున్న ఈ వలస విధానాన్ని గమనించి ఉత్తర భారతంలో వంగదేశీయులున్నూ వలసలకు బయలుదేరారు. హిందూదేశ చరిత్రలో ఈ సంస్కృతి పరివ్యాప్తి నిశ్చయంగా ఒక గర్వకారణమైన విజయంగా పరిగణించ దగ్గది. "విదేశవాతావరణాలలో భారతీయ మతాలూ, భారతీయ సంస్కృతీ ఎలా నిత్యనూతనంగా వికసించాయో, ఎలా అనేక శతాబ్దాల వఱకూ నిలద్రొక్కుకొన్నాయో! ఇది భారతదేశ చరిత్రలో చిన్నటికి ఉల్లంఘించరాదనీ, మనోరంజకమైనదీ, తగినంతగా మెప్పులనుకూడా పొందినదీ అయిన ప్రకరణం అని ఒక అధునాతన చరిత్రకారుడు అంటున్నాడు.

DAKSHINA BHARATA CHARITRA. Rs. 2.50.

BY DR. K. K. PILLAI

## గ్రంథం : గ్రంథకర్త

ఇది కేవలం రాజవంశాలను, యుద్ధాలను, తేదీ శక సంవత్సరాలనూ, వరుసగా ఏకరువుపెట్టే సామాన్య చరిత్ర గ్రంథాల వంటిది కాదు. దక్షిణ భారతంలో దాదాపు 5 లక్షల సంవత్సరాలుగా ఎలాంటి మానవులు నివసిస్తూ వచ్చినదీ, వారి జీవన విధానాలు, అనేక విశ్వాసాలు, విజ్ఞాన సంస్కృతులూ చారిత్రకాధారాలతో ఈ గ్రంథంలో వివరింపబడినవి.

చారిత్రక పరిశోధన లోను, రచనలోను సిద్ధహస్తులైన శ్రీ కె. కె. పిళ్లై సామాన్య పాఠకులకు కూడా మనోరంజకంగా ఉండే విధంగా ఈ గ్రంథాన్ని రచించారు. ఆయన ఆంగ్లమూలానికిది సరళమైన తెనిగింపు.

**The Modern Publishers, (Regd.)**

**TENALI.**

వెల: రు. 2.50

దక్షిణభాషా పుస్తక సంస్థ సహకారమున ప్రకటితము.